

సుచిత్ర మాసపత్రిక

మాచవరం

విజయవాడ-4

విడిప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 7

జులై 1969

సంచిక 7

మేనేజింగ్ ఎడిటర్

వి. వి. రాఘవయ్య

---


Edited and Published by V. V. Raghavaiah and Printed by himat Jyothi Printers, Machavaram, Vijayawada-4



**ఆట - ఆనందం**—ఇదొక వినోదం. స్విట్జర్లాండులో మంచుప్రదేశంలో పాదాలకు గిట్టలు తొడుగులువేసి చకచకా నడిచి పరుగెత్తుతారు





## బ్రిటిష్ బస్

కంట్రోల్ బ్రేక్ గమనం అంతా చక్కగా అమర్చిన ౩5 సీట్లుగల కొత్తరకం బ్రిటిష్ బస్ విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు ఎగుమతిలోనే బ్రిటిష్ చిలక ప్రాణం ఉన్నది



మైన శ్రీ కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ గారి కవిత "డాక్టర్ విలు నా మా ఎంతో స్వీట్‌గా ఉంది. ఎంతో భావ స్ఫోరకంగా, ప్రబోధాత్మకంగా ఉంది. డాక్టర్ తంగిరాలగారి "నీరాజనం" కూడ బావుంది. ఇలాంటి కవితలు ముందుముందు. తరచు ప్రచురించండి.

— రోహిణి
రెజిమెంటల్ లైన్స్
"బృందవిహారి"

[మీ ఉత్తరాన్ని సంపూర్తిగా అర్థం చేసుకున్నాం. పత్రికా నిర్వహణలోనున్న అనేకానేక కారణాలే మీ ప్రశ్నలకు సరైన జవాబు. ఆచరణ యోగ్యమైన ప్రతి సూచనా అంగీకరిస్తాం. సం॥]

ప్రచురించిన కథలన్నీ అమోఘంగా వున్నాయి. "అర్థంగాని కథ" భరిడిపాటివారి పేరు నిలబెట్టేంత బ్రహ్మాండంగా వుంది. "జోగులు" హృదయాన్ని కలచివేసే అద్భుతమయిన చక్కని కథ అని ఒప్పుకోక తప్పదు. "సంసారంలో సరిగమలు" శ్యామ్లీ ప్లావింగ్‌వారి గొడవలాగుంది. శాజీ ప్రసాద్‌గారి

రెండే రెండు ప్రతినెల ప్రచురించగలరు. జోక్స్ అన్నీపాతకాలంనాటివి. "గోమతి" సీరియల్ సమాప్తం అని చదివేసరికి యేదో వెలితి అనిపించింది.



## ఆయురారోగ్యాభివృద్ధికి రోజా పువ్వులు:

రోజా పువ్వులు ఆయుః ప్రమాణాన్ని, ఆరోగ్యాన్ని పెంచుతాయంటున్నారు జర్మన్ శాస్త్రజ్ఞులు. పశ్చిమ జర్మన్ మాజీ ప్రధాని కీ. శే. కోనరాడ్ అడెనోవర్ 91 సంవత్సరాలు జీవించటానికి అంత పండు ముసలితనంలోగూడా పడుచువాడిలా చురుకుగా ఉండటానికి ఆయన గులాబీ తోటను పెంచి రోజూ దానిలో విహరించటమే కారణమట.

# గాంధి జీవిత చిత్రం

గాంధీగారి మహోజ్వల జీవితగాథకు ఉచితమైన స్మారక చిహ్నము నిర్మించుకోవాలని దేశమంతా ఆరాటపడుతోంది. అనేక ప్రణాళికలు తయారు చేయబడుతున్నాయి. అలాంటివాటిలో, గాంధీగారి జీవితాన్ని ఫిలింతీయాలనీ, అదీ "డాక్టర్ కోట్నిస్" చిత్రం తయారుచేసిన శాంతారామ్‌చేతనే తీయించాలనీ యీమధ్య కొందరు అనుకొన్నారని "బ్లిట్జ్"లోని ఫిలిం వ్యాసంవల్ల తెలుస్తోంది. ఇదిచాలా అభినందనీయమైన ప్రయత్నం. ముందుయుగాల వారికి అత్యంతోపయోగకరమైన రూపంలో గాంధీగారి జీవిత చరిత్రను, ఆయన సందేశాన్ని మనం అందచేయగలిగిన వారమౌతాము. అలాంటిచిత్రం తీయగల సమర్థత శాంతారామ్‌కే వుందనటం అతిశయోక్తి కాదు.

కాని ఆ చిత్రాన్ని మనం ఇంత త్వరగానే మొదలు పెట్టాలా? గాంధీగారు తన జీవితకాలంలో అనేక కారణాలవల్ల, మన దేశంలో తయారవుతున్న చిత్రాలను సహించి హర్షించలేదు. ఆయనకు సినిమాలు చూడటంకంటే ఎక్కువ ముఖ్యమైనపని ఎల్లప్పుడూ వుంటూనే వుండేది. పర్యవసానం. సరోజినీ నాయుడు ఆయనను "మిక్కీమౌస్" అని పిలిచినా, ఆయన కదేమంత అర్థంకాలేదు; ఆయన ఇంగ్లండుకు పోయినప్పుడు చార్లీ చాప్లిన్ ఆయనను చూడటానికివస్తే, ఆయన ఎవరో ప్రక్కవారిని అడిగితేనేకాని ఆయనకు తెలియకుండా పోయింది.

విద్యా బోధనలో సినిమా వుపయోగకరమైన సాధన అయ్యేదిగా యింకా రుజువు కాలేదని వారు నమ్మేవారు. గాంధీగారికి, తన సిద్ధాంత ప్రచారానికి సినిమా చాలా వుపయోగకరమైన సాధన అనే నమ్మకాన్ని ప్రజలంతా కలిసి కలిగించ దలచినట్లయితే, యితరులు చెప్పేదాన్ని విని, తర్కించుకొనే తత్వంగల గాంధీగారు, తన దృక్పథాన్ని మార్చుకొని వుండేవారు. ఫిలిం నిర్మాతల ధనకాంక్ష మూలంగా మానవుని లోని నీచవాంఛలను రేకెత్తించే చిత్రాలు ఎక్కువగా తీయబడిన కారణంగా, గాంధీగారు సినిమాను వ్యసనంక్రింద పరిగణించటం జరిగింది.

కాబట్టి ఆయన జీవితచరిత్రను చిత్రంగా తీయబోయేముందు, ఫిలిం నిర్మాతలు తాము ఇంతవరకు డబ్బుకోసం చేసిన పాపాలకన్నిటికీ పశ్చాత్తాపపడి, ఆ పాపాలను కడిగివేసుకోవటం కోసమైనా, గాంధీగారు బ్రతికివుంటే ఎలాంటి చిత్రాలను చూచి హర్షించేవారో, అలాంటి చిత్రాలనే తీస్తామని ప్రతినపూనాలి. ఆయనజీవిత కాలంలో, ఆయన ఆదర్శాలను మనం అందుకోలేక పోయినప్పటికీ, వారి తదనంతరమైనా వారితో సమకాలీనులుగా వుండటానికి కావలసిన అర్హత మనకున్నదనే విషయాన్ని, మన ముందుతరముల వారికోసం ఋజువు చేసుకోవలసి వుంది. గాంధీగారి నిర్యాణం సినిమా పరిశ్రమని—కనీసం అందులో పనిచేస్తూ, దైనందిన సాంఘిక, రాజకీయ శక్తులను గురించి కొంచమయినా తెలుసుకొంటూ వున్న వారందరినీ—విషాద సముద్రంలో ముంచింది.

కాని, సినిమా పరిశ్రమ విషయం ఏమిటి? ఫిబ్రవరి 4 న సెంట్రల్ స్టూడియోస్ (బొంబాయి) నిర్మాతలు, దర్శకులు, నటులు, అందరూ సమావేశమై, గాంధీగారి మృతివల్ల తమకు కలిగిన విచారాన్ని రెండు నిమిషాలపాటు నిశ్శబ్దంగా నిలబోవటంలో వ్యక్తపరిచారు. అంతమాత్రం చాలదు—ఎవరైనా ఆయనపట్ల గౌరవం, ప్రేమ ప్రదర్శించాలంటే, ఆయన ఏఏ ఆదర్శాల కోసం కష్టపడ్డారో, వేటికోసం బలైనారో, వాటిని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించాలి. ఆ సమయంలో వారందరూ తాము యికమీద తీయబోయే చిత్రాలన్నిటికీ మహాత్ముని ఆదర్శాలే ఆదర్శంగా వుండాలని నిర్ణయించుకోవాలి; ప్రబోధకం కాని చవకబారు చిత్రాలు యింక తీయమని ప్రతినపూనాలి. అలాంటి శపథం వారా

(మిగతా 25వ పుటలో)

## దానం : ధర్మం : విధి



రాకుమారి ఎలిజబెత్ పెండ్లికి దేశ దేశాలనుంచి వచ్చిన కానుకలలో ఆహారం చాలావుంది దానిని పార్సెళ్లు కట్టి, పింఛన్ పొందే వృద్ధులకు, జీవనాధారం లేని పిల్లల తల్లులైన వితంతులకు పంచి పెట్టినారు ప్రతిపార్సెల్‌లో కృతజ్ఞత కలిగిన రాకుమారి ఉత్తరం కూడా పంపినారు.

# జరూరుగా కావలసిన పనులివి

మద్రాసు రాష్ట్రశాసన సభలో ఫ్రాస్ కొబడిన శిస్తుతగ్గింపు బిల్లువలన పట్టా రైతులకే తప్ప కష్టపడి పండించే లోపాయి కారీ రైతులకు మేలుకలుగదు. పైవిషయమును గురించి ప్రజలకు ప్రాతినిధ్యము వహించిన రాష్ట్రప్రభుత్వము నిరుపేదలగు లోపాయికారీ రైతులకు వర్తించేటట్లు సదరు బిల్లును మార్చవలసిందిగా యీ సభ వారు ప్రభుత్వము వారిని కోరుచూ తీర్మానించుచున్నారు.

శిస్తులు తగ్గింపుచట్టము ననుసరించి శిస్తులు నిర్ణయించుటకు యేర్పరచబడిన ఉద్యోగులు ఆయాప్రాంతాలలో శిస్తులు నిర్ణయించుటలో జిల్లా, తాలూకా రైతుకాంగ్రెసు సంఘాల సలహాలను తీసికొనుటకు సంప్రదింపులు చేయవలెనని మద్రాసు ప్రభుత్వమువారు తన ఉద్యోగులకు ఉత్తర్వులు జారీచేయించాలని యీ సభవారు కోరుచూ తీర్మానించుచున్నారు.

ఇప్పుడు నడుస్తూయున్న క్రీస్తుశకము నకు బదులుగా గాంధీశకం మహాత్మా గాంధీజీనిర్యాణము చెందినవాటినుండి ప్రారంభించవలెననియు, ఆదివారము సెలవుదినము మహాత్ముడు అవతారము చాలించిన శుక్రవారమునకు మార్చి ఆదినమే సెలవు దినముగా పరిగణించవలెననియు స్వతంత్ర భారతావనిలో నాణెములపైన మహాత్ముని శిరస్సును ముద్రింపవలెననియు ప్రభుత్వము వారిని కోరుచూ యీసభవారు తీర్మానించుచున్నారు.

జమీందారీ రద్దుబిల్లు శాసనం రూపము దాల్చి అమలులోకి వచ్చేవరకు, శిస్తులు తగ్గింపు జరిగేవరకు రెంటుసూట్లు విచారణ నిలుపు చేయాలనియు, శిస్తుబకాయిలు వసూళ్లు డిక్రీలు అమల్లు ఆపుచేయాలనియు ఈ సభ వారు ప్రభుత్వమును కోరుతూ తీర్మానించుచున్నారు.

ప్రభుత్వమువారు మేజరు ప్రాజక్టులను అమలు పరచేముందు మైనరు యిరిగేషను స్కీమును తక్షణం అమలుజరిపి వెనుకబడి యున్న విశాఖజిల్లా ప్రజలకు మేలుచేకూర్చమని కోరుచూ ఈ సభవారు తీర్మానించుచున్నారు.

శిస్తులు తగ్గింపు చట్టప్రకారం శిస్తులు తగ్గింపుచేయుటలో ప్రస్తుతం రైత్వారీ రేట్లననుసరించిగాక పెర్మనెంటు సెటిల్ మెంటు రేట్లప్రకారం శిస్తుల నిర్ణయం చేయాలనియు, రైత్వారీ రేట్లకూడా పెర్మనెంటు సెటిల్ మెంటు రేట్లప్రకారం నిర్ణయించాలనియు ఈ సభవారు మద్రాసు గవర్నమెంటువారిని కోరుచున్నారు.

ముందుముందు యేవో శాసనాలు అమలుకి వస్తాయనే అపోహలతో కౌలుదార్లుగా (లోపాయికారీగా) ఉన్న రైతులను ప్రస్తుతము భూములనుండి తొలగించుటకు గాను భూఖామందులు ప్రయత్నించుచున్నందున అనేక చోట్ల అమాయక రైతులు తుపాకి కాల్పులకి బలికావడం తీవ్రమైన అశాంతి ఆందోళనలు ప్రబలుచున్నవి. గాన ప్రభుత్వం యీ పరిస్థితిని విచారించి రైతాంగ రక్షణకు వెంటనే యీ దిగువచర్య గైకొన వలసిందని యీ సభవారు కోరుచున్నారు.

1 చట్టానికి విరుద్ధముగా లేక శిస్తుదారుల కట్టుబడులు, వ్యవసాయపు మదింపులు సక్రమముగా కొనసాగిస్తున్న కౌలుదారులను భూఖామందులు ప్రస్తుతము తొలగించరాదని శాసించాలి.

పైషరతులకు వ్యతిరేకముగా వ్యవహరించిన వారెవరైనాయుంటే వారినికోర్టు ద్వారా తొలగించాలి.

ప్రభుత్వము పైనిసూచించినరీతిని ఒక ఆర్డినెన్సును వెంటనే అమలు చేయాలి లేనియెడల అధికాహారోత్పత్తి కేగాక సామాన్య వ్యవసాయమునకే దెబ్బతగులు నని యీ సభవారు తమతీవ్రఅభిప్రాయమును ప్రకటించుచున్నారు.

ఈమధ్యన అలమండలో మొకాసాదారులకు, రైతులకు మధ్యజరిగిన సంఘర్షణలో చేసిన కాల్పులు ఫలితంగా దెబ్బలు తిని మరణించినవారికిన్ని, బాధలకు గురియైన రైతుల పట్లను ఈ సభవారు తమ సానుభూతిని ప్రకటించుచున్నారు.

అలమండ రైతులు వారి హక్కులను రక్షించుకొనుటకు పడుచున్న లావాదేవీలలో యీ జిల్లాలోని యావత్తు రైతాంగమేగాక ఆంధ్రదేశములోని రైతాంగమంతా తోడ్పడవలెనని హెచ్చరించుచున్నారు.

—విశాఖ రైతుల కోర్కెలు.

---

## అసహాయ శూరుడు



సంస్థానాలను దారికి తెచ్చినవాడితడే ఇతడేమనుకుంటే అది కావలసిందే. నైజాంలోనే ఈయన తరుణంకోసం వేచిఉన్నాడు. రాజన్యులు చెప్పిన మాట వింటున్నారు గనుక, సంస్థానాలలో ఆందోళనను ప్రజామండలులు ఆపివేయవలసిందని ఈయన ఆదేశిస్తున్నాడు. ఈ సలహా ఎంతవరకు సముచితమో కాలమే చెప్ప గలదు.

# పాకిస్తాన్‌లో ప్రజాపక్షం : కొత్తపార్టీ

పాకిస్తానులో కొత్తపార్టీ ఏర్పడింది దానికి సరిహద్దు గాంధి నాయకుడు. అఖిల పాకిస్తాన్ ప్రజా పక్షం ఆ పార్టీ నామధేయం. ఈ పార్టీ ప్రథమ మహాసభ కరాచీలో ఏప్రిల్ 10 న జరుగుతుంది. పాకిస్తాన్ పౌరులందరూ పార్టీ సభ్యులు కావచ్చును. స్వతంత్ర సోషలిష్టు రాష్ట్రాల కూటం స్థాపన జేయవలె నని ఈ పార్టీ సంకల్పం. వైజ్ఞానిక, భాషా విషయక ప్రాంతీయ స్వేచ్ఛను కల్గించడం ఈ పార్టీ ఆశయం, * ముస్లిం లీగ్ ఇండియాలో రద్దు కాలేదు. చెన్నపట్నంలో కూడిన లీగ్ కౌన్సిల్ మెజారిటీ లీగ్ కావలెనన్నారు. రాజకీయాలు వదలి, విద్య — మతం — విజ్ఞానం — ఆర్థిక వ్యవహారాలలో సంఘ సంస్కారానికి లీగ్ పూనుకుంటుంది. * నైజాంలో సాధారణ పరిస్థితి రాగానే ఇత్తెహాద్ రజక్కార్ మామూలుగానే పనిచేస్తున్నదని కాశిం రజ్వీ ప్రకటించాడు. అసాధారణమైన ప్రస్తుత పరిస్థితులలో రజక్కార్ దారుణ చర్యల నరికట్టడానికి వీలు లేదు. నైజాం దానిని ప్రోత్సహించడం అబద్ధం! హైదరాబాదు ప్రజల అభీష్టం తెల్సుకోటానికి జనవాక్య నిర్ణయానికి పూనుకోడం ప్రమాదకరం! వివిధ పక్షముల ప్రచారం ప్రజలను రెచ్చగొట్టి మతకలహాను ప్రేరేపిస్తవి. వాస్తవం తప్పిన మాట! నిజంగా, కాశిం రజ్వీ అతిశాంతి ప్రియుడు, అతడి వల్లనే నైజాంలో స్థితిగతులు ఇప్పుడున్నట్లున్నవి!

జాన్ మసారిక్ మార్చి 10 న మర్‌గయా ఆత్మహత్య గావించుకున్నాడు. జెక్ విదేశాంగ మంత్రిగా ఇటీవలి, ప్రతిష్ఠంబన అనంతరం తిరిగి నియమింపబడి, ఇంతలో ఇంతగా తన్ను తాను చంపుకోవల్సిన పని ఏమివచ్చింది? ఆంగ్ల—అమెరికన్ రాజకీయ వేత్తలకు ప్రచారానికీ—పుకార్లకూ—నీలాపనిందలకూ మంచి సాధనం లభించింది. నిజం మసారిక్ మరియూ ప్రధానమంత్రి ఎరుగుదురని మా భావం. రష్యాయే జెక్ ప్రజలను రక్షించగలదని మార్చి 6 న మసారిక్ ప్రకటించాడు. డీవెలరా దేశంలో క్రిందపడినా, అమెరికాలో పైచేయి సంపాదించాడు. బొంబైలోని తెలుగువాడు ఆంధ్రముఖం చూడగానే ప్రసన్నుడైనట్లే న్యూయార్క్‌లోని ఐరిష్‌వంశీకుల సంతానం డీవెలరాను చూడగానే ఉప్పొంగినారు.

## లడాయి కి తయార్



ఉక్కు పిండం!

కార్పొరేషన్‌లో అఖండ సన్మాన మిచ్చినారు. ఈ పర్యాయం యుద్ధం వస్తే ఐర్లాండు ఏమిచేస్తుందో చెప్పజాలనని డీవెలరా అన్నాడు. మార్షల్ సహాయాన్ని ఆహ్వానించాడు. గోధుమ, మరికొన్ని ఆహార దినుసులు ఐరిష్ ప్రజలకు అవసరమట. స్వయం సహాయం, పరస్పర సహాయం రెండూ కావలెనన్నాడు. కమ్యూనిజమునకు ఐర్లాండు విరోధిఅని ప్రకటించాడు. ప్రపంచ రాజ్యసమితి పనికిరాదనీ, యుద్ధం ఆసన్నమైనదనీ డీవెలరా స్పష్టంగా చెప్పనాడు. * బ్రిటన్—ఫ్రాన్సు—లగ్జెంబర్గ్ హాలండు—బెల్జియం దేశాలు అయిదుకల్సి పాశ్చాత్య యూరప్ యూనియన్ ఒకటి ఏర్పాటు చేసుకోడానికి పూనుకున్నవి. అగ్రిమెంటు ముసాయిదాలో ఏడు పాయింట్లున్నవట. వివరం తెలియలేదు. ఆర్థిక సహకారం విషయంలో బ్రిటన్ కొన్ని సవరణలు సూచించింది. * జెక్—బల్గేరియా పరస్పర సహాయపు అగ్రిమెంటు కుదరబోతుంది.

జర్మనీయేకాదు మరేదేశమైనా ఇద్దరిలో ఒకరిమీదికి దండెత్తివస్తే, రెండవపార్టీ సహాయానికి వస్తుంది. * ఫ్రెంచి దేశాన్ని ఆపదలోనుంచి తప్పించి, అమెరికా సాయంతో, రష్యా ప్రమాదంనుంచి రక్షించడానికి తాను సిద్ధంగా వున్నానని డీగాలె ప్రకటించాడు. 25 కోట్లమంది యూరప్ వాసులను స్వతంత్ర దేశాలలోని ప్రజలను కలిపి కట్టుగానడిపిస్తే, యూరప్‌ను రక్షించవచ్చునన్నాడు. * జెక్ ఉదంతం అనంతరం ఇంగ్లాండులో ఒక లేబర్ సభలో మాట్లాడుతూ, కమ్యూనిస్టులకూ సోషలిస్టులకూ పొత్తు కుదరదని ఆంగ్ల ఉపప్రధాని హెచ్చరించాడు. * అంతర్జాతీయ వ్యవహారాలు ఇండియా పార్లమెంటు చర్చించినపుడు వాటిని నెహ్రూజీ విశదీకరించినాడు, రాబోవు యుద్ధంలో ఎటుబోతామో తెలియడంలేదు, స్వతంత్రంగా వుండాలనే తీర్మానం మంచిది.— విదేశీ వ్యవహారాలకు పంపేవారిని కొంచెం అధికతర సమర్థులుగావుంటే బాగుంటుందని విషయజ్ఞుల అభిప్రాయం. * మాజీచక్రవర్తి బావోదాయ్ పెత్తనంలో ఒక వియత్నాం దేశీయ ప్రభుత్వాన్ని స్థాపన జేయాలని ఫ్రెంచి సామ్రాజ్యవాదుల సంకల్పం. * ఇండోనేషియాలో కొందరు ప్రజానాయకులను దగ్గరతీసి వారి సాయంతో డచ్ పెత్తందార్లు గవర్నర్ జనరల్ వాన్‌మూక్ ఆధ్వర్యాన ఒక ప్రభుత్వాన్ని స్థాపన జేశారు.

# యుద్ధానికి దోవ ఇదే

## భయం పడవద్దు



అమెరికా విదేశమంత్రి మార్షల్

ఫిన్లాండు సోవియట్ రష్యాతో మిలిటరీ మైత్రిని తీర్పరచుకోడానికి అంగీకరించింది. ఆ మిత్ర భావానికి రూపురేఖలు దిద్దడానికి సోవియట్ మిలిటరీ కమిషన్ త్వరలో ఫిన్లాండుకు పోతుంది. *

రష్యా సామ్రాజ్యపు దండయాత్ర రోజు రోజుకూ ఎక్కువవుతూ, యుద్ధం క్రమేపి వస్తున్నదని లండన్ ఎన్నికల ప్రచారంలో ఆంగ్లటోరీ లీడర్ చర్చిల్ ప్రకటించాడు* అమెరికా ఇచ్చిన 375 కోట్ల డాలర్ ఋణం ఐపోయింది. బ్రిటన్ మార్చి 3 న మిగిలిపోయిన 10 కోట్ల డాలర్లను లాగివేసింది. అసలు ఐదేండ్లవరకు ఈ ఋణంతో పని గడుపవలసివుండెను. అవసరనిమిత్తం 20 మాసముల కాలంలోనే అంతా స్వాహా అయినది. ఇక సంవత్సరానికి 25 కోట్ల డాలర్లు, బంగారం బ్రిటన్ పోగొట్టుకుంటుంది. * ఇక మార్షల్ సహాయం దొరికినా, అమెరికా ఖండంనుంచి దిగుమతులు తక్కువే తెప్పించుకుంటూ, బ్రిటన్ సాధ్యమైనంత స్వయం పోషకమై ఎగుమతులు ప్రేరేపించుకోవాలని బ్రిటన్ ప్రభుత్వం తీర్మానించుకున్నది. * మార్షల్ ప్లాన్‌లో సామ్రాజ్యవాదంలేదని ఒక అమెరికా ప్రభుత్వశాఖాధికారి తెలియజేశాడు. జర్మనీలోని ఇనుము బాగా ఉత్పత్తిఅయ్యే పారిశ్రామిక రూహర్ ప్రాంతాన్ని అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, లగ్జెంబర్గు, హాలండ్, బెల్జియం దేశాలు కలిసి అంతర్జాతీయంగా కంట్రోల్ చేసేందుకు అగ్రిమెంటు కుదిరింది. * యుద్ధ సమయంలో బ్రిటన్ అమెరికా ఉపయోగం నిమిత్తం ప్రాంతాలను అమెరికా ఇంక 15 ఏండ్లు వినియోగించుకోవచ్చునని బ్రిటన్ అమెరికా ఒప్పందం ఫిబ్రవరి 24న జరిగింది. * రష్యాకు, ఇంగ్లాండుకూ ఆర్థిక విషయాలలో ఎక్కువ పోటీ కల్గడానికి వీలుందని క్రిప్సుమంత్రి అన్నాడు, అప్పుడపుడు ఉభయులు దోవతప్పిపోతున్నా, మళ్ళీ విషయం జ్ఞప్తికివస్తే, దారికి రాగలరని ఆయన అభిప్రాయం. బ్రిటన్ సంకల్పశుద్ధిమాత్రం నిస్సందేహం అని ఆయన చెప్పినాడు. * ఆస్ట్రియాలోని సోవియట్ సేనాని బ్రిటన్ అమెరికాలపై గావించిన దూషణ లెక్చరును ఖండించాడు. అతడికి బుద్ధిచెప్పించే నిమిత్తం అధికారరీత్యా రష్యా ప్రభుత్వానికి వ్రాస్తాడట.

రష్యా కర్మాగారములలో మేలురకం వస్తువులు తయారుకావలెను. పనికిరాని వస్తువు ఎవరైనాచేస్తే, వానిని దేశద్రోహికింద జమకడతారు. అటువంటి కార్మికుని కనికరించరాదని 'ప్రావ్దా' పత్రికలో వ్రాశారు. మేలురకం వస్తువులు కావాలి!— ఇదీ వివాదం. * యుద్ధానంతరం దేశంలో రేషన్ తీసివేసి, ఆర్థికమైన చిక్కులు తొలగించుకున్న దేశం రష్యా ఒక్కటే. యుద్ధానంతరం వ్యాపారం వృద్ధిజేసుకుని భాగ్యలక్ష్మిని పొందవలెనని కాపిటలిస్టు ప్రపంచం, సోషలిస్టులోకం పోటాపోటీలు పడినవి. అనేకదేశాలు యాతనలు పడుతున్నవి. రష్యాలో జీవనం సులభమైనది. పరాన్నభుక్కులవర్గం ఏ రూపంలోనూ తిరిగి అక్కడ ఏర్పడలేదు. స్వయం సహాయంచేతనే, విశేషం దిగుమతులు లేకుండానే జపారోవ్‌వంటి ఉక్కు మరయంత్రాగారాలను రష్యా నిర్మించింది. * రష్యా పలుకుబడిలోని దేశాలలోకూడా స్వయం సహాయం—రష్యాసాయంకలిసి అక్కడి పారిశ్రామిక, వ్యావసాయిక ప్రయత్నానికి ప్రోద్బలమిస్తున్నవి. యుగోస్లావియాలో ఒక తమాషామాట వాడుకలో వుంది ఆదేశపు జనంలో నూటికి 95 గురు మార్షల్ టిటో కావలెనంటారట. అందులో 90 మంది మార్షల్, 5 గురు టిటో కావలెనంటారట. అమెరికా విదేశాంగ మంత్రిపేరు కూడా మార్షల్. అమెరికా సహాయాన్ని మార్షల్ సహాయం అనికూడా అంటారు. కొంచెం అవివేకంచేత అమెరికా యుగోస్లావియాను పోగొట్టుకుందని ఒక అభిప్రాయం వున్నది. కాని యుగోస్లావియాలో ప్రజలకు గొప్పమేలు కల్గిందనీ, రష్యా ప్రేరణవారిని ఆకర్షించిందనీ అమెరికనులు ఎరుగుదురు.

ఈవిధంగా ప్రెసిడెంట్ ట్రూమన్ ఒకవంక, స్టాలిన్ నేత మరొకవంక దేశాలను తమ పలుకుబడిలోకి తీసుకుంటున్నారు. వీరి ప్రతినిధులు అనేక ప్రయత్నాలుచేసి పరికరములను సమకూరుస్తున్నారు. కష్టనష్టాలకు ఓర్చి సాధనసంపత్తిని సంగ్రహిస్తున్నారు. వీరి ప్రయత్నములు సఫలం కాగలవనే మా విశ్వాసం.

ఒకసారి జాన్సన్ స్కాట్లండులో పర్యటిస్తూవుండగా ఒక భద్రమహిళ అతన్ని ఎదుర్కొని

"ఏమి నిఘంటువు వ్రాశావయ్యా నీది! దాన్నిండా అన్నీ అశ్లీల పదాలే!" అని చీదరించుకొన్నది.

"అవునండీ. దాంట్లో ఎవరు ఏది వెదికితే ఆపదాలే అగుపడతాయి" అన్నాడు జాన్సన్.

* * *



"మిస్టేక్, బ్లండర్- (చిన్నతప్పు: పెద్దతప్పు)-అంటారే; వీటిలో తేడా ఏమిటి చెప్పండి" అని ఒక పెద్దమనిషి. ప్రసిద్ధ హాస్య వ్యంగ్య రచయిత అయిన మార్క్‌ట్వేన్‌ని అడిగాడు.

"ఓ ఇదా! మీరు ఏదైనా హోటల్‌కి వెళ్ళినప్పుడు మీ నూలుగుడ్డ గొడుగుకు బదులు సిల్కుగుడ్డ గొడుగు తెచ్చారనుకోండి; అది మిస్టేక్. మీదే సిల్కుగుడ్డగొడుగు వదిలేసి నూలుగుడ్డ గొడుగు తెచ్చేసిననుకోండి. అది బ్లండర్"

"అవుతుంది" అని మార్క్ ట్వేన్ సమాధానం.

* * *

అమెరికన్ ప్రెసిడెంట్ అబ్రహామ్ లింకన్ హాస్యోక్తులు వినని వారు అరుదు. అతి సామాన్యమైన సంఘటనలోంచి, అతి విషాద సన్నివేశంలోంచి అతడు హాస్యాన్ని ఉత్పత్తిచేసి గుండె బరువును తొలగించేవాడు.

ఒక పెద్దమనిషికి ఉద్యోగం యిమ్మని రికమెండ్ చేస్తూ అతని సెనేటర్లలో ఒకరు పంపేరు ఆ మనిషిని అటూ యిటూ వీక్షించి ఏవో నాలుగు ప్రశ్నలడిగి "వెళ్ళిరా. నీ అవసరం వుంటే కబురు చేస్తాను" అని పంపేశాడు లింకన్.

"మా కేండిడేట్ ఉద్యోగం మాట ఏం చేశారు" అని సెనేటర్ మర్నాడే లింకన్ని ప్రశ్నించాడు.

"అతనికి ఉద్యోగం రాదు.

"అదే."

"అతని మొహం నాకు నచ్చలేదు"

"బాగానే వుంది మీరు చెప్పేమాట. అతని మొహానికి అతనెలా బాధ్యుడవుతాడు?"

"నలభై ఏళ్ళు పైబడ్డ ప్రతి మనిషి తన మొహానికి తానే బాధ్యుడని నా ఉద్దేశం." అన్నాడు లింకన్

* * *



**విశ్వవిఖ్యాతి . దేశదీప్తి : అమరజ్యోతి.**

ఒక దివ్య తేజస్సు అందులో శయనించివుంది కనుమూసిన ఆ తేజ పుంజమే నేటికి మనకు వెల్గుబాట



**దేశరక్షకులు .** ఒక సంవత్సరం వర్క్‌షాప్ విద్యనేర్చి, పిదప ఆరుమాసాలు ఆయుధాలఫాక్టరీలో తర్ఫీదు 1౧ మొదలు 22 ఏండ్లవరకు ఆంగ్లబాలురంతా ఈ ప్రావీణ్యంలో శిక్షణపొందుతారు

# కళాఖండం: ఉదయశంకర్ 'కల్పన'

ఉదయ శంకర్ గొప్ప నటకుడంటే ఒప్పు కొంటాము కానీ, అతను సినిమా తీయుట మేమిటి? అని ఆశ్చర్య పోయిన బుద్ధిమంతు లెందరో ఉన్నారు. — ఆర్సన్ వెల్సు మొట్ట మొదట "సిటిజన్ కేన్" తీయ టానికి పూనినప్పుడు అక్కడి పెద్దలన్నట్లే ఇప్పటికీ ఉదయ శంకర్ తీసిన "కల్పనలో నాట్యాలు తప్ప మరేం లేవు" అని పని కట్టుకు ప్రచారం చేస్తున్న ప్రజలు లేకపో లేదు. ఉదాహరణంగా చూపించ వచ్చు. "కల్పన" కూడా ఆ చిత్రం లాగే సినిమా యుగంలో: అపూర్వమైన కళా ఖండం!

నిజానికి "కల్పన"కీ యితర ఏ చిత్రానికీ ఏవిషయం లోనూ సారూప్యం లేదు. ఇందులో డిస్నీ చిత్రం లోని ఊహాశక్తి చాప్లిన్ చిత్రం లోని వ్యంగ్యం మిశ్రమయి ఉన్నాయి. "కల్పన" లో నాట్యాలు వుండడం నిజమే — కానీ, ఆ నాట్యాలకు భావోద్దీపన శక్తి వుంది, వసంతోత్సవ సందర్భంలోని నాట్యాలలో భారత దేశంలోని వివిధ నాగరికతల సమీకృత ప్రదర్శింప బడింది. స్నాతకోత్సవం మాగబొమ్మలాటలలో మన విద్యా విధానం మీద, బానిసత్వం మీద నిరసన వ్యంగ్య వ్యాఖ్య చేయబడి వుంది. డోలు, కత్తి, నారీమణుల పురోగమనం అనే నాట్యవిశేషాల్లో ఉదయ శంకర్ దేశం లోని యువతీ యువకులను జాతీయ పతాక గౌరవాన్ని విజయపథంలో యింకా యింకా పైకి తీసుకు పొండని హెచ్చరించాడు.

కానీ, ఈ నాట్యాలు మన అనూచాన నాట్య శాస్త్రానికి ఎంత వరకూ అన్వయిం చుతాయో పరీక్షిద్దామను కొనే ప్రేక్షకుడు నిరాశకు గురి కావలసిందే. అది చూడదలచే వారికి సాధన బోస్ తీసిన "రాజ్ నర్తకి" సరైన చిత్రమేమో కాని "కల్పన" మాత్రం కాదు. ఉదయ శంకర్ ఉద్దేశ్యంలో నాట్యమనేది, కేవలం తన మానసిక చిత్రాలని, తన భావాలను వ్యక్తీకరింప చేసే సాధనం మాత్రమే కళాకారుని చిత్త వృత్తిని ప్రతిబింబించటానికి, అతని మనోహరమైన భంగిమలు, హావ భావ ప్రకటనలు, లాస్యవిన్యాసాలు, ఎంతో చక్కగా కుదిరి నాయి. ఈ చిత్రంలో సంగీతం ముఖ్యంగా ఆయా రసాను భూతికి కావలసిన మానసిక వాతావరణాన్ని కల్పించటం కోసమే, ఎంతో జయప్రదంగా వాడబడింది. అందులో

'హోలీ' లో నిజంగా!



సులోచనా ఛటర్జీ

వున్నవి చాలా కొద్ది పాటలే అయినా అవి ముఖ్యంగా భావ ప్రకటన కోసమే ప్రయోగించ బడ్డాయి కానీ, ప్రజలు వాటి కోసం చెవి కోసుకోవాలన్న వుద్దేశం ప్రాయ బడినట్లు కానీ, పాడబడినట్లు కానీతోచదు. ఈ సందర్భంలో అమ్లాదేవి పాడిన విషాద గీతం మరుపుకు రాని దని చెప్పవచ్చు.

కథావస్తువు — తీవ్రమైన కళా సృష్టి దాహంలో మండే మనస్తత్వం కలిగిన ఒక కళాకారుడు ఎదుర్కొ వలసిన సమస్యాపరంపరను గురించి మొదట్లో అతని ఉద్రేకాన్ని, ఉత్సాహాన్ని ఇంటి పెద్దలూ బళ్ళో పంతుళ్ళు చంపుతారు. ఆదశ దాటి వస్తే 'కిరాయి కళా కారులు' ఇతని పల్లకరాతలు అవుతారు. యితనికి నిజమైన కళ తెలియదు. పొమ్మంటారు. తరువాత ఏవేవో కారణాల మూలంగా కళలో తమకు అభిరుచి, అభినివేశం వున్నట్లు కనుపించ వలసి వచ్చి, కనుపించే పిల్ల జమీందార్ల చేతుల్లో చిక్కుకొంటాడు. (ఈ సందర్భంలో ఉదయశంకర్, ఆ తరగతికి చెందిన వారిని నిశితంగా విమర్శించి వదిలాడు.)

అతడు ముఖ్యంగా దెబ్బ తీయాలను కొన్నది రాచ వంశాల వారి మీద, వారి యితని కన్న కని మూలంగా సెన్సారు వారు ఆ భాగానికి చెందిన కొన్ని సీనులు కత్తిరించ వలసి వచ్చిందట. చిత్రంలోని అపర భాగం లో, వసంతోత్సవం చూపడానికి వచ్చిన జమీందార్లకు కావాలని కట్టిన పాటిగోడ లోని గుమ్మం దగ్గర తల వంపు లతో ప్రారంభ మౌతుంది.

టెక్నిక్ విషయంలో కూడా "కల్పన" ఉత్తమ చిత్రం. ఆయన వాడని కెమారా ట్రిక్ కానీ, దృక్కోణంగానీ లేదు. సెట్లలో ఒక క్రొత్త రకమైన క్యూబుల (ఘనాలు)తో నిర్మాణం జరిగింది. ఇవి చాలా యింపుగా వున్నాయి.

ఇందులో లోపాలు లేకపోదు ముఖ్యంగా కథలో సరైన వుప క్రమణ, వుప సంహారం క్రమమైన విధంగా లేవు. 'నూర్', కథను చెప్పేటప్పటి రెండో (ప్రాతిపదిక ప్రదర్శనం) ఫ్లాష్ బాక్ అనవసరం. పాటల్లో సంస్కృతం ఎక్కువగా వుంది. మాటల్లో సూటితనం తక్కువగా వుంది.

నటన విషయంలో ఉదయశంకర్ కంటె అతని భార్య అనురాదేవే ఎక్కువ బాగా ఒప్పించిందని ఒప్పుకోవాలి.

ఈ లోపాలున్నప్పటికీ "కల్పన"తో భారతీయ చిత్రకళా యుగంలో ఒక క్రొత్త శకం ప్రారంభ మౌ'ంది!

"అందర్లాగా వుంటాడు."

"నువ్వు చూసేవా ?"

"చూడాలనుకునే రాసేను."

"కామెడీనా ? ట్రాజెడీనా ? సెటైరా ? సెక్సా ?"

"అన్నీను."

"కల్పితమా ?"

"ప్రేతంలేదు గనక కల్పితమే. కేవలం కల్పితం. ఇందలి స్థల పురాణమూ. అక్కడి పాత్రలూ వాటి పేరులూ హోదాలూ పదవులూ చుట్టరికాలూ పలుకరింపులూ అన్నీ అంతా కల్పితమే !"

"కథ పేరేమిటన్నావ్ ?"

"కథ కాదు నవల"

"అదేలేవోయ్. నవల పేరేమిటి ?"

"రాక్షసీ, నీ పేరు రాజకీయమా ? వర్ధిల్లు !"

" దాంతం రాయి, తొరగా పైకొస్తావ్."

"దానికింకా టైముందిగా ముందు నవల విను."

"కానివ్వు."

" మ్మారంభం...."

"శుభమంటూ అదేం పేరు !"

"దయచేసి నన్నాపకు. నేను చదువుకు పోతాను. నువ్వు వింటూ వుండు. కెనై ప్రొసీడ్‌నా !"

"ప్రొసీడ్ !"

* * * *

హో. కృ

# సోషలిజం : కాంగ్రెస్ : దేశం

సోషలిస్టు పార్టీ కాంగ్రెసును వీడింది.

సోషలిజం కోసం అచ్చంగా పాటుపడే ఒక స్వతంత్ర పక్షం నిర్మాణ మైనది.

కాన్పూరులో 'కాంగ్రెసు సోషలిస్టు పార్టీ' నుంచి 'కాంగ్రెసు' పోయింది. నాసిక్‌లో కాంగ్రెసులో నుంచి సోషలిస్టు పార్టీ వెలుపలికి పోయింది.

భారత దేశ చరిత్రలో నాసిక్ నగరాన మార్చి 18, 19, 20 తేదీలలో నూత్న అధ్యాయం ఆరంభ మైంది. స్వరాజ్యం కోసం కాంగ్రెసు ద్వారా సోషలిస్టులు పోరాడినారు. ఆపోరాటంలో జాతీయోద్యమం సోషలిస్టు ప్రభావం చేత ప్రగతిశీల మైనది. జాతి మత వర్గ విభేదం లేని ఆ ఉద్యమం కడకు జనసామాన్యపు కష్ట నిష్ఠురములను తెలుసుకొని వాటిని తొలగించే నిమిత్తం పాటుపడే సంస్థగా కాంగ్రెస్ రూపేణా వ్యక్తమయినది. ఐనప్పటికీ వర్గ భేద మెరుగని తత్వం గల సంస్థ వర్గభేదమును రూపు మాపుటకు ప్రయత్నించడం సాధ్యం కాక పోయింది.

కాంగ్రెస్ ఉద్యమం పర ప్రభుత్వాన్ని డీకొనడంలో బ్రహ్మాండ మైన పనులు చేసింది. తదుపరి దేశంలో వర్గ సంఘర్షణలు ఏర్పడినప్పుడు, వర్గ సామరస్యమునకు నాయకులు వీలైనపుడు ప్రయత్నం చేసినారు. అది సాధ్యము కానపుడు వారి సాధన నిష్ఫల మైనది. దేశములో జన సామాన్యమునకు—వారిని పీడించి జీవించే పరాన్న భుక్కులకు రాగల సంఘర్షణలో జనం పక్షాన కట్టగా నిల్చి పోరాడే పక్షం చారిత్రకంగా నేడు అవసర మైనది.

కాంగ్రెసు ఉద్యమం చారిత్రకంగా తనువు చాలించింది. ఇక సోషలిస్టు ఉద్యమం దేశాన్ని నడిపించ వలెను. స్వరాజ్యం సోషలిజం కావలెను. నిరుద్యోగ సమస్య నిర్మూలం కావలెను. చదువు, వసతి, ఆరోగ్యం, అన్న వస్త్రాలు అందరికీ కావలెనా? అట్లయితే ఉత్పత్తి-మారకం-విభజన సాముదాయకం కావలెను. అది సోషలిస్టు పార్టీ ఆశయం.

నాగరక జీవనం-భాష-సంస్కృతి అందరికీ అభివృద్ధి కావలెనా? అది సోషలిస్టు ఉద్యమం కాంక్షించే సంగతి.

మన ప్రజారాజ్యం ఏకపక్ష వాదం కాకుండా వివిధ ప్రజాపక్షాల వాద-ప్రతివాదనలు జరిగి సమైక్య మైన రాజ్యతంత్రం కావలె నంటారా? ప్రజా ప్రభుత్వమును కాలద్రోయ కుండా దానిని చట్ట బద్ధముగా ఎదిరించి ప్రజలకు ధైర్యంగా నిజం చెప్పగల పక్షం ఒకటి కావలెను. అట్టి పార్టీగా వ్యవహరించాలని సోషలిస్టు పార్టీ సంకల్పం.

ఎదిరింపు విరోధము కాదు, కారాదు. ఎదటవారి విమర్శ లేని పక్షం అచిరకాలంలో నిరంకుశ మై, నిర్వీర్య మై పోగలదు.

విలువగల్గిన అనేక ప్రాణుల త్యాగబలం చేత సంపాదించిన అధికారం ప్రజలకు నిరుపయోగం కారాదు. ప్రజలచేత, ప్రజలకొరకు పాలనజరిగే ప్రజారాజ్యమే కావలెనంటే, ప్రజల సమస్యలను తెల్పే పక్షం ఒకటి కావలెను. ఈ తెల్పడం నిర్భయంగా జరగవలెను.

సమాజములోని నిమ్నోన్నతములు చక్కబడి, దేశంలోని పాడిపంటలు, పారిశ్రామిక సంపత్తు ఇతోధిక మై, సర్వజన శ్రేయస్కర మైన ఆర్థికవిధానం ఆచరణయోగ్యం కావలెను.

ఇవే తమ ఆశయములని సోషలిస్టులు ప్రకటిస్తున్నారు.

దేశానికీ—ప్రపంచానికీ వంతెన కావద్దా? అని సోషలిజంలో వుందని సామాజికవాదుల అభిప్రాయం. ప్రజలు సర్వత్రా ఉన్నారు. వారికందరికీ సాముదాయకంగా సుఖపడగల మార్గం ఒకటే—సోషలిజం. జాతి—మత—రంగు—వర్గ విభేదములను రూపుమాపి ప్రపంచమునంతటినీ ఏకం చేయగలశక్తి ఈ తత్వమునకే వుందని సోషలిస్టుల వాదం.

సోషలిజం కోసం ఖండాంతరాలలో గత రెండు శతాబ్దాలుగా గొప్పకృషి జరిగింది. పాశ్చాత్య దేశములనుంచి ప్రాచ్య ఖండంలోకి అవెల్లు ప్రవేశించింది. ప్రాచ్య-పాశ్చాత్య ఖండములను ఇది కల్పింది. ఒక ఖండాంతర ప్రదేశ విశాలభూభాగంలో సోషలిస్టు రాజ్యమే ఏర్పడింది. తదాది, ప్రపంచంలో అతివేగంగా సోషలిజం కొఱకై పోరాటాలు వర్ధిల్లినవి.

## విజయప్రకాశము



దేశగర్వము దీప్తిజెందగ దేశచరితము తేజరిల్లగ—దేశమరసిన ధీర పురుషుల తెలిసి పాడర తమ్ముడా!
బాలభారతపదము (శ్రీరాయప్రోలు)

ప్రథమ, ద్వితీయ సంగ్రామముల అనంతరం సోషలిజం, జాతీయస్వేచ్ఛ విశేష వ్యాప్తిని పొందినవి. మూడవ ప్రపంచ సంగ్రామం రాకుండా కాపాడేశక్తి నేడు ప్రపంచ సోషలిస్టు ఉద్యమానికి లేదు. అందులోనుంచి క్షేమంగా బయటపడిన జనమంతా ఈ పర్యాయం సోషలిస్టు ప్రణాళికల ఆచరణంలోకి రాగలరని విమర్శజ్ఞులు కొందరు ఆశిస్తున్నారు.

ప్రపంచం సంగతి ఎట్లున్నా, దేశంలో కేంద్రరాష్ట్ర ప్రజాప్రభుత్వాలలో ఆరోగ్యకర మైన సంచలనం, సోషలిస్టు ఉద్యమానికి స్వతంత్రశక్తి చేకూరగలవని ఆశించెదము.

# పాకిస్తాన్ : పండిట్ జీ వ్యాఖ్యలు :

## అమెరికా



మార్షల్ నా కోడి!

**పాకిస్తాన్** ప్రజాపక్షాన్ని పరిహద్దు గాంధి స్థాపించాడని విన్నాం. సోదరుడు డాక్టర్ ఖాన్‌సాహెబ్ పాకిస్తాన్ పతాకకు వందనమర్పించి ముస్లింలీగ్ జండా ముట్టనని చెప్పినాడు. పఠానులకు, దేశానికి సేవ చేయడమే తన ధర్మమని ఖాన్‌సాహెబ్ ప్రకటించినాడు. పండిత జవహరలాల్ నెహ్రూ అభిప్రాయంలో పాకిస్తాన్ ఇస్లాం ప్రయుక్త రాజ్యం కాదు — ఇండియా హిందూ రాజ్యమూ కాదు. ఐతే రెంటికీ శ్మశానమే శరణ్యం.

**ఆంధ్ర రాష్ట్రమా కావలసింది? రెడీ!** ఇదిగో! స్వీకరించండి—ఐతే అందుకు సంబంధించినవారు నలుగురు పోగైయుండు మించు ఏకాభిప్రాయానికి వచ్చి, రాష్ట్రపు హద్దుల తదితర వివరముల పట్టిక ఇవ్వండి-రాష్ట్రం అందుకోండి—కాంగ్రెసు 25 ఏండ్ల క్రితమే భాషాప్రయుక్త రాష్ట్రవాంఛను గుర్తించింది. ఇవీ పండిట్‌జీ విశాఖపట్నంలో చెప్పిన సంగతులు.

అట్లని ఆంధ్రరాజ్యం కావలెనని కోరవారా, ఆ గొంతెమ్మ కోర్కెను ప్రధానమంత్రి హితోపదేశం చేశాడు. ఆ పండితునికి స్వాగతపత్రం వ్రాసిన మన రాష్ట్రపండితు లెవరుకి గలుగురిలో నగుబాట్లాయె గదా మనగతి? ఆంధ్రోద్యమం ఉద్భవమైనపిదప ఇంతటి సిగ్గుచేటు పనిజరగలేదు. ఇట్టి దురవస్థ మనకు సంప్రాప్తం కాలేదు. లేక లోపిష్టియైన ఆ పుణ్యాత్ముడు ఒక మాటకు ఇంకోమాట తాత్పర్యం గ్రహించుకుని కన్నుమన్నాడా? ఏదా తెలిసేటట్లు వ్రాయరాదా?

**గాంధిజీ** హత్య హిందూ మహాసభ అధికార ప్రేరణకు నెహ్రూజీ అంటగట్టినాడు. ఇట్టి ఆరోపణ బహిరంగముగా సర్కారు తాలూకు వర్గాలలోనుంచి మనకు తెలియడం ఇదే ప్రథమం. గాంధిని చంపినవాడి కొకడికే పిచ్చిపట్టలేదు. వాతావరణమే కలుషమైపోయి, అందులోనుంచి గాడ్సే పుట్టుకొచ్చినాడనికూడా పండిట్‌జీ తెలియజేసినాడు.

**కార్మికులు** మోటగా వుండే సమ్మె ఆయుధాన్ని ప్రయోగించడం బాగాలేదని ప్రధానమంత్రి సలహాయిచ్చారు. సింధియా కంపెనీవారు అతిస్వల్పమైన కార్మికుల కోర్కెలకు వారిని మూడునెలలు విరసంగా ఏడిపించిన సంగతి నెహ్రూజీకి చెప్పే ధైర్యమే ఎవరికీ లేకపోయిందా? దేశభక్తి అందరికీ వుండవద్దూ? లాభాలమీద భక్తి దేశాన్నీ, జనాన్నీ, అంతటినీ మరిపిస్తుంది. ఇన్ని వివరాలు తెల్సుకొనే తీరిక పెద్దలకు వుండదు. నైజాం పేచీ పెద్దదిగాదట. తలిస్తే క్షణంలో తెగేస్తాం అన్నాడు ప్రధానమంత్రి. ఎంత తొందరగా తలిస్తే అంత మంచిది * 600 సంస్థానాలుండవని నెహ్రూజీ చెప్పేశాడు. 20 లేక 30 సంస్థానాల కలయిక లుంటవట. అంతవరకు మేలే. రాష్ట్రాలలో కలిసే సంస్థానాలసంఖ్య ఎక్కువైతే మంచిది.

**అమెరికాలో** మిలిటరీలోకి అందర్నీ వచ్చి చేరి శిక్షణ పొందమంటున్నారు. యువకులను ఇప్పటినుంచీ యుద్ధానికి తయారు చేస్తున్నారు. * స్పెయిన్ దేశాన్ని మార్షల్ కేశాలలో చేర్చుకుంటారని తెలుస్తుంది. స్పెయిను కీలకప్రదేశం. మధ్యధరా సముద్రభాగంలో అతి ముఖ్య ప్రదేశం, జిబ్రాల్టర్ నెత్తిన స్పెయిన్ ఉనికి.

**తూర్పు** యూరప్‌లో కొత్తరష్యా సామ్రాజ్యం వేగం విస్తరించి పోతున్నదని అమెరికనుల భయం. మోలటోవ్ ప్రణాళిక మార్షల్ సహాయాన్ని మించివున్నదట. రష్యాకు ఇరతదేశాలను దగ్గర చేర్చి, వాటి సంపదను హరించడానికే మోలటోవ్ ప్రణాళిక పన్నాగమట. అమెరికా అంచనా ప్రకారం రష్యా తన పలుకుబడిగల ప్రాంతంలోనుంచి 1200 కోట్ల డాలర్ల విలువగల సామగ్రి, సంపదను స్వీకరించింది. అమెరికా ఆ ప్రాంతానికి 15 కోట్ల డాలర్లను ఏదో ఒక రూపేణా బోసిళ్ళలో పోసింది. రష్యా ఉపాయం ధన, కనక, వస్తు, వాహనాది సంగ్రహం. అమెరికా ఆశయం సహాయకారం * యుద్ధానంతరం రష్యా సంపద, అధికారం, ఆక్రమణ అన్నీ హెచ్చయినవని అమెరికన్ల లెక్క. యుద్ధంలో శత్రుపక్షంగా వుండిన దేశాలలోనుంచి 1260 కోట్ల డాలర్ల సామగ్రిని రష్యా తీసుకున్నది. యంత్రాలు కొన్ని తీసుకపోయిన బాపతు, పరిహారం తాలూకు, ఆక్రమణవ్యయం అన్నీ అందులో కలిసివున్నవి. ఇందులో 900 కోట్ల డాలర్లు జర్మనీవద్దనుంచి లాగివేయడమైనది. పరిహారానికిగాను యంత్రాలు, పశుగణం, ఇతర సామగ్రి జర్మనీనుండి రష్యనులు తీసుకవెళ్ళినారు.

# మార్షల్ - మాలటోవ్ పన్నాగాలు

**ర**ష్యా అవలంబించే పై విధానం అమెరికా వాలసీకి భిన్నంగా వుంటున్నది. యుద్ధా నంతరం అమెరికా 1500 కోట్ల డాలర్లు సాధారణమైన అరువుగా - ప్పుగా ఉచితంగా ఖర్చుపెట్టింది. ఇందులో కొంత భాగం రష్యా కంట్రోల్‌లోని దేశాలకు వెళ్ళింది. తిరిగి ప్రస్తుతం మార్షల్ సహాయంపేరిట కొన్ని కోట్ల సొమ్ము పాశ్చాత్య యూరప్‌లో చాలా భాగం ఉచితంగా అమెరికా ఖర్చు పెడుతున్నది. ఇదంతా తూర్పు యూరప్‌లోని దేశాలను సంయుక్తంజేసి తన ఏకాధిపత్యం స్థాపించాలని రష్యా సంకల్పంగా అమెరికా భావిస్తున్నది. డాన్యూబ్ నది ప్రవహించే దేశాలన్నిటిని ఏకంజేసే ప్రణాళిక ఒకటి రాబోతుందట. మిలిటరీ—వైజ్ఞానిక—ఆర్థిక పు ... న్ను లతో ఆదేశాలను రష్యా బిగిస్తుందట.

**ర**ష్యా ఉద్దేశం—అమెరికా అనుమానం- ఏమనగా తూర్పు యూరపునంతా అది కాజేస్తుంది. 10 కోట్లమంది జనం కలిసి వస్తారు. అనగా రష్యాకు మొత్తం 30 కోట్ల జనాభా చేతిలో వుంటుంది. మొలటోవ్ ప్రణాళిక ద్వారా, తన పలుకుబడిని నిరాటంకంగా తూర్పున ప్రబలం చేయవలెననే సోవియట్ సంకల్పం. * అప్పుడిక తూర్పు దేశాలు సోవియట్ పిడికిలి నుంచి బయటపడే మార్గంవుందా? అని అమెరికా ఆలోచన అధికారవర్గం అభిప్రాయంలో అట్టి అవకాశం వున్నదట. అందువల్ల ఆ దేశాలలో రష్యాను విరోధించే శక్తులను అమెరికా ప్రోత్సహిస్తున్నది. * ప్రస్తుతం యూరప్ ఖండితంగా రెండు ముక్కలుగా చీలదని. 'రష్యా పిడికిలి' లోని దేశాలతో వ్యాపారం సాగుతూనే వుంటుందనీ అమెరికా అభిప్రాయం రష్యా అట్టి వ్యాపారాన్ని ఇంతవరకు అడ్డుపెట్టలేదు. సోవియట్ రాజ్యం అట్టి ఆటంకం కలుగజేస్తే, మార్షల్ సహాయం జేసే విధానాన్ని పూర్తిగా మార్చవలసి వుంటుందట.

**ర**ష్యా 'పిడికిలి' లో అమెరికా తంటాలు పెడుతూవుంటే, అమెరికా ఆక్రమిత పశ్చిమ జర్మనీలో రష్యా ప్రేరణచేత బాధ హెచ్చుగావుందట. ఈ విధంగా మార్షల్ పుంజు, మొలటోవ్ ప్రణాళిక ఆచరణలోకి వచ్చేసి చాలా రోజులైంది. మార్షల్ సహాయం ఇకమీద లభ్యమవుతుంది.

**అ**మెరికా బ్రిటనుకు చాల గుప్త దానం చేస్తున్నది. ఆయుధాలు- డాలర్లు అమెరికా సప్లయి చేస్తున్నది. అంతవరకు బ్రిటన్ బరువు తీరింది. ప్రపంచంలో ఏక్కడ సంరక్షణ కార్యక్రమం కొంచబడి నే, అమెరికా ఆదుకుంటుంది. అనగా మార్షల్ సహాయానికి ముందే, మారుపేరుతో ఆంగ్ల దేశానికి అమెరికా సాయపడింది. లండనుకు సేవింగ్సు బ్యాంకుల బాపతు సాలుకు 100 కోట్ల డాలర్లు అమెరికా పంపుతుంది. ప్రతీఖండాంతరాలలో తను వాగ్దానించిన సహాయాలను అమెరికా చేస్తూవుండ వలసిందేనా? వెలుపల అమెరికా సాయం వున్నందువల్ల, అక్కడి నుంచి తరలివచ్చే బ్రిటిష్ జనాభా ఉత్పత్తి- ఎక్కడ ఎగుమతి విని యోగం అవుతుంది.

**మా**ర్షల్ ప్రణాళిక ప్రకారం బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ దేశాలు మార్షల్ సహాయాన్ని మస్తుగా పొందగలవు. మొదటి 15 మాసాలలో 680 కోట్ల డాలర్ల వినియోగం వుంటుంది. ఇంతలో అమెరికా వ్యాపారంలోకి కలసిరాదు. కెనడాకూ, దక్షిణ అమెరికా దేశాలకు ఇందులో మూడవ భాగంపోతుంది. యూరప్ అందుకోవలసిన వస్తు వాహనాలు విశేష భాగం ఈ దేశాలు యూరపుకు సప్లయి చేయవలెను.

మార్షల్ సహాయాన్ని ఊతగా గొని అమెరికా కంపెనీలు, ప్రయివేట్ ఆసాములు పశ్చిమ యూరప్‌లో పెట్టుబడ్లు నిర్భయంగా పెట్టవచ్చునట.

**1948** సంవత్సరం 1939 వలె అవుతుందని కొందరి వాదన. కోడి పుంజుల తయార్ విన లేదు.

**బ్రి**టన్‌లో కమ్యూనిస్టులను ముఖ్యమైన కీలక ప్రదేశాల నుంచి, ముఖ్యంగా మిలటరీ స్థావరములలోంచి తొలగించి వేస్తారు.

**అ**మెరికాలో సోవియట్ దూషణ విపరీతమైనది. యుద్ధ వాతావరణం కల్పితమైనది.

**అ**మెరికా ఇంగ్లాండును నమ్మరాదని మాజీ ప్రసిడెండ్ హెర్బర్టు హూవర్ భావిస్తున్నాడు. ఆఖరు నిమిషంలో బెవిన్-బ్రిటన్ రష్యనులకు లొంగిపోతారని హూవర్ భయం.

**ఎ**గుమతులు బాగా పెంచి, గట్టిగా కృషి చేయవలసిందని క్రిప్సు దొర ఆంగ్లేయులందరినీ కోరినాడు.

రష్యా



మాలటోవ్ నా పుంజు!

---

సవరణ

మార్చి 16 తేది సంచికలో రాష్ట్రవార్తల శీర్షికలో 'పాతపట్నం ప్రజల బాధలు' అను లేఖ శ్రీ త్రిపురా త్రిపుర రావుగారు వ్రాసినది.

చేత స్వామిరాకని పురస్కరించుకుని ఆ పౌరులు కొందరు బోడి గుళ్ళతో వుంటారు.

విశ్వాసముకుడైన మనిషికి బోడి తల చిహ్నమనే తెలివితేటలు వాళ్ళకి లేకపోలేదు.

కనుక తలమీద వెంట్రుకల్ని తొలగించేస్తే చాలు. సాధువై, నిరంతర భగవత్సేవాసక్తుడై, లౌకిక వాంఛలకు దూరమై, కేవలం లోక కళ్యాణార్థమై పాటుపడే సచ్చరితుడనే సర్టిఫికెట్టు పుచ్చుకున్నాడనే అర్థం!

ఈ అర్థ స్ఫురణకొరకు తెలివిగల పౌరులు కొందరు పడిచస్తారు. వాళ్ళు, అస్తమానం బోడితలతో రోడ్డు తిరగడం చిరాకు గనక, కనీసం స్వామి రాకననుసరించైనా తాత్కాలికంగా - వేషం మార్చుకోవడం అవసరమని వాళ్ళకి బాగా తెలుసు.

ఎవరో మంత్రి పుంగవులు వేంచేయబోతున్నారనే వార్త వింటేనేతప్ప తిమ్మాపురం తాలూకు మురికి రోడ్డు శుభ్రపరచడం జరగదు-స్వామిరాకను వింటేనేగాని తిమ్మాపురం వాస్తవ్యుల తలలు మారవు. మంత్రి పుంగవులు వెళ్ళడంతోటే ఆ రోడ్డు మళ్ళా నరకానికి దారులైపోవడంలాగానే స్వామి వెళ్ళిపోవడంతోటే ఆ బోడితలలు శోకుగా పెంచడం జరుగుతుంది.

అక్కడి మురికి రోడ్లకి, అక్కడి తెలివి తలలకీ అంత అవినాభావ సంబంధం మరి!

ఆ సాయంత్రం స్వామి ఆనంద భైరవుల గంభీరోపన్యాసం ఆ పార్కులో ఏర్పాటు చేయబడ్డది.

వందలాది జనం జ్ఞాన సముపార్జన నిమిత్తమై స్వామిసభకి హాజరయ్యేరు. ఇంతటడిమేండ్‌నీ, జనసముదాయాన్నీ చూచిన స్వాములు పరవశులై చెప్ప బోయే గీతా రహస్యం చప్పున స్ఫురించక, ఒకింత కళ్ళు మూసుకుని ధ్యాన నిమగ్నులై వున్న సమయాన్ని కని పెట్టిన వారు ఘర ప్రభువు శ్రీ రామదాసు.

శ్రీ వారికి పురపాలనలో మన శ్శాంతి దూరమైన తరుణంలో స్వామి వారి రాక గొప్ప ఉపకారంచేసి నట్టైంది.

వారిపట్ల ప్రజకి గల భక్తి శ్రద్ధలను గమనించి, అటునుంచి నరుక్కు రవచ్చున్నారనే ఆర్యోక్తిని పాటించి స్వామివారి పాదసేవ మిడిగామారి తద్వారా భక్త చింతామణి అనే అదనమైన అర్హతను పొంది ధన్యుడయ్యేరు రామదాసు.

స్వామీజీ యింకా కళ్ళు తెరవలేదు.

అందంగా అలంకరించబడిన వేదిక. స్వామివారి ప్రక్కనే ఆశీనులై వున్నారు రామదాసు.

సభ మైవ చింతన చేశ కాబోలు నిశ్శబ్దంగా వుంది.

అనను కనిపెట్టి రామదాసు లేచి నిలబడ్డారు. ఆయన నున్నటి గుండు దీపాల వెలుగులో తళుక్కున మెరిసింది. ఆయన కళ్ళలో ఒక దివ్య జ్యోతి వెలిగే వుంటుందని వారు భావించడంవల్ల - కళ్ళు మూసేసుకుని చేతులు అతి వినయంగా జోడించి సభనుద్దేశించి అన్నారు. ...

"ఇవాళ చాలా సుదినం. తిమ్మాపురం చరిత్రలో ఈ రోజుకెంతో ప్రాముఖ్యత ఏర్పడుతుంది. శ్రీ స్వామివారు తిమ్మాపురం వేంచేయడం యిది ప్రథమం. అయితే శ్రీ స్వామి వారిని తరచూ రావలసిందిగా మనందరి తరఫునా నేను ప్రార్థించి వున్నాను. జవాబు అనుగ్రహించేరు కాదు. వారి అనుగ్రహంకోసం మనం ఎదురు చూద్దాం.... శ్రీ స్వామివారు ఇక్కడ చేరిన భక్తకోటికి అమూల్యమైన ఉపదేశం చేయడానికి వచ్చినమాట నిజం. కాని, ఇప్పుడు వారెందుకో సంశయిస్తున్నట్టు పసిగట్టేను.

"భూమిమీద తాండవిస్తున్న పాపం శ్రీస్వామివారిమనసునిగాయపరుస్తోంది. పదిహేను రోజులపాటు వారిని అంటి పెట్టుకు తిరుగుతున్న వాడిని గనుక నేనీ నిజాన్ని గ్రహించగలిగేను. ఈ పాప భూయిష్టమైన వాతావరణాన్ని చక్కబరచే నిమిత్తమే శ్రీ స్వామి వారు దేశాటనం చేస్తున్నారు.

"నిజానికి శ్రీ స్వామివారు ఇవాళ యిక్కడ వుండేవారుకాదు. నా ప్రార్థనని మన్నించి ఇవాళ కూడా ఆగిపోయేరు. మనందరం ధన్యులం. నా గురించి ఇప్పుడు నేను చెప్పుకోడం మంచిదికాదు. అనారోగ్యంవల్ల నేను నా విధుల్ని చక్కగా నిర్వహించలేకపోతున్నానేమోనని బెంగకలుగుతోంది. నాకు. నానెత్తిమీదనున్న ఈ గురుతర బాధ్యతలను వదిలించేసుకోవాలని నేనెంతకాలంనుంచో ఎదురుచూస్తున్నాను. కానీ నా యందు నా ప్రజలకున్న అభిమానం నా నిర్ణయాన్ని సాగనివ్వడంలేదు.

"ఇవాళ మధ్యాహ్నం శ్రీ స్వామి వారుగూడా నా నిర్ణయాన్ని కాదంటున్నారు. నా విధి నిర్వహణలో వారి ఆశీస్సు లుంటాయని సెలవిచ్చేరు. అందుకే అన్నాను ఈరోజు సుదినమని. కాగా.... ఇప్పుడిక్కడ శ్రీ స్వామివారి మౌనానికి కారణం నేను చెప్పగలను. మనిషి ఆలోచనలు పెడదోవన పోతున్నవని శ్రీ స్వామివారు గమనించేరు. ఇక్కడ శ్రీ స్వామివారి దర్శన నిమిత్తమై చేరిన ప్రజా వాహినిలో స్వామి మనస్సుని శంకించే ద్రోహి ఎవరో చేరాడు. అందుచేతనే స్వామి మనకి చెప్పిన ఉపదేశం చేయడానికి ఇష్టపడటంలేదు. దయచేసి ఆ ద్రోహి సభా మర్యాదని పాటించడం మంచిది. ఆ ద్రోహికి ఈ సభయందు లక్ష్యం లేకపోతే నిరభ్యంతరంగా ఈ చోటొదిలి వెళ్ళిపోవచ్చు. లేదూ. మనసు మార్చుకుని

తెగించి ఎక్కడైనా పక్షి ఎదురాడితే తగ్గమంటూ రెడీచేసుకునే వుంచారాయన.

రామదాసునారేదైనా సభలో ప్రసంగించమంటూ జరుగుతే అది రాజకీయ సభ కావచ్చు. సాహిత్య సభ కావచ్చు గాన సభకావచ్చు నాటక ప్రదర్శన కావచ్చు. కుస్తీలు కావచ్చు ఏదైనా పర్లేదు. ఆ సభకి ముఖ్యంగా పెద్ద పరీక్షపెట్టి అక్కడ తన బరువెంతో తెలుసుకొని గానీ సభని సాగనివ్వరు.

ఆ మాట కొస్తే వారికి తెలీని "విషయం" లేదు. కోళ్ళ పెంపకం మొదలు అమెరికా ప్రెసిడెంటు దాకా ఆయన ఏ విషయమైనా మాటాడగలడు ఆయన దగ్గర కొన్ని రికార్డులు ఉంటాయి ఏ సభకి ఏ రికార్డు ఏ శృతిలో వినిపించాలో ఆకళింపు చేసుకున్న ప్రజ్ఞాశాలి వారు:

స్వామివారు కళ్ళు తెరిచి రామదాసు వేపు చూసేరు. రామదాసు సవినయంగా చేతులు జోడించేరు. స్వామివారు ఏమి చేయాలో చాతగాక చిక్కిలాసంగా నవ్వేరు. నవ్వి ఉపదేశం ప్రారంభించేరు.

"హనుమంతుడు శ్రీరామ భక్తుడు. అంటే, రామదాసు. హనుమంతుడు వానర జాతి వాడు. పరమభక్తుడు. సాక్షాత్తు శ్రీరామచంద్రులను గుండెల్లో దాచుకొన్న మహాభక్తుడాయన. తిమ్మాపురంలో ఆ భక్తుడున్నాడు. గనుక తిమ్మాపుర వాసుల కొచ్చిన భయం లేదు.

"మానవ సేవయే మాధవ సేవ" అన్నారు. సేవ అనేదాన్లో తృప్తికిహద్దు కూడదు. మన ప్రక్కనున్న మనిషికేం కావాలో మనం తెలుసుకోడం ప్రథమ కర్తవ్యం. తెలిసిన తర్వాత చాతనయ్యింది చెయ్యడం ముఖ్య కర్తవ్యం.

"కర్తవ్యం-ఎవడకి వాడు బతకడం ముఖ్యంకాదు. తనతోపాటు యింకా ఎంతమంది ఎలా బతుకుతున్నారో వెనక్కి తిరిగి చూడటం ముఖ్యం...."

శ్రీ స్వామివారు ఒక్కొక్క ముక్కని అయిదూ పది నిమిషాలు ఆగి మరీ చెప్పడం వల్లేమో.... పైగంటలో అరగంట సేపు సాగింది ఉపదేశం. అదింకా ఎంతసేపు సాగేదోగాని వాన దేవుడికి వొళ్ళు మండిపోయి ఉధృతంగా వాయించి పారేయడం మూలంగా సభ అక్కడితో ఆగిపోయింది.

వర్షంలో పరుగెత్తుతూన్న ఒక మూర్ఖుడు మరో అజ్ఞానితో అన్నాడు.

"స్వామిగారంటే "ఏంటో అనుకున్నా .... ఆకాడికి మా చిట్టిగాడి బడిపంతులు దేవసాదంగారే బెటరు. మా చిట్టిగాడి పుస్తకం నిండా నీతులేగా. చదువుకోడానికి పైసుండాలేగాని గురో.... దేవ సాయంగారిపాఠాలు .... ఏంటావ్?"

అజ్ఞాని భయపడుతూ, పరుగెత్తుతూనే అన్నాడు.

"చెడు మాటాడకు. కళ్ళుపోతాయ్. వర్షం ఎక్కువవుతుంది. తొందరగా పరుగెత్తు." (సశేషం)

# శాకుంతం

ఎం. రామకోటి

తప్పుతూ తుళ్ళుతూ పరవళ్ళు తొక్కేవు
గుప్పుమని వంపులో సొగసులో సొక్కేవు
తప్పుకొని గొప్పగా పైటపురి విప్పేవు
ఒప్పుగా కుప్పవని లీలగా చెప్పేవు

ఏవూరు ? ఏ గూడు ! ఓపాల గువ్వా !
ఎవ్వారు మీ వారు ? మురిపాల గువ్వా !

పూదేన వాకపరి కొబ్బరులకోన
మధురాతి మధురమాసీను నీయూన
కౌగితపు నావపై కోరికల తెడ్లేసి
మగవాడివై గూడుచేరు గంతేసి

పడుచు దుడుకున నేను పొంగేను బావా !
గడుసరివి సొగసరివి యీదాడరావా !

నీలాలకుచ్చులు జలతారుమచ్చలు
నిలువెల్ల సింగార మొలకించు పచ్చలు
నాజూకు నడకలు సోకైన విసురులు
మోజులే చిలికేను పన్నీటి కొసరులు

ఊలేసి పిలిచేను ఓపాల గువ్వా !
ఉలుకాడవేలనే కోపాల గువ్వా !

నీలకాంతలు ఏరి చీరగాకట్టేను
మేలి పన్నీల వెలుగు లందందు పెట్టేను
బీడులో గరికనే మెడలోన వేశాను
వడివడిగ నీ కొరకు ఎగిరి వచ్చేశాను

ఊలేసి అల్లరా ! బాగుందిబావా !
గోలేల నావెంట చల్లగా రావా

కురులిసరి కనులిప్పి నెమలిలా ఆడేవు
పరువాల పలుకాడి కమ్మగా పాడేవు
మురిపించి వలపించి వలవేసి పట్టేవు
కరువుతీరా నన్ను చూపులను చుట్టేవు

కవ్వించి బెదరించి ఓపాల గువ్వా ,
నవ్వేదవు న్యాయమా తాపాల గువ్వా :

నూనూగు మీసాల మొగలంటి బావా ,
కోనలో నా గూడు ననుగూడరావా ?
భావాల రెక్కలై పోదామె గువ్వా !
బావంటె నీకింత తీపేల గువ్వా ?

నీ వలపు నా తలపు పల్లెవంతమే గువ్వ ,
అవునవును బావా, నా మల్లె పువ్వ ,



# నాకలిసిన రాత్రి

ద్వాభాష్యం రాజేశ్వరరావు

నేను ముత్యపు చిప్పను కాను!

నాకు ఆనందం కలిగించటానికి స్వాతి చినుకే అక్కరలేదు!

వాన చినుకులు ఎప్పుడు నింగి నుండి రాలినా నా కిష్టమే!

నల్లని మబ్బులనుండి పూసల దండల్లా, చినుకులు పడుతూవుంటే చూడటానికి నాకు ఎంతో ఆహ్లాదంగా వుంటుంది. మట్టిమీద చినుకులు పడిన

తరువాత గాలి మోసుకొచ్చే వింత పరిమళమంటే నాకు ఎంతో ఇష్టం. చీకటిసుందరి పెరమీద చిరునవ్వులా వెలిగి మాయమయ్యే మెరుపులు చూడటంలో నాకు అమితమైన తృప్తి లభ్యమవుతుంది.

వాన కురుస్తున్నపుడు గదిలో కూర్చుని వెచ్చగా సిగరెట్టు పీలుస్తూ కథలు వ్రాయటం నాకు ఒక హాబీ లాటిది.

కాని రెండు సంవత్సరాల క్రితం జరిగిన ఆ సంఘటన నన్ను పూర్తిగా మార్చివేసింది. ఇపుడు వర్షం కురుస్తూ వుంటే ఆ నాటి దృశ్యమే నా కళ్ల ముందు ప్రత్యక్షమౌతుంది, నా పాపాన్ని, పతనాన్ని, స్వార్థాన్ని ఎత్తిచూపి ఎగతాళిచేస్తూ వుంటుంది ఈ నాటికీ ఆ సంఘటన! ఇపుడు వర్షం కురుస్తూ వుంటే ఆ హోరు ఎవరో బాధగా మూల్గుతున్నట్లు, రాక్షసి ప్రసవ వేదనను అనుభవిస్తున్నట్లు అనిపిస్తుంది. కొన్నికోట్ల గొంతులు వెక్కి వెక్కి ఏడుస్తూ వుంటే ఆ కన్నీరే వర్షం కురుస్తున్నట్లు బాధపడతాను.

• • •

రెండు సంవత్సరాల క్రితం ఆ రాత్రి!....

కాటుకలా నల్లని మబ్బులు నింగిని ఆక్రమించుకొన్న రాత్రి - చెట్లను నేల గూల్చేలా ప్రచండ వేగంతో గాలి వీచినరాత్రి - ఏనుగుతొండలాటి ధారలతో వర్షం కురిసిన రాత్రి - ఆ రాత్రి, నాకు బాగా జ్ఞాపకం!

గది తలుపులు బిగించి. కుర్చీలో కూర్చుని, కాళ్ళు టేబిలుమీద పెట్టి, సిగరెట్లు అగ్గిపుల్లల్ని వేస్టు చేసుకుండా కాలుస్తూ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి "మంచిచెడ్డలో ఏకథ?" చదవటం పూర్తిచేసి ఆలోచనలో పడ్డాను! ఆ కథలో రెండు భాగాలున్నాయి. మొదటిది 'మంచి' రెండోది 'చెడ్డ'! ఆ రెండూ గొప్ప కథలే! ప్రతి మనిషిలోనూ ఆలోచనను రేపుతాయి! "అయితే, ఆ రెండిటిలో మీకు ఏది ఎక్కువ ఇష్టమో." చెప్తే మీ స్వభావం కొంత వరకూ వెల్లడవుతుందని నా అభిప్రాయం!" అంటూ చివరన ఒక పరీక్ష పెట్టారు రచయిత. ఎంతసేపు యోచించినా వాటిలో దేనిని నేను ఎక్కువ ఇష్టపడ్డానో తేల్చుకోలేకపోయాను! కాని ఇప్పుడు అనిపిస్తోంది. "వాటిలో నాకు రెండో భాగమే ఎక్కువగా నచ్చిందని."

ఆ ఆత్మపరీక్షా సమయంలో తలుపు దబదబా బాదిన చప్పుడయింది. లేచి వెళ్ళి తలుపు తీశాను. వర్షపు జల్లు ఒక్కసారి మొహాన కొట్టింది! ఆ మూసపంతా తడిసి ముద్దయిన ఆకారం, జగన్నాధం గదిలోకి వచ్చేడు.

జగన్నాధం నాతోటి గుమాస్తా! ఒక్కసారి మీరు వాడినిచూస్తే 'పీం



మార్చి 10 వ తేదీన శ్రీ ప్రకాశంపంతులుగారి రూప చిత్రం. (చూ. పై చిత్రం) రామకృష్ణా స్కూలు ఆంధ్రవిజ్ఞాన సమితి వారిచే బహూకరింపబడి శ్రీ యం. కే. వి. రెడ్డిగారిచే ఆవిష్కరింప బడింది.

ఆసమయంలో శ్రీ రెడ్డిగారు ప్రకాశం పంతులుగారి లోని కార్య దీక్షను, ప్రబల ధైర్యాన్ని కొనియాడుతూ, వారి సుగుణాలు ముందుయుగాలవారికి ఆదర్శప్రాయంగా నిలుస్తాయని ఆశించారు.

శ్రీ పి. తిరుమలరావుగారు ప్రకాశం పంతులు గారు 'ఆంధ్రకేసరి' కాక 'కేసరి' అని అన్నారు. శ్రీ ప్రకాశం పంతులు గారి జీవితంలోని కొన్ని కొన్ని ఘట్టాలను విద్యార్థులకు తెలియజేసి, వాటి వల్ల విద్యార్థులు తెలుసుకొని ఆచరించ తగిన ఆదర్శాలను తెలియ చేశారు.

సభాధ్యక్షులు శ్రీ చుండి జగన్నాథం గారు, శ్రీ ప్రకాశం పంతులు గారు మిగిలిన దేశ నాయకులంతా భయపడి పోయి చేయ సాహసించని ఆర్థిక సంస్కరణకు అతి ధైర్యంతో, అతి సాహసంతో వారు చేయ బూనినందుకు వారిని ప్రశంసించారు. శ్రీ ప్రకాశం పంతులు గారు జమీందారీ పద్ధతి మీద వ్రాసిన పుస్తకం చరిత్రలో చిర స్థాయిగా వుండి పోగలిగిన తాహతు కలిగిందని అన్నారు.

శ్రీ ప్రకాశం పంతులు గారి రూప చిత్రాన్ని తైల వర్ణాలలో చిత్రించిన, శ్రీ వి. నరసింహమూర్తి గారిని ఆంధ్ర విజ్ఞాన సమితి వారు సభాంతంలో రు 100 ల పారితోషికం సమర్పించి సత్కరించారు.

# - వంశధార కావాలె

ప్రజాప్రభుత్వం అంటే ఏమిటో అందులో మన హక్కులు—అధికారాలు—బాధ్యతను మనవిచేస్తాను విపులంగా. ఆగష్టు 15 తేదీలో భారత చరిత్రలో క్రొత్త అధ్యాయం ప్రారంభమైంది. అంతకు మునుపు మనలను పాలించే ప్రభుత్వము సామ్రాజ్యవాద ప్రభుత్వం. కాని, ఆనాటి నుండి ప్రజాప్రభుత్వం స్థాపించ బడింది.

ఈ సభలో ఏకగ్రీవంగా ఆమోదించ బడిన తీర్మానాలు.—

(1) పాతపట్నం తాలూకాకు ఏదో రెవెన్యూ పరిపాలనా సౌకర్యం నిమిత్తం ముక్కలుగావించి యిరుగు పొరుగు తాలూకాలకు కలిపి వేయుటకుగాను ప్రభుత్వం సన్నాహాలు జరిపిస్తున్న విషయం చాలశోచనీయం. సుమారు రెండులక్షల జనాభాగల యీ తాలూకాను ప్రజాభిప్రాయం తెలుసుకోకుండ యిట్టి ప్రయత్నం సాగించడం ప్రజాప్రభుత్వ సిద్ధాంతాలకు బద్ధవ్యతిరేకం కావున అవసరమైన రహదారులను ప్రభుత్వం వెంటనే నిర్మించి పై సన్నాహాలను విరమించు కోవాలని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ తీర్మానించడమైనది.

(2) యిటీవల విభజింపబడిన ఉత్తర విశాఖ జిల్లాకు శ్రీకాకుళం జిల్లాయని నామకరణం చేసేబదులు వంశధార జిల్లాయని పిలిచిన సమంజసముగా నుండునని ప్రభుత్వానికి విన్నవించడ మైనది.

(3) టెంబూరు కేంద్రంలో వెంటనే ఒక హైయ్యర్ ఎలిమెంటరీ స్కూలుస్థాపించాలని ప్రభుత్వాన్ని కోరడమైనది.

(4) టెంబూరుముఠాలో వైద్యసౌకర్యం లేదు. కావున టెంబూరులో ఒక ఆసుపత్రి వెంటనే తెరవాలని ప్రభుత్వాన్ని కోరడమైనది.

పాతపట్నం తాలూకాలో, వివిధ కరువురోడ్లు తక్షణం మరమ్మతు జరిపించవలెనని, అవసరమైన క్రొత్తరోడ్లుకూడా తక్షణం నిర్మించి రహదారి సౌకర్యం కల్పించవలెనని ప్రభుత్వమును కోరడమైనది.

వంశధారా రిజర్వాయరు నిర్మాణం గురించి సత్వరంగా కార్యక్రమం జరుగు సూచనలు కనపడనందున ఈ సభవారు మిక్కిలి నిరుత్సాహపడుచున్నారు. కావున సదరు నిర్మాణం తక్షణం జరిపించాలని ప్రభుత్వాన్ని కోరుచున్నాము.

పాతపట్నం తాలూకా ధాన్యం బోనసు పంపించే వ్యవహారంలో ప్రజలపట్ల ప్రవర్తన ప్రజలు సహింపజాలనిది. అది మార్చుకోవాలని కోరుతూ పై అధికార్లు యీవిషయంలో ఎన్ క్వయిరీ చేయాలనికూడా కోరుతూ తీర్మానించడమైనది.

## మహాత్మా!

శ్రీరమణీయ మా భరత-
సీమకు గల్గిన హాని సత్వము
న్వారణ జేయ నెంచి పలు-
మారులు నాంగ్ల ప్రభుత్వ ధాటిని
న్నోరుపుతో నెదిర్చి మన-
నోము ఫలింపగ జేసి నట్టి స
త్కారణ జన్ముడై వెలుగు-
గాంధి మహాత్ముడు దూరమాయె నే.
ఆదర పూరితంబయి స-
మైక్యత గూర్చు భవత్సు కార్యమీ
మేదినిలో దలంపక యొ-
మీ పయి నీసు వహించి కొందఱున్
భేద మనస్కులై తుదకు-
బిష్టులకుంగురి జేసిరీ మతో
న్మాదము రేటగల్వవిది-
మారిగ మీకటు దాపురించెనో.
అంగుళీయంబు వదలు వజ్రంబు సహజ
కాంతి వీడక నుండెడి- కరణి నీదు
సద్యశము జ్యోతి రూపమై-సర్వజనుల
నంత రాత్మల వెల్గుచు- నలరు గాత.
తలపగ రాని యట్టి శుభ-
దాయక మైన మహోపకారముల్
కలిపియు నర్థిశల్ వెలుగ-
సద్యశమంగ డియుంచి చేటిక
న్నలుక నెరుంగ నట్టి భవ-
దాత్మకు శాంతి గలుంగ నీదు నాం
ఘులం నెర వేర్ప సిద్ధులము-
సద్వినుతా! గొను మా నమస్కృతుల్

అన్నవానం కతికరయ్య

నన్ను చూడగానే జగన్నాథం కంట్లో నీళ్లు చిప్పిల్లాయి.

"కూర్చోక ఏం చెయ్యను? నేను అసమర్థుణ్ణి. దరిద్రుణ్ణి! ఎందుకూ పనికిరాని వాడిని! నాలాంటి వాడిని భగవంతుడు ఎందుకు పుట్టిస్తాడు? లోకంలోని నిర్భాగ్యపు గుమాస్తాలందరూ కలిసి దేవుడిమీద తిరగబడితే ఎంత బాగుంటుంది?

మూడు దినాలనుండి నా భార్యకు జ్వరం! నిన్న సాయంత్రం పరిస్థితి మరీ విషమించింది. డాక్టరు నీరు కార్చేసి విశాఖపట్నం పెద్ద ఆసుపత్రికి తీసుకు వెళ్ళిపొమ్మన్నాడు. నా దగ్గర చిల్లిగవ్వకూడాలేదు. ఎవరి దగ్గరా నయాపైసకూడా అప్పు పుట్టలేదు. ఇంక అప్పు చెయ్యనక్కరలేదులే! దీన్ని పైలాగు తీసికెళ్ళనక్కరలేదు! పిడికెడు బుగ్గి చేస్తే చాలు! నా భార్య - నా దారిద్ర్యానికీ అసమర్థతకూ బలి అయిన భార్య. లోపల మంచంమీద అతి ప్రశాంతంగా నిద్రపోతోంది చూడు!"

మాటలు ఆపి బిగ్గరగా, వికృతంగా నవ్వుతున్నాడు జగన్నాథం.

అలా నవ్వుతూ ఉంటే వాడిలో నుంచి ఏదో భయంకరమయిన భూతం వచ్చి నాజుట్టు పట్టుకొని పీకుతున్నట్లు అనిపించింది. నా గుండెల్లో దడ, కాళ్ళలో వణుకు ప్రారంభమయ్యాయి.

"నిన్నరాత్రి జగన్నాథానికి డబ్బు ఇచ్చి వుంటే ...?" మరి ఆలోచించలేకపోయాను.

జేబులోని నోట్లు గొంగళీ పురుగుల్లా మారి ఒంటిమీద పాకుతున్నట్లనిపించింది.

"ఈ డబ్బు ఉంచు! తరువాతి పనులకు పనికొస్తాయి" అంటూ జేబులోని పురుగుల్లాంటి నోట్లను తీసి వాడిమీదకు విదిల్చాను.

బరువు తగ్గటంతోబాటు నా మనసులోని దావాగ్ని హెచ్చవుతోంది.

నాలోని కుటిలత్వాన్ని, స్వార్థాన్ని ఈ [illegible] కడగలేవు.

[illegible] హోరున ఎవరో ఏడుస్తున్నట్లుంది.

...

---

★ ఒక ధనవంతుడు దగ్గరకు డాక్టరును పిలిపించాడు. డాక్టరు ఉత్సాహంగా- ఏమిటండీ మిమ్మల్ని బాధిస్తోంది?

ధనవంతుడు: "అది మీరే కనుక్కోవాలి. నే చెప్పటం ఎందుకు?"

డాక్టరు: అయితే ఒక్క గంట ఆగండి. నా స్నేహితుడు ఒకడు పశువుల వైద్యుడున్నాడు. నాకు తెలిసినంతమటుకు ఆయనొక్కడే ప్రశ్నలు వెయ్యకుండా రోగం కనుక్కోగలడు.




## మల్లాది

గత 400 సంవత్సరాలలో భూకంపాలవల్ల మరణించిన వారి సంఖ్య ఎంతో తెలుసా - 75 మిలియన్లు లేక ఏడుకోట్ల యాభై లక్షలు!!

•••

సైంటిస్టులు ఓ కొత్తరకం కెమెరాను తయారు చేశారు. దీనిలో ఫిల్ము మార్చకుండానే ఎన్నయినా ఫొటోలు తీయవచ్చు. అన్నీ కలర్ ఫొటోలు. అతిసహజంగా ఉంటాయ్. ఫొటో తీయడానికీ, డెవలప్ చేయడానికీ కలిపి కూడా చాలా తక్కువకాలం పడుతుంది. ఒక్క సెకన్లో తేలిగ్గా ఎనిమిది ఫొటోలు తీయవచ్చు. అలాటి కెమెరా ఖరీదు ఎంతవుతుందో చెప్పగలరా? కనీసం ఊహించగలరా?

దాని ఖరీదు ఎంతవుతుందో విలువకట్టలేం. ఎంచేతంటే ఈ కెమెరాని ఏ కంపెనీలు తయారు చేయవు. అమ్మవు. మీకు గుర్తులేదేమో కానీ, మీ దగ్గిరకూడా యిలాటి కెమెరా ఒకటుంది. దాన్ని మీరు "కన్ను" అంటారు.

•••

రష్యాలోని ఆర్మీనియాలో "మద్రాసు" అనే గ్రామం ఒకటుంది!! మన మద్రాసుకూ దీనికి సంబంధం కేవలం నామమాత్రమే అనుకోండి.

•••

మనిషి మెదడు బరువు మనిషి బరువులో యాభయ్యో వంతుంటుంది.

చీమ మెదడు బరువు చీమ బరువుల్లో సగం ఉంటుంది! ఏనుగు మెదడు బరువు ఏనుగు బరువులో 500 వ వంతు ఉంటుంది.

•••

1968 లో మెక్సికోలో జరిగిన ఒలింపిక్స్‌లో వేరా కాస్లావ్‌స్కా అనే చెక్ యువతి నాలుగు బంగారు పతకాలు, రెండు వెండి పతకాలు గెలుచుకొంది.

•••

స్విట్జర్లండులో స్త్రీలకు ఓటు హక్కులేదు. మిగిలిన యూరోపియన్ దేశాలన్నిట్లో స్త్రీలకు ఓటు హక్కుంది.

•••

అమెరికాలో హూస్టన్ నగరానికి చెందిన డా॥ డెంటన్‌కూలీ చేసినన్ని గుండె ఆపరేషన్లు ప్రపంచంలో మరే యితర డాక్టరూ చేయలేదుట 47 సంవత్సరాల వయస్సున్న డా॥ కూలీ యిప్పటికి నాలుగువేల ఆపరేషన్లు చేశాడు. యిందులో దాదాపు వెయ్యింటికి పసిపాపలమీద చేశాడు. ఈయన ఒక్క రోజులో మూడు, నాలుగు కష్టమైన ఆపరేషన్లు చేయగలడు. పేషెంట్లదే ఆలస్యం!!

•••

1660 వ సంవత్సరందాకా ఆలోచనకు కేంద్రం మెదడని శాస్త్రజ్ఞులు తెలుసుకోలేకపోయారు. గుండె ఆలోచనలకూ, తెలివికీ స్థానమనుకొనేవాళ్ళట అప్పటిదాకా!

•••

ప్రతిరోజూ పదిగంటల చొప్పున రోమ్‌లో విశేషాలన్నింటిని చూడటం మొదలెడితే రోమ్ అందాలన్నీ చూసేందుకు కనీసం పది సంవత్సరాలు పడుతుంది.

•••

మన శరీరంలో ఉన్న రక్తనాళాలన్నింటినీ ఒకదాని పక్కన ఒకటి అమర్చుకొంటూ వెళ్తే వాటి పొడుగు లక్షమైళ్ళుదాటి పోతుంది!

# 'మిక్కీమౌస్' హిందూస్థానీ చిత్రం

వాల్ట్ డిస్నీ హిందూస్థాన్‌లో, అడివిజంతు జీవితాన్ని చిత్రించి తయారు చేసిన "బాంబీ" అనే చిత్రానికి హాలీవుడ్ ఫారిన్ కరెస్పాండెంట్సు ఎసోసియేషన్ వారు, ప్రత్యేక బహుమానాన్ని యిచ్చారు.

1947 ఉత్తమ నటీ, నటులుగా రోసాలిండ్ రసల్, రోనాల్డ్ కోల్‌మన్లు ఎంచబడి గండపెండేరాలు అందుకొన్నారు.

"జెంటిల్ మెన్స్ అగ్రిమెంట్" అనే చిత్రం 1947లో ఉత్తమ చిత్రంగా పరిగణింపబడి, బహూకరింపబడింది.

## మద్రాసు ప్రభుత్వ ఫిలిం ప్రచారం

మద్రాసు ప్రభుత్వంవారు ఫిల్ములు ప్రచారానికి తగిన సాధనాలుగా ఫిల్ములను పరిగణించి, ఉపయోగించబోతున్నారు.

ఈ సమయంలో వారు ఎలాంటి విషయాలను గురించి ప్రచారం చేయబోతున్నారో తెలుసుకోవాలని కుతూహలపడటం సహజమే.

ముఖ్యంగా మన రాష్ట్రంలోని ప్రజలో చాలా భాగానికి మానమర్యాదలు ఎదుటివారికి యివ్వటం, తాము పుచ్చుకోవటం తెలియదు. ప్రతి ఒక్కరూ ప్రతి యితరునికీ తగిన గౌరవాన్నియిచ్చి ప్రవర్తించేలా చేయటానికి, ప్రభుత్వ ప్రచారకమైన ఫిల్ము ఉపయోగపడవచ్చు.

ప్రజోపయోగంకోసం ఏర్పాటు చేయబడే నీటికొళాయిలు, రైలుస్టేషన్లు ట్రాములు, బస్సులు, పార్కులు మొదలైన వాటిని ఉపయోగించటంలో చాలా మంది పశువులలా ప్రవర్తిస్తాంటారు. అజ్ఞానంవల్ల వారందరికీ వారివారి వివేచనాజ్ఞాన శూన్యతను తెలియపరిస్తే వారు అలా ప్రవర్తించటం తక్షణమే మానేస్తారనటానికి అంత సంకోచపడనక్కరలేదు.

ప్రభుత్వం క్రొత్తగా అమలు పెట్టబోయే నూతన చట్టాలనుగురించిన విశేషాలు, చేయబోయే సంస్కరణకు సంబంధించిన విషయాలు, వారిలాగూ ప్రచారం చేసుకొంటారు.

## సంఘసేవకు యు.యన్.ఓ. డాక్యుమెంటరీలు

భారతీయ సంఘ సేవకుల వుపయోగార్థం, యునైటెడ్ నేషన్సువారు నాలుగు డాక్యుమెంటరీ చిత్రాలు తీస్తున్నారు. వాటిలో మూడు ఇండియాలోనే తీయబడుతున్నాయి. మొదటిది బొంబాయి రాష్ట్రంలోని సతారాకు దగ్గరగా వున్న ఒక గ్రామంలో, మిస్ మేరియన్ డిక్సీ, (యునైటెడ్ నేషన్స్, ప్రచురణశాఖ ఫిలింఛీఫ్) హాన్సా మెహతా, డాక్టర్ కె. దాస్ మాస్కర్ల సహాయంతో, తయారు చేస్తోంది



సుందరి

ఈమూడు చిత్రాలలోనూ, ప్రసవకాలానికీపూర్వం, ప్రసవానికి తరువాత సహజంగా ఏర్పడే మార్పులు, వీటికిగాను తీసికోవలసిన చర్యలు, శిశుపోషణ విధాలు చాటింపబడుతాయి. ఈమూడుచిత్రాల్లోనూ బొంబాయిలో ప్రఖ్యాతి గడించిన డాక్టర్ దుబాష్ సతీగారు నటిస్తున్నారు.

తయారైన ఈ చిత్రాలు, సంఘసేవకోసం ఏర్పడిన సంస్థలకూ, వైద్యకళాశాలకు, ఆడపిల్లల స్కూళ్ళకు, కాలేజీలకు ఉచితంగా ప్రదర్శనార్థం యిస్తారు. ఈచిత్రాలతో పాటు పెద్ద పోటోలు కూడా ప్రదర్శిస్తారు.

## బ్రిటన్‌లో అమెరికన్ ఫిల్ములు తిరిగి దిగుమతి

మార్చి 11 వ తేదీ నుంచి పది నెలలుగా స్తంభించి పోయిన అమెరికన్ ఫిల్ముల దిగుమతి, బ్రిటన్‌లో మళ్ళీ సాగబోతోంది. అమెరికన్ మోషన్ పిక్చర్ ఎసోసియేషన్ వారితో సంప్రదించి, క్రిందటి ఆగష్టులో డాలర్లు నిల్వ చేయటానికి గాను అమెరికన్ ఫిల్ముల మీద వేయబడిన 75-౦/౦ దిగుమతి పన్నును, వీలైనంత త్వరలో రద్దుపరచడానికి, బ్రిటిష్ బోర్డు ఆఫ్ ట్రేడ్ అధ్యక్షుడు, హారాల్డు విల్సన్ హామీయిచ్చాడు.

సర్ స్టాఫర్డు క్రిప్సు గారి యీ ఆర్థికపథకానికి సమాధానంగా, అమెరికాలో తయారయ్యే క్రొత్త చిత్రాలు బ్రిటన్‌కు ఎగుమతి కాకూడదని అమెరికన్ ప్రభుత్వం నిషేధించింది.

క్రొత్తగా ఏర్పడిన ఒడంబడిక ననుసరించి మొదటి రెండేళ్ళలోనూ బ్రిటన్‌లో, ప్రదర్శింపబడే అమెరికన్ చిత్రాలకు అమెరికాకు 17 మిలియన్ల డాలర్లు యీయటానికి బ్రిటన్ అంగీకరించినట్లు, మిస్టర్ విల్సన్ వల్ల తెలుస్తోంది.

✳

యునైటెడ్ పిక్చర్సు వారి 'శ్రీసాయిబాబా' పూర్తి కావచ్చింది. భారతి. యం. రామచంద్రరావు. అద్దంకి. సి. యస్. ఆర్. పారుపల్లి. కృత్తివెంటి నటీనటులు-దైర్శకుడు పట్టాభి. రసవత్తరంగా కొత్తరకంగా తీయుస్తున్నాడు. శ్రీరామనవమికి విడుదల చేస్తారని తెలుస్తోంది.

✳

సుందరి : ఈమె పేరే సుందరి (చిత్రం. చూ.) ఉదయ శంకర్ శిష్యురాలు. అనేక దేశాలు తిరిగి ఇదీవలనే స్వదేశం చేరింది. ఆంగ్లసీమలో, ఫ్రెంచిదేశాన చాలా కళాక్షేత్రాలను, విద్యాలయాలను, ప్రదర్శనమందిరాలను చూచి వచ్చింది.

## మా చిన్నకథ

తృప్తి పడేది. ఈసారి ఆమె నాతో ఒక గంట సేపు మాట్లాడుతూ కూర్చున్నా యిది వరకటి లాగ నడుం నొప్పి వల్ల బాధ పడలేదు. ఆమె ఆరోగ్యం బాగు పడింది. వంట చేయటం చేతనైంది. కానీ నేనామె భర్తను గురించి ప్రశ్నించి నప్పుడు మాత్రం ఆమె కళ్ళలో భయం లీలగా ప్రవేశించింది. ఆమె అప్రశక్తిని రానీయ కుండా "ఈ సారి వాళ్లు నన్ను ఏడిపించాలని ప్రేమ అడిగితే చెప్పెయ్యగలను" అని బిగ్గరగా నవ్వింది.

సరిగా అప్పుడయినా ఆమె పెద్ద వదినె గారు లోపలికి వచ్చి "ఏమమ్మా, వంట యిందా" అని అడిగింది.

"ఆఁ! అయిపోవచ్చింది." చెయ్యి పైకెత్తి అనాదినుంచి గడియారం చూసే పనులు చేసేవానిలా, దానికేసి చూస్తూ "సరిగ్గా 8 గంటలకల్లా సిద్ధం అవుతుం దమ్మా" అని అంది.

ఇదంతా చూచిన వదినెగారు "నీకీగడియారం ఎక్కడిది?" అని గద్దించింది.

ఆమె వదిన గారికేసి ఓ క్షణంచూసి, నవ్వుతూ "ఆకాశంమీదనుంచి వూడిపడ్డ దమ్మా! లేకపోతే నాకెక్కడనుంచి వస్తుంది" అన్నది. వదినెగారు చర చరా వెళ్ళిపోయి యింట్లోవున్న అందరు ఆడ వాళ్ళతోనూ కలిసి తిరిగివచ్చింది. వారంతా ఆమె చుట్టూ మూగి ప్రశ్నలు కురిపిస్తున్నారు. తీక్షణంగా చూస్తున్నారు. ఆక్షణంలో వారంతా అలావుండటం ఆమెకెంతో గర్వకారణం అయింది. "నీకల తిక్క సమాధానాలు మానేసి, నీకాగడియారం ఎవరిచ్చారో చెప్పతావా, లేదా?" అని హుంకరించింది: అత్తగారు. ఆ గర్జనతో, ఆమెకు తానెక్కడున్నదీ జ్ఞాపకంవచ్చింది —వున్నట్టుండి నిశ్చేతనమయింది. నావైపు కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ, "నా స్నేహితురాలు యిచ్చింది" అన్నది. అత్త గారు ఏమీ అనలేక పోయిందికానీ, ఆస మాధానంవల్ల శాంతపడలేదు.



కొంతసేపటికి వారందరూ వంటయిల్లు, ఆయింటిలోని మాయిద్దరిని వదిలివెళ్లారు. ప్రొద్దుపోతున్నందున నేను సెలవు తీసుకోటానికి లేచాను. ఆమె నాచేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని, కళ్ళనీళ్ళు కుక్కుకొంటూ చూచింది. "నీవినాడు నాపై చూపిన ప్రేమకి నేనేవిధంగా బదులీయ గలనో నాకు తెలియటంలేదు. అనేక సంవత్సరాలనుంచీ నేనేదైతే ఒక మధుర స్వప్నంగా మాత్రమే ఎంచుకొంటున్నానో, దానికి నీవు రూపం కల్పించావు" అంది. ఆమె ఆవాక్యాలు ఎంతో హృదయ పూర్వకంగా మర్మంలేకుండా పలికింది.

రాత్రి, భోజనాలయిపోయి, మా యింట్లో మేమందరమూ పడుకోబోతూండగా, ఎవరో ఒకపొట్లాం తెచ్చియిచ్చారు. అర్థంకాక, తెరిచాను. లోపల ఆ గడియారం దానితోపాటు చిన్నపిల్లల దస్తూరీతోవున్న చీటీ వున్నాయి. అందులో —నా ప్రియమైన చెలీ!

నీవు యిచ్చిన బహుమానం స్వీకరించటానికి కావలసిన అర్హత నాకు లేదు. కాబట్టి, నేను దానిని అందుకోలేక పోతున్నాను.—సెలవు.

నాకాశ్చర్యమైంది—ఆమె అంతగా ఆకాంక్షించిన ఆ వస్తువును తిరస్కరించే విధంగా ఆమెను ఎవరు చేయగలిగారో అని. ఆరాత్రిఅంతా పసిపిల్ల ముఖంలాంటి ఆమె ముఖం నాకళ్ళ ఎదుటినుంచి తొలగలేదు. సుమారు తెల్లవారు ఝామున 3 గంటలప్పుడు, ఆమె చెయ్యి నానుదురును తాకినట్లు తోచింది, "నువ్వు ఒకతవేకదా నా ఆప్తురాలివి" అని ఆమెనా చెవిలో అన్నట్లు వినిపించింది. త్రుళ్ళిపడి లేచాను, కాని ఎవరూలేరు. తెల్లవారంగానే మొట్ట మొదటిసారి ఆమె యింటికిపోవటమే అని నిశ్చయించుకొని నిద్దురపోయాను.

తెల్లవారంగానే వారింటికి వేగంగా నడిచిపోయాను. వారి వాకిట్లో అందరూ



కూర్చొని చావు ఏడుపులు ఏడుస్తున్నారు. "ఆమె...? అబ్బె అసంభవం! అదేం లేదు." ఆమె అత్తగారిదగ్గరకు వెళ్ళాను. నేనేదైతే భయపడ్డానో, అదే జరిగింది. "బస్తీ పిల్లని కొంపలోకి తెచ్చుకోవటం తోనే పాపం బద్దలయిందమ్మా! మా బ్రతుకు నవ్వులపాలు అయిందమ్మా! ఓ- ఓ-! ఓ-! అని పెద్దపెట్టున రాగం మొదలు పెట్టింది అత్తగారు. వళ్లుమండిపోయి, పెద్ద దన్న గౌరవంకూడా కొకుండా ఆమెచెయి గట్టిగా పుచ్చుకొని "అసలు సంగతేమిటో చెప్పవమ్మా—మహాలక్ష్మమ్మా. ఏం జరిగింది?" అని కుదించి అడిగాను.

జరిగిన సంగతి అంతా క్లుప్తంగా యిది ఆమె ఆత్మహత్య చేసుకొంది. ఆరాక్షసిభర్త ఆమెను ఆ గడియారాన్ని తిప్పి పంపేయమని నిర్బంధించాడు. చూరునుంచి చీర వేళాడదీసి, చీరకొంగుకు తన్ను వేళాడ కట్టుకొంది. "ఇలాంటి విపరీతం మీరు ఎక్కడన్నా విన్నారా?" అంది అత్త గారు. "ఒక వెధవ చేతిగడియారం కోసం ప్రాణం తీసుకొంటారటమ్మా?— సాంప్రదాయం కాపాడుకో నక్కరలేదా తల్లి! ఇంతకీ అది మాగడప ద్రొక్కిన వేళా విశేషం—మా వంశ గంగపాలు అయింది" అని ఏడవనారంభించింది.

నాకు ఆ 'అత్తగారి' మీద ఆ 'భర్త' మీద, పల్లెటూరి మూఢజనంమీద వచ్చిన కోపాన్ని ఎంతో ప్రయత్నంమీద నాలోనే అణచుకొంటూ, ఆమె మృతకళేబరం దగ్గిరకు వెళ్లాను. ఆమె సుందరవదనం, కా

(మిగతా 21వ పుటలో)

నేర్పించింది రాధికే! అందుకే నాకు రాధికంటే ప్రేమ. అసలు ప్రేమ ఏమిటో కూడా తెలియ జెప్పిందీ. ఆవిడే!!....నిజం! వెన్నెలా! నీకు తెలుసో....తెలీదోగానీ....నాకు బ్రతకడంలో కలలు కనడం నేర్పింది ఆమే....!"

"నాకప్పుడప్పుడూ అనిపించేది ఆ భగవంతుడే గనక ఎదురొచ్చి నీకీ ప్రపంచంలో ఏం కావాలని అడిగితే ఓసారి భగవంతుణ్ణి చూసి పిచ్చిగా గొంతెత్తి నవ్వాలని వుండేది. లేకపోతే....రాధికే నాకు ప్రపంచం అయినప్పుడు ఇంక నేనేం కోరుకుంటాననీ....?"

క్షణం ఆగి చటుక్కున నవ్వాడతను. వెన్నెల ఉలిక్కిపడింది. అతనెందుకు నవ్వేడో వెన్నెల కర్థంకాలేదు.

"ఇప్పుడనిపిస్తోంది. నిజంగా భగవంతుడలా నన్నడిగినప్పుడు నేనలా ప్రవర్తించకుండా వుండాలని! గర్వంగా ఎదురు చెప్పకూడదని! కనీసం 'రాధికను నాకు దూరం చేయకు స్వామీ' అనయినా బ్రతిమాలాలని!" అంటూ అతను తలొంచుకున్నాడు.

అతనలా కన్నీరు కార్చటం వెన్నెలకి బాధ కలిగించింది.

"మీరిలా క్రుంగిపోవటం బాగోలేదు. మీకింతకన్నా ఏం చెప్పను?" అన్నది.

అతను కన్నీళ్ళు నిండిన కళ్ళని ఎత్తి వెన్నెలకేసి చూసేడు వెన్నెలకి సిగ్గేసింది. తలతిప్పి చుట్టూ చూసింది.

"నాకు వేళయింది. మళ్ళీ కలుస్తాను. ఇలాగే రేపు! వెళ్తా" అంటూ లేచి ఆకుల్లోంచి చంద్రుడికేసి వెళ్ళిపోయింది వెన్నెల.

మర్నాడు-

మబ్బు కమ్ముకున్నప్పుడు-

అసలు రావలసిన వేళకన్నా



## ఎంత తేలిక !
## ఎంత సుఖం ! !

ఈ కుర్చీ బరువు పావున్నర పౌనులంటే నమ్మండి. 12 అంగుళాల నిడివి, 8 అంగుళాల వెడల్పు గల మూతలో ఇది పడుతుంది. ఒక లండన్ ప్రదర్శనంలో వుంది ఈ ఆసనం.







**వీడ్కోలు !**

బ్రిటిష్ సేనలు నిజంగానే మన దేశం వదలివెళ్లినవి. ఇది ఆఖరు మిలిటరీ దళం.

కోసం తనాతన్ని పెళ్ళి చేసుకుందనీ చెప్పింది. మొన్నెప్పుడో నేనుపట్నం వెళ్ళినప్పుడు సన్మానంలో కాబుజారిచల పతికి వగర ఖునందుని పెళ్ళి చేసుకో వలసి వొచ్చిందనీ పశ్చాత్తాప పడింది.

'నువ్వు నమ్మవుగానీ వెన్నెలా! రాధిక ఇవాళ ఎంత బాధ పడిందనీ? నిజానికి చలపతిని పెళ్ళి చేసుకున్న దన్నమాటేగాని, నామీదే తన ప్రేమ వుందనీ, తన జీవితకాలం నా జీవ నాదంలోనే గడుపుతామని తన ఆలోచన లట. నిజంగా నాకే జాలేసింది అప్పట్లో ఆ పరిస్థితుల్లో ఎవరయినా అంతే చేసేవారేమో! ఏమో ఏమిటి? నేనయితే అలాగే చేసేవాణ్ణి! రాధిక నన్ను కాదని చలపతిని పెళ్ళి చేసుకోవటం తప్పని సరయింది. అందుకు నేనిప్పుడు బాధ పడటంలేదు ...”

వెన్నెల నిశ్చేష్టితయ్యింది.

అతను చెప్పుకుపోతున్నాడు.

“మొదట నేను నమ్మలేదులే! కాని నిజంగా నామీద తనకి ప్రేమ వున్నట్టూ, అందుకు నిదర్శనంగా తనని నాను సమర్పించుకునేందు కివాళ ఈ కాలవొడ్డుకి వొస్తానంది.

“నిజం వెన్నెలా! ఇన్ని సంవత్సరాలుగా నేను ఎన్ని సార్లనుకున్నాను- రాధిక యవ్వనంతో ఆడుకోవాలనీ. రాధిక మనసులో నిలిచిపోవాలనీ, రాధికలో లీనమయిపోవాలనీ!. నా ఈ కలలన్నీ ఇవాళ ఈ కాల్వవొడ్డున నీ వెలుగులో తీరుతాయి. రాధిక నా కోసం ఇంకాసేపట్లో ఇక్కడికి వొస్తుంది. నీకు రాధికను పరిచయం చేస్తానుగా? చూద్దువుగాని! విన్నటి వరకూ నాది కాకుండా పోయిందన్న అందం ఇంకాసేపట్లో నా చేతిలో గులాబీ పువ్వయి పోతుంది. పిచ్చెక్కి రాధికను మోహావేశంతో కౌగలించు కుంటాను. ఈ లోకంలో నా జీవితాని కల్లా ఎక్కువయిన ఆనందాన్ని ఈ రాత్రి అనుభవిస్తాను. ఆమె యవ్వనాన్ని మధువులా తాగేస్తాను. నన్ను నమ్ము వెన్నెలా! నేనంటం కాదుగాని .చూస్తావుగా ..”

నవ్వుతూన్న అతణ్ణి చూస్తుంటే వెన్నెలకి పిచ్చెక్కి పోయేలా అనిపించింది. అటూ ఇటూ చూసింది. అడ్డు వొస్తూన మబ్బుని చూసి వెన్నెల చటుక్కున లేచి చంద్రుడికేసి పరిగెత్తి వెళ్ళిపోయింది.

ఎందుకో మబ్బు తునక అడ్డు తొలగ నంతవరకూ ఎప్పు అతని గురించి కన్నా ఆమె గురించి-రాధిక గురించి ఆలో చించాలనిపించింది.

“అగ్ని సాక్షిగా పవిత్రంగా పెళ్ళాడిన భర్తను కాదని. తన సర్వస్వం. తన స్త్రీత్వం అర్పించిన భర్తను కాదని మనోమందిర దాసోహం అయ్యేందుకు సిద్ధపడిన ఆమెను తప్పకుండా చూడా ల”నిపించిందు వెన్నెలకి!

మబ్బుతెర తొలగినప్పుడు రాధికను చూడాలన్న అత్యంతాతో తలకేసి పరుగెత్తి వెళ్ళి. కాలవొడ్డున అతనామెని గొంతు నులిమి చంపుతూండటం కనిపించి ఆశ్చర్య పోయింది వెన్నెల!

* * *

# ౭ అడుగుల కథానాయకుడితో అమ్మాయి వలపు - - అను జీవితంలో మలుపు

## రాజ్యలత

జన సమ్మర్ధంగా వున్న నారాయణ గూడా బస్సుస్టాపు దగ్గరికి దుమ్ము లేపుకుంటూ అప్పుడే వచ్చి ఆగింది సెక్రటేరియట్ బస్సు. జనం తొక్కిడికి తట్టుకోలేని వసంత దూరంగా నిలబడి టైము చూసుకుంది ఆతృతగా. 9-45 అయింది.

పావుగంటలో ఆఫీసు చేరకపోతే లేటు మార్కు. ఆపైన తోటి స్టెనోల హేళన.

ఏమి చెయ్యడానికి తోచక తనని తనే విసుక్కుంది.

తొందరగా బయలుదేరడం కుదరదు. అదీగాక ఏవో చిన్న చిన్న చికాకులు.

సూర్య భగవానుడు తనని మరి కాస్త ప్రేమగా చూస్తున్నాడు.

ముక్కు మొహం ఎర్రబడి పోతోంది. నుదుటిమీది చిన్న వెంట్రుకలు అనువులో వుండకుండా తిరుగుబాటు చేస్తున్నాయి. ఎక్కువ మేకప్ లేకపోయినా కనీసం మొహానికి రాసుకున్న పౌడరైన యింకొక పావుగంట వరకూ వుంటుందన్న గ్యారంటీలేదు.

చీర నలుగుతుందన్న భయం మటుకులేదు. ఎందుకంటే అలా నిలబడి ప్రాణాలు వదలాల్సిందే కాని కూర్చోడానికి చోటేదీ?
ఆలోచిస్తున్న వసంతకి తననెవరో పరీక్షగా చూస్తున్నట్లు తన కళ్ళజత చెప్పింది.

ప్రతిరోజు యెంతోమంది ఒకరినొకరు చూసుకోవడం తటస్థిస్తున్న ఈ మహానగరంలో ఆ చూపు నామె లక్ష్య పెట్టలేదు.

ఇంతలో బస్సు రావడంతో గట్టి ప్రయత్నంచేసి అందులో కెక్కింది.

తన వెంట క్రితం చూపు తాలూకు వ్యక్తి యెక్కినట్లు గమనించింది. కాని అది తన మైండ్ రికార్డు చెయ్య లేదు.

తను నిలబడే వుంది బస్సు విమానంలా వెళ్ళిపోతేబాగుండుననిపిస్తోంది.

"మీరిక్కడ కూర్చోవచ్చు మిస్!" అన్నమాట విని తల త్రిప్పి చూసేసరికి నిలువుపెత్తు మనిషి కనిపించాడు. మనస్సులోనే థాంక్సుచెప్పుకునికూర్చుంది.

బస్సు వసంత గమ్యం చేరింది.

పదికి రెండు నిమిషాలుండనగా తన సీటులోకి చేరి గట్టిగా వూపిరి తీసుకుంది- యీ రోజుకి గండం తప్పింది కదా అని. పని మామూలే.

సాయంత్రం బస్సు కోసం నిలబడి ఆలోచిస్తూండగా ప్రొద్దుటి వ్యక్తి మళ్ళీ కనిపించాడు.

మనస్సులోనే నవ్వుకుంది - అతను ప్రొద్దుటి మాదిరిగానే నలగకుండా చెరగకుండా వున్నాడు.

తను- పొద్దున్నే అలసిపోయింది. ఇంక యిప్పుడు చెప్పనే అక్కర్లేదు. అందులో యింటికి వెళ్ళాక అమ్మ అనారోగ్యం తమ్ముళ్ళ అల్లరి- మరీ నీరసం తెప్పించాయి.

## 2

మరునాడు త్వరగా తెమిలివస్తోంది వసంత. చిన్ననాటి స్నేహితురాలు వనజ కన్పించింది.

"ఏమిటో యీ హడావిడి? ఆఫీసు కేనా లేక మరేదైనా ఎపాయింట్ మెంటా? వనజ ప్రశ్న.

"చాలమ్మా! ఆఫీసు పని చాలు. ఎపాయింట్ మెంటు తో పాటు డిసప్పాయింట్ మెంట్లుకూడా ఎందుకు?" అంది వసంత.

"మరి ఆఫీసు టైము మార్చారా? తొమ్మిదింటికే లెఫ్ట్ రైట్ మొదలు పెట్టావేం?"

"బస్సులు దొరకక రోజూ లేటు మార్కే. ఆ గోలెందుకని త్వరగా బయలుదేరాను. ఇలాంటప్పుడు మనకి కారు స్నేహితులు దొరికితే బాగుణ్ణనిపిస్తుంది కదూ!" కాస్త నిర్లిప్తంగా మాట్లాడింది వసంత.

"ఆడ స్నేహితులా? మగా?" చిలిపిగా అడిగింది వనజ.

"నీ కెప్పుడూ హాస్యమే. నన్నేడిపించే బుద్ధి దేవుడు నీకెందుకు పెట్టాడో."

"అడిగిచూ వెళ్ళి! చెబుతాడేమో! అయినా యింకెన్నాళ్ళేనీకీ అవస్థ. హాయిగా కారులో తిప్పేవాణ్ణికట్టుకో. ఇంక ఆఫీసు బస్సు అక్కర్లేదు. పైగా కారుంటుంది!" అంది వనజ.

"ఆ! నా బ్రతుక్కి కారున్నవాడు కూడాను. అసలు ఆఫీసుకెళ్ళేటప్పుడు కారెందుకు? నీతెలివి ప్రశంసనీయమే" ఈసారి ఏడ్పించడం వసంతవంతైంది.

"ఏం! కారుకి ఆఫీసుకి ఏదైనా ముడిపుందా! అసలు కార్లు హాయిగా తిరగడానికే...." అంటూండగా.

"పద పద లేటవుతోంది." నడక వేగం హెచ్చించింది.

ఇద్దరూ బస్సు రాగానే యెక్కారు.

ముందుసీటులో నిన్నటి మనిషి పేపరు చదువుతూ కనిపించాడు.

వసంతకి నవ్వొచ్చింది. తనతో బాటు బస్సు త్వరగా వచ్చిందా-లేక తనతో మాట్లాడటంతో మామూలు ఆలస్యం అయిందా! తన నవ్వుని సమాధానమా అన్నట్లు వెనక్కి తిరిగి చూసి వసంత గాభరా పడింది. "ఎంత ధైర్యం ఈ మనిషికి" అనుకుంది. అయినా యిలాంటి విషయాలపై ఎక్కువ ఆసక్తిలేని వసంత తన మనస్సుని ముందుకి పోనివ్వలేదు.

ఆఫీసు పనిలో మునిగివున్న వసంత పేరుమీద రిజిష్టరు లెటరు వచ్చి దానితోటి ఆశంగు అందరూ చుట్టూచేరారు.

వసంతకి చెడ్డ చిరాకు వేసింది. అసలు వీళ్ళందరికి ఎందుకింత ఆసక్తి? ఈ సంఘం ఇంకమారదు. అనుకుంది.

"ఎక్కడి నుండి లెటరు?" అంది విమల.

"ఆఫీసుకి నీ కెప్పుడూ లెటర్సు రాలేదే?" అంది రేఖ.

"నా అనుమానం ప్రేమ లేఖేమో నని ..." అంది నిర్మల.

"కవరే! పెళ్ళి కాని పిల్లకి. అందులో ఆఫీసుకి" అంటూ క్వొశ్చన్ మార్కు మొహం పెట్టింది పెద్దతరహా కామేశ్వరి.

పిల్లలెవరికీ వసంత జవాబు చెప్ప లేదు. అసలు తనకే అర్థం కావడం లేదు, ఎవరు వ్రాసారో అన్న సంగతి." అయినా అక్కడ కవరు చించలేదు. ఇంటికొచ్చి చూసుకున్నాక అనుకుంది....

"వాళ్ళముందు చదవక పోవడం ఎంత మంచిపనైంది" అని.

# 3

వసంతగార్కి వ్రాయు శుభ లేఖార్ధములు.

నేను మీకు అపరిచితుణ్ణే. కాని మీరు నాకు పరిచితులే. మిమ్మెంత కాలం ఏన్నోసార్లు చూశాను. మీలోని నిరాడంబరత, అమాయకత్వం, గంభీరతవంటి లక్షణాలే నన్ను ఆకట్టు కున్నాయి. మీతో పరిచయం పెంచుకోవాలని నా మనస్సు కోరుతుంది. మీరు దీనికి సుముఖులైన పక్షంలో నాకు జవాబు వ్రాయగలరని ఆశిస్తున్నాను.

సదా మీ శ్రేయస్సు కోరే
సంపత్ కుమార్

అసిస్టెంటు యింజనీర్,
సి. ఇ. ఆఫీసు
హైదరాబాద్.




వసంతలో సంఘర్షణ మొదలైంది. ఎవరితను? నన్నెక్కడ చూశాడు? అతను అంతగా ఆకర్షించబడటానికి నాలో ఏముంది? అని అనేక విధాలుగా ఆలోచించింది.

అసలు ఇలాంటి పరిచయం అందులో యువకుడితో చేసుకున్నందువల్ల ప్రయోజనం కంటే హాని ఎక్కువగా వుంది.

అనవసరంగా కష్టాలు కోరి తెచ్చుకున్నట్లవుతుంది.

అపరిచితుణ్ణి వ్రాసుకుంటూనే లెటర్సు వ్రాయమనడంలో అర్థమేముంది? అని వూరుకుంది.

"వసంతా" అని నాన్నగారు పిలిచారు.

అక్కడికి వెళ్ళేసరికి అమ్మ, తమ్ముళ్ళు నాన్నగారు అంతా తనవైపు చూశారు.

"చూడమ్మా! మన శ్రేయోభిలాషులు, మనకి చిన్నప్పటినుంచి తెలిసినవారు - అయిన రామవేంకట్రావుగారు వుత్తరం రాశారు". వసంత నిశ్శబ్దంగా వింటోంది.

"వారి రెండవ కుమారుడు ఈ మధ్యనే బి. ఎ. పట్టా పుచ్చుకున్నాడట. స్నేహం బలపడటానికి బంధుత్వం కలుపుకుందామంటున్నారు. మనమైనా ఎక్కువ అంతస్థుకు పోలేము కదా. నీకు మనస్సులో ఏవిధమైన సంకోచమున్నా మాకు చెప్పు.

నువ్వు మనస్ఫూర్తిగా అంగీకరిస్తేనే ఏదైనా జరుపుతాము" అంటున్న నాన్నగారి మాటలకు-

"నన్ను కాస్త ఆలోచించుకో నివ్వండి" అని సమాధాన మిచ్చింది.

"అలాగేనమ్మా" అన్నారు నాన్న గారు.

పడకమీదకు చేరిన వసంతకి ఆనాటి సంగతులు విచిత్రంగా వున్నాయి. ఉత్తరం రావడం, రాఘవేంద్రరావుగారి సంబంధం రెండూ ఒకేసారి వచ్చాయి.

చదువు పూర్తయిన వెంటనే తన వివాహ ప్రసక్తి వచ్చినప్పుడు తను గట్టిగా సమాధాన మిచ్చింది- తన కిప్పుడే వివాహం చేసుకోవాలనిలేదని.

కాని ఉద్యోగంలోచేరి రెండు సంవత్సరాలు గడిచేసరికి మనస్సు మార్పుని కోరుతోంది. అలాగని -

పై రెండూ ఒకేసారి రావడం నచ్చలేదు.

అయినా ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది కాని మన చేతిలో యేముంది అని సరిపెట్టుకుంది.

# 4

మరో వారంరోజులు ఏ మార్పూ లేకుండా కాలం కదిలిపోయింది. మధ్యాహ్నం వసంత తన పనిలో మునిగి వుండగా ఆఫీసు ప్యూను తన కొక కవరందించి వెళ్ళిపోయాడు-

తన సెక్షను వాళ్ళందరూ ఒకసారి తలెత్తిచూసి మళ్ళీ వాళ్ళ పనులలోకి జారిపోయారు. వసంత అక్కడేకవరు చించింది.

వసంతగారూ,

నా లెటరందివారమై వుంటుంది. జవాబు మీరు వ్రాయలేదు. అందులో మీకేమైనా అసభ్యంగా తోచిందా? చదువు సంస్కారమున్న మీరు అలా అపార్థం చేసుకుంటారనుకోలేదు. మీ అభిప్రాయం యెలాంటిదైనా నేనంగీ కరిస్తాను. దయచేసి తెలుపండి.

మీ సంపత్.

క్లుప్తంగావున్న యీ వుత్తరం వసంతలో సంచలనం రేపింది.

ఇతని నిర్బంధన చాలా విచిత్రంగా వుంది.

అసలీ సమస్యా పరిష్కార మెలా జరుగుతుంది?

ఆలోచనలోవున్న వసంత....

"అలా దిగులుగా వున్నా వేం వసంతా? ఏదైనా విచారకరమైన విషయమా" అన్నరేఖ ప్రశ్నతో యీ లోకంలోకి వచ్చింది.

"ఏం లేదు రేఖా! చెప్పుకునే పరిస్థితి కాదునాది. మరొకరు నా పరిస్థితిలో వుంటే ఎగిరి గంతేస్తారేమో" అంటూ వెళ్ళిపోయింది. ఎంత ఆలోచించినా మనస్సమాత్రం జవాబు వ్రాయడానికి వొప్పుకోవటంలేదు.

"ముక్కు మొహం తెలియని వ్యక్తితో పరిచయం పెంచుకోడంలో

"అర్థంలేదు" అని మనస్సు నొక్కి చెప్పింది యీ సారికూడా జవాబు వ్రాసే ప్రయత్నం చెయ్యలేదు.

మనస్సులో భారంగా వుంది.

# 5

మరునటిరోజు తనకోసం యెవరో వచ్చి రిసెప్షన్ రూములో ఎదురు చూస్తున్నారని ప్యూను చెప్పాడు వసంతకి. బాస్ పర్మిషను తీసుకొని అటు వైపు నడిచింది. ద్వారం దగ్గరకించి చూస్తుండగానే-

కలలో ఆనాడు కనపడ్డ వ్యక్తి- అని చెప్పి మెదడు తన పని పూర్తి చేసుకుంది.

ట్రిమ్‌గా వున్నాడు. కాని ముఖం చిన్నబోయింది.

క్రాపుచెదిరి నొక్కులజుత్తు నుదుటి మీద పడింది.

చూపులు కొద్దిగా తీక్షణంగా వున్నాయి.

అసలతను తనకోసం రాలేదేమో అనుకొని వెనుతిరిగినంతలో....

"మిస్ వసంతా! మనిషితో మాట్లాడితేనే మీ పవిత్రత భంగపడుతుందా!" కొంచెం తీవ్ర స్థాయిలో వచ్చిన ఆ మాటకి వసంత ఉలిక్కిపడి చూసింది.

"నా లెటర్స్ అందలేదా? లేక అందినా జవాబు వ్రాయ దల్చుకోలేదా" అదే శృతిలో వచ్చినమాట వసంతకి చికాకు కల్గించింది.

"అయితే మీరా అవి వ్రాసింది!" కాస్త నిర్లక్ష్యంగా అనుమానంగా అడిగింది

"ఏం-నేనంత సాహసిస్తా ననుకోలేదా? చిరునవ్వుతో అడిగాడు.

"నేనేకాదు ఎవ్వరూ అనుకోరు. ఒకటి రెండుసార్లు కలలో చూసినంతమాత్రాన ఉత్తర ప్రత్యుత్తరాలు యెలా జరుగుతాయి. అందులో మీపేరు సంపత్ అని నాకెలా తెలుస్తుంది. పైగా నన్ను అదమాయిస్తున్నారు-" అని రోషం, కోపం మిళితంచేసి అంది.

"అవును నాదే పొరపాటు. నా పేరేది అని తెలుపలేదు. కాని అసలు యిలాంటి విషయాలపై ఏమాత్రం శ్రద్ధవున్న వారైనా జవాబు వ్రాస్తూ మీ ఫోటో పంపండి అనైనా అంటారు" అంటూ వెంట

"పోనీ మనిషిని చూశాకైనా పరిచయం పెంపొందిస్తారా లేక దానికి కూడా అభ్యంతరమేనా?"

"నా పరిచయంవల్ల మీ కొచ్చే ప్రయోజన మేమిటి? నేనేమీ రచయిత్రిని, నర్తకిని, సినిమా స్టార్‌ని కానే! నన్నెందుకిలా అల్లరిపెడుతున్నారు" అంది కాస్త సక్రోషంగా.

"లేదు వసంతా! మీరు నన్నపార్థం చేసుకుంటున్నారు. నేను బాలా ఆలోచించిన మీదటే యీ నిర్ణయాని

కొచ్చాను. కారణం మరొకటికాదు. భగవంతుని పై ప్రమాణం చేస్తున్నాను.

"అయితే యిక మీదట యిలా ఆఫీసుకి రాకండి. నా అభిప్రాయం మీకు తెలియ బరుస్తాను. మీరు వెళ్ళండి" అంది.

"చిన్నమాట! నా ఎడ్రసు పాతది కాదు. నే డెప్యుటేషన్ మీద బెంగుళూరు వెళ్తున్నాను. ఒక సంవత్సరం పాటు అక్కడ వుండాల్సొస్తుంది. కనక అక్కడికి వ్రాయండి" అంటూ తన ఎడ్రసిచ్చి వెళ్ళిపోయాడు.

ఆలోచనలతో సతమతమౌతూ యింటికి చేరింది వసంత.

# 6

ఇంటికి రాగానే నాన్న, అమ్మల సంభాషణ సన్నగా వినిపిస్తోంది.

"పిల్లవాడు లక్షణమైన వాడేనట. మా అన్నయ్య వ్రాశాడు. కట్నాలపై కాస్త ఆశ వున్నట్లు తెలుస్తోంది. అది తేల్చుకుని మంచి ముహూర్తం పెట్టుకో వచ్చుట. వాళ్ళు కూడా వివాహానికి తొందరపడుతున్నట్లున్నారు" అంటున్నారు నాన్న.

"మనకందువల్లో ఎంతో బాగుణ్ణు" దిగులుగా అంది అమ్మ.

చూచే వాళ్ళకి మనకొక్కర్తే ఆడపిల్ల అన్న విషయం చెప్పితే మన ఆర్థిక స్థితి ఏమౌతుంది కాం? అది సుబ్బారావు మనకి [illegible]సించేముంది. పదివేలంటకైతే అప్పయినా చేసి యిద్దాము. ఇక ఆ పైన అంటే నానుస్తున్న నాన్న మాటలు వింటూ వసంత బిత్తరపోయింది. "పదివేలా" అని.

"పిల్లని చూస్తే మనసు మార్చుకుంటాడేమో" అమ్మ ఆశకి నవ్వొచ్చింది.

మరునాడు మధ్యాహ్నం సంపత్‌కిచ్చినమాట నిలబెట్టుకునేందుకు అనుకుని ఉత్తరం మొదలుపెట్టింది.

శ్రీ సంపత్ గారికి —

నాతో పరిచయం పెంచుకోవడంలో యే ప్రత్యేకతా లేదని మరోసారి చెప్తున్నాను. మనసా ప్రదానం సంగతి మీకు తెలిసిందే. చదువుకున్నంత మాత్రాన యిలాంటి విషయంలో ముందడుగు వేయాలనే నిబంధనలేదు. అందులో నాలాంటి టిమిడ్ క్రీచర్ ఆ పని చెయ్యలేదు. నే ఎల్లకాలం యిలానే ఉండిపోతా.

నా భవిష్యత్తు నిర్ణయమై పోయాక యిలాంటి జాబులేమైనా కలతలు రేపితే దానికి నేను బలైపోతాను. కనుక దయచేసి నాపై మీ అభిప్రాయం మార్చుకోండి.

[illegible]ని మళ్ళీ పరీక్షించి [illegible] పంపింది.

భారం సగం తగ్గిపోయినట్లు భావించింది.

కానీ మరో రెండు రోజులకే బెంగుళూరు ముద్రతో జాబు వచ్చింది.

డియర్ వసంతా!

నన్నెంత మోసకారిగా జమకట్టారు! నేను మీ దారికి అడ్డువస్తానా? అందుకో మీరెంచి ఇచ్చిన అమూల్యమైన జాబులు దాచుకుంటానే కాని బయటపెట్టను. నా కలాంటి తక్కువ ఆలోచనలు రావు.

భగవంతుడు నన్నన్ని విధాలా చల్లగా చూశాడు. మా అమ్మ దేవత. మా తండ్రి స్వర్గస్తులైనారు. మా అక్క వివాహిత. నా మాటకి మా యింట గౌరవమే కాని ఎదురులేదు. మీకభ్యంతరం లేకపోతే మన జీవితం ఆనందమౌతుంది. జవాబు కొరకు నిరీక్షిస్తూ వుంటాను.

మీ సంపత్.

వసంతకి భయం వేసింది. ఇదేమిటి ఇలా పరిణమించింది? నాన్నగారికెలా సమాధానమియ్యాలి?

అంతకి చదువుమీద ఎంత అపనమ్మకం కలుగుతుంది. "పెద్దలు నా శ్రేయస్సుకోరి ఏ పనిచేసినా బాగుంటుంది కాని నాకు నేనుగా ధైర్యం చేయలేను" అనుకొని అదే వ్రాసింది.

మిస్టర్ సంపత్,

పెద్దలు నిర్ణయించిన దానికి తలవొంచడమే తప్ప నాకింకే ధైర్యమూ లేదు. మీ ఆలోచనలు యిక నాపైకి రానివ్వకండి. మీరెంత వున్నతులైనా నాలాటివాని ఎరగా తీసుకోవడం మంచిదికాదు.

క్షమించండి,

వసంత.

పరిస్థితి ఎటు జారుతోందో తెలియడంలేదు వసంతకి. వద్దనుకుంటూనే రెండుత్తరాలు వ్రాసింది. ఇలా భయపడుతుండగా

నాన్నగారు చల్లగా అసలు కబురు చెప్పారు.

పెళ్ళిచూపుల యేర్పాటు గురించి.

# 7

ఆరోజు వసంత సెలవు పెట్టింది

పెళ్ళిచూపులేర్పాటయ్యాయి.

"రా! వసంతా! కూర్చో" అన్నారు నాన్నగారు.

తలవంచుకొని వచ్చి కూర్చుంది.

వాళ్ళడిగిన ప్రశ్నలకి సమాధానమిచ్చింది,

లోపలికి వచ్చేముందు వరుణ్ణి చూసింది.

మనస్సు సమాధాన పరుచుకొని వచ్చేసింది.

తరువాత తాంబూలాలు పుచ్చుకుంటామని ఏ విషయం వ్రాస్తామని అన్నారు పెళ్ళివారు.

"వసంత అదృష్టవంతురాలు" అన్నారు ఇరుగుపొరుగు.

మర్నాడు వసంత ఆఫీసు కెళ్ళగానే ఒక కవరు తనకోసం యెదురు చూస్తోంది. విప్పి చూసింది.

డియర్ వసంతా!

ఎంత కుశలంగా ముగించావు నీ ఉత్తరాన్ని. నిన్నేమి తప్పు చెయ్యమన లేదే? ఎందుకలా అపార్థం చేసుకున్నావు? నీ అభిప్రాయం తెలుసుకొని మీ పెద్దలతో సంప్రదిద్దామను కున్నాను.

మగవాడు- అడిగి చేసుకోవడమేమిటి అన్న భావం నాకు లేదు. నాకు కావలసింది నువ్వు.

ఇక్కడి వాతావరణ మెంత ఆహ్లాదకరంగా వుందంటే నువ్వు ప్రక్కనుంటే స్వర్గంలో విహరించే వాళ్ళమేమో!!

జవాబు వ్రాయి.

నీ సంపత్.

ఏకవచన ప్రయోగం అతనిలోని ఆశను తెలుపుతోంది.

పరిస్థితి విషమించక ముందే తన విషయం తెలపాలి.

ఆశ నిచ్చెనెక్కించి తోసేయడం ఎందుకు?

మొదట్లోనే యీ ఆశా లతని త్రుంచివేయాలి.

ఇలా నిశ్చయించుకుని లెటర్ పాడ్ తీసుకుంది చేతిలోకి.

మిష్టర్ సంపత్,

మిమ్మల్ని నిరాశపరుస్తున్నందుకు మన్నించాలి. నా వివాహం నిర్ణయమై పోయింది. వచ్చే నెలలో జరిగి పోవచ్చు. శుభలేఖ పంపుతాను తప్పక రండి. మీ ఆశీస్సు లందుకోవాలని కోరుతూ

వసంత.

వసంత మనస్సు బాధపడింది.

దీన వదనంతో వున్న అతనిని వూహించలేకపోయింది. కాని తను అశక్తురాలు. అలా అని మనస్సు సరిపెట్టుకుంది.

ప్రక్కనే వున్న నిర్మల, విమల, రేఖా ఒక్కసారి ఫక్కుమన్నారు.

"ఎన్నాళ్ళు దాస్తావోయ్" విమల అంది.

"పెళ్ళి రహస్యంగా చేసుకుంటే వూరుకోము-" యిది నిర్మల మాట.

"అసలు సంగతి చెప్పు!" అంది రేఖ.

"మీకు నా పరిస్థితి అర్థం కాదులే. అయినా మీరు లేందే నా పెళ్ళి జరగదులే" అని హామీ యిస్తూ నవ్వింది.

కాని ఆ నవ్వు పేలవంగా వుండడం వాళ్ళు గమనించారు.




# 8

పదివేల కట్నంతో పెళ్ళి నిశ్చయమైంది. ముహూర్తం నిర్ణయించడంతో పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అనారోగ్యంగావున్న అమ్మ ఓపికతెచ్చుకొని పన్లు చేస్తోంది.

తమ్ముళ్ళ పరీక్షలై పోయాయి కనుక వాళ్ళూ గంతులేస్తున్నారు.

నాన్నగారు హడావిడిపడుతున్నారు.

బడలికంతా మొహంమీదే కనిపిస్తోంది.

ఆందోళనా పూరితమైన ఆ చూపులలోకూడా యేదో తృప్తి ద్యోతకమవుతోంది.

అన్నీ చూస్తూ వసంత నిట్టూర్చింది.

తన కిష్టంలేని పనులెన్ని జరిగినా సహిస్తోంది. ముఖ్యంగా కట్నం విషయం.

పదివేల కట్నం అడగడం యెంత అమానుషత్వం, అదికాక పెళ్ళి ఖర్చు.

స్నేహం పేరిట యెంత అన్యాయం చేస్తున్నారు.

స్నేహం బలపడడానికి డబ్బు కావాలా ? అని మామగార్ని అడిగే ధైర్యం తనకెందుకు లేదు

అయినా వరుడెలా వూరుకున్నాడు?

అతని ఆశయాలు అలాంటివేనా?

అదే నిజమైతే తనేం సుఖపడ గలదు.

నాన్న ఒప్పుకోకుండా ఉండ వలసింది.

తననింత ప్రేమించిన సంపత్‌ని నిరాకరించి, తల్లిదండ్రుల నవ్వుల పాలుచేస్తే తనకేం లాభం ?

వాళ్ళ ఉసురు ఎప్పటికైనా తనకి తగుల్తుందేమో ? ఇలాంటి ఆలోచనల మధ్య-

"సమీపించే రోజులలో తను శ్రీమతి కాబోతోంది" అన్న వచ్చి నిజం నిలబడింది.

ఇంతలో పోష్టుమాన్ కవరొకటి లోపలికి విసిరి వెళ్ళిపోయాడు. తీసి జాగ్రత్త చేద్దామని వెళ్ళి తనపేరుతే ఉండడం చూసి తెరిచింది.

వసంతా !

ఎంతటి శుభవార్త నా కందజేశావు ? నిన్ను వధువుగా వూహించి ఆ ఆనందం దాచుకోలేకపోతున్నాను. ఇంతటి అదృష్టవంతుడెవరు ?

నీ పరిచయం చిరకాలం నా మదిలో మధురస్మృతిగా నిలిచిపోతుంది.

నీ వంటి యువతులు సహజంగా భయం కలిగివుంటారు. దానితోపాటు యువకులు మోసగించటం చూస్తూనే వున్నాము. మన సంప్రదాయానికి ఎదురు తిరిగే వారికి సంఘంలో నిజంగానే సానుభూతిలేదు.

కాని, అందరినీ మీరు మోసకులుగా జమకట్ట కూడదు.

బహుశః యిదే నా చివరి జాబు కావచ్చు. మీ శుభలేఖ అందిన వెంటనే సెలవుపెట్టి వస్తాను.

ఆశీస్సులతో

సంపత్.

రెండు కన్నీటిచుక్కలు వుత్తరం మీద రాలాయి. అంతటి మహోన్నతుని ప్రేమను తిరస్కరించిన తన జీవితం యెలా సాగుతుందో ?

సదా అతనికి శుభం కలగజేయమని భగవంతుని మనసారా ప్రార్థించింది.

ఇంతలో నాన్నగారు అమ్మతో మాట్లాడడం వినిపించింది.

"భగవంతుడు యేం వ్రాసిపెట్టాడో కాంతం ! ఎంత తిరిగినా డబ్బు సర్దుబాటు కావడంలేదు. పెద్దవారితో మాట. అది నిలవకపోతే ప్రమాదం. ఏం చెయ్యను ?"

"ఆయన మీకు తెలిసినవారే కదా ! అందులో మీ అన్నయ్యనుకూడా కాస్త చెప్పమనండి, కాస్త ముందు వెనకైనా - ఎలాగైనా సర్దుతామని -"

"డబ్బు విషయంలో స్వంతవారే గట్టిగా ఉంటారే ఇక పరాయివాళ్ళు రాజీపడతారా ? ...." నిస్పృహగా అంటున్న నాన్న మాటలు ఆ పైన

వినిపించలేమన్నసంతకి, దుఃఖంతో నిండిపోయింది మనస్సు.

# 9

పెళ్ళి వాయిద్యాలు సన్నగా మ్రోగుతున్నాయి.

గౌరీపూజ చేస్తున్న వసంతని పెళ్ళి పీటలమీదకి తీసుకువచ్చారు.

పురోహితుడు గ్రుక్క తిప్పుకోకుండా మంత్రాలు చదువుతున్నాడు.

ముహూర్తం దాటిపోతుందనేమో.

స్నేహితులు హాస్యం మొదలు పెట్టారు.

"నూ! భలే చాన్సు కొట్టేశావే! అందమైన మొగుడే వచ్చాడేవ్! మమ్మల్ని పరిచయం చెయ్యవే. మేమేమి యెతుకు పోములే. హనీమూన్ ఎక్కడికి వేసుకున్నారే?" వారి మాటల కంతరాయం కలిగిస్తూ

రాఘవేంద్రరావుగారి పెద్ద కేకలు వినిపించాయి.

"బాగుంది వరస! ముష్టి ఐదువేలు చేతిలోపెట్టి పెళ్ళి కానిమ్మనడానికి సిగ్గులేదటయ్యా? ఇప్పుడే యివ్వలేని వాళ్లు తరవాతిస్తారని నమ్మకమేమిటి? అయినా తాహతులేని వారు యింత వరకూ యెందుకు రానిచ్చారు? నాదే బుద్ధి తక్కువ. అసలు కయ్యానికీ వియ్యానికి సమఉజ్జీ వుంటాలండారు. ఆ సంగతి నేనెందుకో విస్మరించాను. రేపటినించి అప్పుల వాళ్ళని తిప్పించుకున్నట్లు తిప్పించుకునే వాడివి యింకా నయం" అంటూ కొడుకువేపు చూసి

"లేవరా! ఇంకా కూర్చున్నావేం. స్నేహితం పేరుతో మంచి మోసం చేసారు" అన్నారు.

గంగిరెద్దులా వరుడులేచి వెళ్ళబోతుండగా!

నాన్నగారు కన్నీళ్ళతో.

"బావగారూ! సమయానికి పైకం అందలేదు. వివాహమైన వెంటనే యిచ్చేస్తాను. అందరి ముందు యింత అవమానం జరిగిన మీదట నా బిడ్డ జీవితాంతం కన్యగా వుండి పోతుంది. దాని మొహం చూసైనా యీ శుభ కార్యం జరపండి. తలతాకట్టు పెట్టయినా మీ సొమ్ము చెల్లిస్తాను" అతనిది అరణ్యరోదనమే అయింది.

"అన్నయ్యా!" అని ప్రాధేయపూర్వకంగా అన్నగారివైపు చూసి "నువ్వుకాస్త చెప్పరా" అన్నారు.

"తప్పు మనలో వుంచుకొని ఆయన నడగమంటావేం? డబ్బు చేతిలో లేనిదే ముహూర్త మెందుకు పెట్టావు?" తననే గదమాయిస్తున్న అన్నగారిని, వెళ్ళిపోతున్న పెళ్ళి బృందాన్నిచూస్తే ఆయనకి నోటమాట రాలేదు.

పరిస్థితి అర్థమైన బంధువులంతా తలోక మాటా విసురుతున్నారు.

"మీకభ్యంతరం లేకపోతే యిదే ముహూర్తానికి పెళ్ళి జరిపించవచ్చు." నిలువుబొట్టు మనిషిమాట విని వసంత నాన్నగారు ఆతనివైపు చూశారు.

"ఇంకా నాకు ఆశ కలిపిస్తావేం నాయనా! మా వంశ గౌరవం మంట గలిసింది." "ఆవేదనగా అంటున్న ఆయన మాటలకు

"నేనామెను వివాహం చేసుకుంటాను. సాంప్రదాయంలో మీకేమీ తీసిపోను" అంటూ తన గురించంతా చెప్పుకున్నాడు.

"ఇది నిజమా ?" అని చూస్తున్న ఆయన

"అయితే కానియ్యి బాబు! ముహూర్తం వేళ మించిపోతోంది" అంటున్న పురోహితుని మాటలతో చలనంవచ్చిలేచారు! వసంత పూర్తిగా అయోమయంలో పడిపోయింది.

ముందుని వరుడు లేచిపోవడంతో

మతి కోల్పోయింది. అంతలో యిత నెవరో తనని చేసుకుంటానంటు న్నాడు అని ఆలోచిస్తున్న తనతో...

"వసూ! బస్సులో నిన్ను చూసిన తనే" అంటున్న వనజ మాటలతో యీ లోకంలోకి వచ్చింది.

ఎదురుగా సంపత్

మంత్రాలహోరులో సంపత్ తనకి కట్టిన రెండు క్రొత్త సూత్రాలపై వసంత వద్దనుకున్నా రెండు కన్నీటి చుక్కలు రాలాయి.

"తప్పమ్మా! ఇంతటి మహోన్న తుని అర్ధాంగివైన నీకు కన్నీరెందుకు? ఇంత సహృదయం అందరికీ వుంటే అసలు దుఃఖమే వుండదేమో యీ ప్రపంచంలో" పురోహితుడన్నాడు.

"నాదేముందండి! అంతా ఆ పర మాత్ముని లీల అంటూ అర్ధాంగంగా వసంతవైపు చూశాడు. వసంత నిజంగా సిగ్గుల రాణైంది.

ఇక ఆ రాత్రి

# 10

వసంత ఆలోచనలతో సతమత మౌలోంది.

గృహిణి కాబోతున్న ప్రతి స్త్రీకి యిన్ని ఆలోచనలుంటాయా? తలలో జాజుల సౌరభం, గదిలో అగరొత్తుల గుబాళింపు, కిటికీలోంచొస్తున్న పిల్ల వాయువు వొకదానితో వొకటి పెన వేసుకుపోతున్నాయి.

కిటికీదగ్గ నిలబడ్డ ఆమె చూపు, దూరాన ధూమ్యాకాశాలు యేకమవు తున్నచోట నిలిచింది.

ఇంటిలో క్రొత్త రకమైన వాసన వసంతనాసిక పసికట్ట గలిగింది.

అది సంపత్ కొత్తలేడీకి వ్రాసిన సెంటు అత్తరుల వాసనల సమ్మేళనం.

కోటి కోయిలలు వసంత మన స్సులో కూ అని కూశాయి, సంపత్ స్పర్శతో క్రొత్త ప్రపంచంలోకి వెళ్ళిన వసంత మనస్సుని, ఆమె ఆత్మ "ఛీ! యింత వుద్రేక మేమిటి" అ కసిరింది. నీకేం తెలుసు నా సంపత్ ఔన్నత్యం" అని తన పనిని సమర్ధించు కుంది వసంత మనస్సు.

"ఏమిటి వసూ! ఆలోచన. ఉత్త రాలలో కూడ నన్నామడ దూర లో నిలబెట్టావు. దగ్గరయ్యాక మౌనంతో కడుపు నింపుతావా?"

అతని మాటలకు పులిక్కిపడింది.

---

★ అయితే మేరీ నిన్ను పెళ్ళి చేసుకోనందా? మీ ధనవంతుడైన మావయ్య గురించి చెప్పలేక పోయావా?

చెప్పాను. అందుకే ఇప్పుడు ఆమె నాకు "అత్తయ్య" అయింది.

"కాదు ఏం మాట్లాడాలో తెలియడంలేదు. నా జీవితం ... యిలాంటి మలుపు తిరుగుతుందనుకోలేదు...." ఇక సాగలేదుమాట. ఆ తడబాటును నిగ్రహించుకోలేక ఆగిపోయింది ..

అతని ముఖంలోకి చూస్తే తన కన్నీళ్ళు బయట పడ్తాయని తల వంచేసింది.

ఎదుటి వ్యక్తి తెలిసి తక్కువ వాడనుకోవడం పొరపాటు.

అతనాగ్రహించలేనిది ?

"ఎందుకీ కన్నీరు ? కథ సుఖాంతమేగా ! భగవంతుడు మంచివాళ్ళకి అన్యాయం చెయ్యడని తెలీదూ. ఇంత సున్నితమైన మనస్సుని అర్థం చేసుకునే జ్ఞానం నాకు ప్రసాదించిన దైవం నిన్ను నాకు దూరం చేస్తాడని నేననుకోలేను. నీ భయం నువ్వు వ్యక్తం చేసినా నేను భయపడలేదు. నాకు నాలో నమ్మక మున్నంత అనవసరపు టాలోచనలను రానీయను." దృఢంగా మాట్లాడుతున్న అతనివైపు అభిమానంగా చూసింది,

అంతలో కోపంగా

"అసలీ బుద్ధులేమిటీ అంట ;" ఆడపిల్లను చాటుగా పరిశీలించటం, స్టయిలుగా నవ్వడం, లెటర్సు రాయడం. ఆపైన ఆదర్శమంటూ అందరి అభిమానం చూరగొనడానికి చేసినట్లు నటించి తన స్వార్థం చూసుకొని వివాహం చేసుకోవడం ఏమిటీ అంట!" ఎంత కోపం నటిద్దామన్నా తెలిసిపోతోంది.

"రాణీగారి అలక మా కలవాటే. నే నివేవీ చెయ్యకపోతే తెలుసుకొచ్చేది అమ్మాయిగారి పని." భయంగా చూసిన వసంతని చేతుల్లోకి తీసుకున్నాడు. వారి ప్రథమ సమాగమం మధుర స్మృతిగా మిగిలిపోయింది,

•••

# ఎవరివీ వాక్యాలు

("ఈ వాక్యం ఎవరు వ్రాసి వుంటారు?" అని అడిగితే "ఫలానా" అని పాఠకులు ఠక్కున చెప్పగలరు. కొంతమంది రచయితల విషయంలో ఆ కోవకు చెందిన "జ్యోతి" పాఠకులకు పరిచితుడయిన, పాఠకులు చేసుకున్న "పాపం" వలన సెల్యూలాయిడ్ "కబళించిన" ఒక రచయిత రచనలనుండి సేకరించిన ఈ వాక్యాలు ఎవరివో చెప్పండి.)

జరిగితే జ్వరం అంత సుఖంలేదు,

దొరికితే అప్పులాంటి మంచి వస్తువులేదు.

అస్తమానం అబద్ధం చెప్పేవాడు ఒకటి రెండుసార్లు నిజం చెప్పినా ఎవరూ అది నిజమని నమ్మరు. వాడు కాకి నల్లగా వుందంటే, వాడి మాటతో పాటు కాకినీ, దాని నలుపునూ, తెలుగు భాషనూ కూడా శంకిస్తారు.

దేశంలో లంచగొండితనం వంటి అవినీతి పనులన్నీ ఇవి నీతి పనులన్న జాబితాలకి ఎగప్రాకి పోయాయి.

నిజంమీద అబద్ధం పరిస్తే కల్పన, దైన్యంమీద హేళన ఒప్పితే హైన్యం, విషాదం మీద చిరునవ్వు తెరవేస్తే కరుణ.

ఎలక్షన్లలో లక్ష చెప్తారు. కాని చెప్పినవన్నీ చెయ్యడం తెలివితక్కువతనమే. ఏ పనీ చెయ్యకుండా పదవిలో ఉండడమే సమర్థుడి లక్షణం.

రాళ్ళు రప్పలు తిని హరాయించుకోగల రోజున మరమరాలు కూడా దొరకవు, తీరా వజ్రాలు వైడూర్యాలు పోగేసుకున్నాక మరమరాలు కూడా అరగవు.

జీవితం ఆక్సిడైజ్ కావడానికి ఇంధనమైన ధనం మహాత్మ్యాన్ని తెలిపే ఉద్గ్రంథం చెక్కు బుక్కు.

—సేకరణ: తాజీ ప్రసాద్.




సాయంత్రం ఐదు గంటలవుతోంది. రోజల్లా దహించిన ఎండ అప్పుడే క్రమంగా చల్లబడుతోంది. సంధ్యా సమయం దగ్గరవుతున్నకొద్దీ, అప్పటి దాకా నిప్పులు చెరిగిన సూర్యుడు హీరో చేతుల్లో దెబ్బలు తిన్న విలన్‌లా పాలి పోతున్నాడు. దూదిపింజల్లా మబ్బులు ఆకాశంలో తేలియాడుతున్నాయి.

అప్పారావు అప్పుడే పంపుక్రింద చన్నీళ్ళ స్నానం ముగించుకొని గది లోనికొచ్చాడు. తర్వాత పెట్టెలోంచి ఇస్త్రీచేసినమల్లెపువ్వులాంటి ప్యాంటూ, షర్టూ వేసుకుని "టినోపాల్ మ్యాన్" గా తయారయి వచ్చాడు. అద్దంముందు నిలబడి తనను తానే చూసుకొని మురిసి పోతున్న అప్పారావు చేతిలోని

మువ్వెన్న వంకీజుత్తుపై వింతగా నాట్యం చేస్తోంది.

ముచ్చటగా నిండు పాతికేళ్ళ ప్రాయంలోవున్న అప్పారావు కింకా పెళ్ళికాలేదు. ఉద్యోగ రీత్యా హైదరాబాదులో ఉంటున్నాడు. సంపాదించే జీతం రాళ్ళు ఎక్కువే. అయినా, డబ్బంటే సంచప్రాణాలు అప్పారావుకి. అందుకే సిటీలోని మారుమూల ప్రాంతంలో ఒక చిన్న గదిని అద్దెకి తీసుకొని ఎలాగో నెట్టుకొస్తున్నాడు. గది చీకటి గుహలా వున్నా అద్దె తక్కువేగదా అన్న అభిప్రాయంతో ఆ గదినే అంటిపెట్టుక్కూర్చున్నాడు. పేరుకి అప్పారావే అయినా అప్పులు యివ్వడమన్నా, పుచ్చుకోవటమన్నా పరమ రోత అతగాడికి. అందుకే మహామహా అప్పుల్రావులుకూడ అతన్ని డబ్బడగటానికి జంకుతారు. డబ్బు విషయంలో యింత పొదుపరి అయినా అప్పారావుకి సినిమా పిచ్చి అనేది కాస్త ఎక్కువనే చెప్పాలి. నెలకి రెండు మూడు సినిమాలయినా విధిగా చూస్తాడతను. అదీ తనొక్కడే వెళ్తాడు.

తల దువ్వుకుని అప్పారావు చేతికి వాచీ కట్టుకున్నాడు. అక్కడే టేబులుపై పడివున్న దినపత్రికను చేతిలో తీసుకుని ఎక్కడెక్కడ ఏయే సినిమాలాడుతున్నాయో శ్రద్ధగా చూసాడు. సడన్‌గా అతనిదృష్టి వారం రోజుల క్రితమే విడుదలయిన ఒక తెలుగు సినిమా అడ్వర్టయిజ్‌మెంటుపై పడింది. కొంతసేపు కళ్ళు పొడుచుకుని చూసిన తర్వాత ఆ సినిమాకే వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. ఆట 6 గంటలకే ప్రారంభం అని పేపర్లో రాసివుంది. అప్పారావు వాచీ చూసుకున్నాడు. గడియారం ఐదు గంటల ఇరవై నిమిషాలని చూపుతోంది. సినిమాకి వెళ్ళువు తొందరన్న ఆత్రంలో పర్సు జేబులో వేసుకుని అదరాబాదరాగా గదికి తాళం వేసి త్వరత్వరగా నడక ప్రారంభించాడు.

అప్పారావు యింటి ంచి బస్‌స్టాప్ కొంచెం దూరమనే చెప్పాలి. బస్సు స్టాపుదాకా నడిచివెళ్ళి త్వరగా బస్సెక్కవచ్చు లెమ్మనుకున్నాడు. త్వరత్వరగా నడచి బస్‌స్టాప్‌ను చేరుకున్నాడు. ఇంతలో బస్సు వచ్చింది. కాని నల్లిదూరేంత స్థలంటూ లేకుండా ప్రయాణీకులు నిండివుండటంతో కండక్టరు బస్ నిలుపకుండా బెల్ కొట్టేశాడు. అప్పారావుకి కండక్టరు పీక నులిపేద్దామా అన్నంతకోపం వచ్చింది. "వీడిసిగదరగ! బస్సు నిలిపితే వీడి సొమ్మేంపోయింది?" అనుకున్నాడు కసిగా. పోనీ తనకయినా రన్నింగ్ బస్సెక్కటం చేత కానందుకు తనను తాను తిట్టుకున్నాడు.

విసుక్కుంటూ ప్రక్కనే ఉన్న కిళ్ళీ దుకాణం వైపు దారి తీసాడప్పారావు. ఐదు రూపాయల నోటిచ్చి చార్మినార్ సిగరెట్ ప్యాకెటు ఒకటి,

అగ్గిపెట్టె ఒకటీ కొన్నాడు. అంగడి వాడు తిరిగిచ్చిన డబ్బును తీసుకుని లెక్కపెట్టుకుంటూండగా ఇంకో బస్సు వచ్చింది. ఆ బస్సయినా ఆగకుండా పోతుందేమోనని త్వరగా డబ్బును లెక్క చూసుకోకుండా జేబులో వేసుకుని పరిగెడుతూ బస్సుస్టాపు దగ్గరకొచ్చాడు. కానీ ఆ బస్ కూడా ఆగకుండా వెళ్ళిపోవడంతో అప్పారావుకి చెప్పలేనంత కోపం వచ్చింది. విసుగ్గా వాచీ చూసుకున్నాడు. వాచీలో గడియారం ముల్లు ఐదు గంటల నలభయి నిమిషాలని వెక్కిరిస్తున్నట్టనిపించిందతనికి. అప్పారావుకి ఒళ్ళు మీద ఉన్నట్టుంది. అప్పారావుకి క్షణక్షణానికీ అసహనం పెరిగిపోతోంది. ఇవ్వాళెలాగయినా సినిమా చూడాలనుకున్నాడు. ఇంత దూరం వచ్చి తిరిగి యింటికెళ్ళడానికి మనస్సొప్పలేదు. కొంతమంది రిక్షావారిని పిలిచి చూశాడు. కాని వారంతా విపరీతంగా ధర చెప్పడంతో రిక్షాలో పోయే ప్రసక్తి విరమించుకున్నాడు.

ఇంతలో "రిక్షా కావాలా? బాబూ!" అని గొంతొకటి వినిపించింది. అప్పారావు తలెత్తి చూశాడు. గుంటలుపడ్డ కళ్ళతో ముసలాడొకడు తనవైపే ఆశతో చూస్తున్నాడు. వాడి జుత్తంతా పండినట్టు బాగా నెరిసి పోయింది. ముసలితనంవల్ల ముడతలుపడ్డ చర్మం విచిత్రంగా మడతలు పడ్డ బట్టలా కట్టెపుల్లలాంటి శరీరాన్ని కప్పుకుని వ్రేలాడుతోంది. అస్థిపంజరంలా ఉన్న ఆతని శరీరంలో ఎముకలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

"ఎక్కడికి వెళ్ళాలి? బాబూ!" మళ్ళీ ముసలాడే అడిగాడు.

అప్పారావు వెళ్ళాల్సిన థియేటర్ పేరుచెప్పి ఎంత తీసుకుంటావని అడిగాడు.

"పదణాలు యిప్పించండి" రిక్షావాడు ధర చెప్పాడు.

"ఆరణాలిస్తాను. వస్తేరా" అప్పారావుకి పదణాలిచ్చి రిక్షాలో వెళ్ళడం యిష్టంలేదు.

"పోనీ ఎనిమిదణాలు యిప్పించండి, వస్తాను. అంతకంటే తక్కువ లేదు" అన్నాడు రిక్షావాడు వెళ్ళిపోబోతూ.

ఆ ధర సమ్మతం కానట్టు [illegible]లూ పాడు అప్పారావు. ఇంతలో బస్సు రాకపోతుందా? అనుకొని బస్సుకోసం ఎదురు చూడసాగాడు కాని అనుకున్న ప్రకారం బస్సు వచ్చే సూచనలేవీ కనిపించలేదు. అటు సినిమాకికూడ వేళయిపోతోంది. ఇంకా పదినిమిషాలే ఉంది. బస్సుపై ఆశ వదులుకున్న

---

"మీ ఆవిడ చాలా పొదుపరి అని విన్నాను?"

దా: (అవును) నిన్న తన నలభై య్యోవ పుట్టిన రోజు పండుగకి 28 వత్తులు మాత్రమే పెట్టింది.

అప్పారావు అయిష్టంగానే వెళ్ళిపోబో తున్న రిక్షా వాడిని వెనక్కి పిలిచాడు. అప్పారావు కేక విని ముసలి వాడు రిక్షాని వెనక్కి త్రిప్పుకొని వచ్చాడు.

సరే. నీ ప్రమాణమే ఎనిమిదణా లకు పద" అన్నాడు అప్పారావు రిక్షాలో ఎక్కి కూర్చుంటూ, "కానీ త్వరగా వెళ్ళాలి తెలిసిందా ?" అని ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో.

"అల్లాగే బాబూ !" అంటూ రిక్షా వాడు త్వరగా త్రొక్కడం ప్రారంభించాడు.

"ఆలస్యమైపోతోంది. ఇప్పటికే బుకింగ్ అయిపోయుండేమో" అను కున్నాడు అప్పారావు. చార్మినార్ సిగ రెట్ ఒకటి అంటించి తీరిగ్గా పొగల్ని రింగులు రింగులుగా వదులుతూ ఆలో చించసాగాడు. "వీడే నయం. మిగతా రిక్షా వాళ్ళ కంటె కన్న యెక్కువ అడి గాడు" అనుకున్నాడు మనసులో.

ఇంతలో థియేటర్ దగ్గిర రిక్షా నిల చింది. అప్పారావు రిక్షాలోంచి దిగి జేబులోంచి ఒక అర్థరూపాయితీసి రిక్షా వాడికిచ్చాడు. థియేటర్లోకి వెళ్ళ బోయిన వాడల్లా "ఈ అర్థరూపాయి చెల్లదు బాబూ !" అన్న రిక్షావాడి పిలు పుకి వెనుదిరిగి చూశాడు. అప్పారావు అర్ధరూపాయిని చేతిలో తీసుకొని చూశాడు. నిజమే ! అది ఒక వైపు పూర్తిగా అరిగిపోయి వుంది.

అప్పారావుకి చెప్పలేనంత ఆశ్చర్యం, కోపం ఒకేసారి కలిగాయి. ఈ చెల్లని అర్థ రూపాయి ఎలా వచ్చింది చెప్మా ? అని అనుకున్నాడు. ఇంతలో తాను బస్ వచ్చేటప్పుడు కిళ్ళీ దుకాణం వాడిచ్చిన చిల్లర డబ్బులు సరిగా చూసుకొనకుండా జేబులో వేసు కుని వచ్చిన సంగతి గుర్తు కొచ్చింది. తననే మోసగించిన కిళ్ళీ దుకాణంవాణ్ణి తిట్టుకుంటూ, అప్పారావు వేరే అర్థరూపాయిచ్చి రిక్షావాణ్ణి పంపేశాడు.

ఇంతా చేసి, అప్పారావు థియేటర్లోకెళ్ళేసరికే బుకింగ్ మూత పడింది. అప్పుడే థియేటర్లో "న్యూస్ రీల్" కాబోలు వేస్తున్నారు. ఎంతో కష్టపడి సినిమాకొస్తే యిలా కావటం అప్పారావుకి చాల కోపం తెప్పించింది. ఇక చేసేదేమీ లేక అతను థియేటర్ లోంచి బయటికి వచ్చి నడిచి పోసాగాడు.

పరధ్యానంగా నడుస్తున్న అప్పా రావుకి యింతలో "టిక్కెట్ కావాలా బాబూ !" అని కేక వినిపించింది.

అప్పారావు తలెత్తి చూశాడు. థియేటర్ దగ్గిరే పాతికేళ్ళ కుర్రా డొకడు ఒకే ఒక టిక్కెట్టు పట్టుకొని నిలబడున్నాడు. టిక్కెట్టు చూడగానే పోయిన ప్రాణాలు లేచివచ్చినట్లని పించింది అప్పారావుకి.

"ఎంత టికెట్టు ?" అని అడిగాడు.

"సెకెండ్ క్లాస్ టిక్కెట్టు రూపాయి ముప్పయి పైసలది ఒకటి ముప్పావ లాకు అమ్ముతున్నాను, బాబూ ! ఇది

మాత్రమే మిగిలిపోయింది" అన్నాడా కుర్రాడు.

కొందామా? వద్దా? అన్న మీమాంసలోపడ్డ అప్పారావుకి ఇంతలో మెరపులాంటిఆలోచన ఒకటి తట్టింది. "సరే ఆ టికెట్టిలాయివ్వు" అంటూ ఆ టికెట్ తీసుకుని, పైకం వాడి చేతిలో పెట్టాడు. కుర్రాడా పైకాన్ని ఒకమారు చూసుకొని, జేబులో వేసుకుని త్వరగా మాయమయ్యాడు. దూరంగా నడచి వస్తున్న పోలీసును చూసింతర్వాత ఆ కుర్రా డెందుకలా త్వర త్వరగా వెళ్ళిపోయాడో అర్ధమయింది.

"చెల్లని అర్ధరూపాయిని టికెట్ డబ్బుల్తోపాటు కలిపి కుర్రాడికంటకట్టినందుకు తనను తానే అభినందించుకుంటూ అప్పారావు థియేటర్లోకి దారితీసాడు.

సెకెండ్ క్లాస్ ద్వారంపద్ద ఉన్నతనికి టిక్కెట్టు యిచ్చి, అప్పారావు లోనికెళ్ళబోయాడు. కాని "ఏమ్ మిష్టర్!" అన్న గేట్ కీపర్ కేకతో వెనుదిరిగి చూచాడు.

"ఈ టిక్కెట్టు చెల్లదు" అంటూ ఆ టిక్కెట్ అప్పారావు చేతికిచ్చాడు గేట్ కీపర్.

"ఏం?" అప్పారావు తనని తాను నమ్మనట్లు చూశాడు.

"మమ్మల్నే మోసం చేద్దామనుకుంటున్నావా? ఈ ఎర్ర రంగు టిక్కెట్టు నిన్నటిది. చదువుకున్న వాడివే ఇలాచేస్తే ఎలా, మిష్టర్?' అన్నాడు గేట్ కీపర్ గద్దిస్తున్నధోరణిలో, టిక్కెట్టును మిగతా గేట్ కీపర్లకు చూపెడుతూ.

"ఏమిటో ఈ కాలమంతా యిట్లయిపోతున్నాది! ఎవర్నీ నమ్మడానికి వీల్లేకుండా ఉంది" మిగతా గేట్ కీపర్లు వంతపాడారు.

అసలే మిన్నువిరిగిమీద నడ్డట్టయిన అప్పారావుకి, యిక అక్కడేవుంటే వసువుకూడా దక్కదేమో అన్న భయంకూడా పట్టుకుంది. వెనక్కికూడా తిరిగి చూడకుండా అప్పారావు త్వర త్వరగా అడుగులేస్తూ థియేటరు బయటికొచ్చాడు. తనను దగాచేసిన ఆ కుర్రాడు కనిపించకపోలాడా అన్న ఆశతో. కాని అతని ఆశ నిరాశ అయింది.

అప్పుడు గుర్తుకొచ్చింది అప్పారావుకి, తాముకొన్న టిక్కెట్టు క్రితంరోజు బ్లాక్‌లో అమ్ముడుపోక మిగిలిపోయిన టిక్కెట్ అయివుంటుందని. కసితీరా ఆ టికెట్‌ని ముక్కలు ముక్కలుగా చించి పారేశాడు అప్పారావు.

నేలమీద చిరిగిపోయిన టికెట్ తనని "పాపం! అప్పారావు!" అని వెక్కిరిస్తున్నట్లనిపించిందతనికి.

•••

# భావలహరి

జీవితం ఒక పుష్పం. ప్రేమ ఆ పుష్పం ప్రసాదించే మకరందం.

— విక్టర్ హ్యూగో

*　　*　　*　　*

అసహ్యాన్ని వ్యక్తం చేయటానికి మాట్లాడకుండా పూరుకోవటం ఉత్తమోత్తమమైన మార్గం. — బెర్నార్డ్ షా

*　　*　　*　　*

గడ్డిపుల్లయినా మనకు గిలిగింతలు కలిగిస్తే అది మన ఆనందానికి సాధనమే. — డ్రైడన్

*　　*　　*

నిజాన్ని, పవిత్ర స్నేహాన్ని శంకించేవారు ఈ లోకానికి యెంత దూరంగా వుంటే అంతమంచిది.

*　　*　　*

ప్రకృతి ప్రసాదించిన మహాభాగ్యం సంతృప్తి, కల్పితమైన దారిద్ర్యం విలాసం — సోక్రటీస్

*　　*　　*

శత్రువు ప్రేమనటిస్తూ కురిపించే ముద్దులకన్న మిత్రుని దండనే మంచిది. — థామస్ ఎ. బెకెట్

*　　*　　*

మన తాత ముత్తాతలు ఎంతెంత ధనాన్ని సంపాదించినప్పటికీ మన కష్టార్జితమైన ఒక గవ్వతో అది సమముకాదు.

— వీరేశలింగంపంతులు గారు

సేకరణ : ఎస్. గోవిందరాజ్.

# మిస్సషా- మిషాప్



వి. రవీంద్రనాథ్

నిజాన్ని కథగా చూశానుగాని, కథ నెప్పుడు నిజంగా జరగడం చూడ లేదురా అన్నాను. కథ ఎప్పుడైనా నిజంగా జరగడం చూశావురా? అన్న నా మిత్ర రత్నం భాస్కర్ ప్రశ్నకి. ఆ రోజే మా వూరు వదలి వెళుతూ గుంటూరులో మా బాబాయి గారింటికి వెళ్లాను. ఎను గా న్నన్న ఇ ట్లో "స్నేహాశ్రి" బోర్డు వేళ్లాడుతోంది. ఏమిట్రా అలా చూస్తున్నావు. అది పెన్ ఫ్రెండ్‌షిప్ చేసేవాళ్ళ ఇల్లు. వాళ్ళు దానికి ఒక పత్రిక నడుపు తున్నారు అన్నది మా చెల్లెలు. అయితే నేను వీళ్ళతోనే చేస్తాను ఫ్రెండ్‌షిప్ అన్నాను తమాషాగా।

చేర లపిన ఊరు గా ను.

గృహంలో బసచేశాను. ఇంటర్వ్యూ అయిపోయింది. తర్వాత రోజా .... వాళ్ళ కాలేజి స్టూడెంట్స్‌ని ఊటీ, రామేశ్వరం బయొలాజికల్ టూర్ తీసుకెళుతున్నట్లు చెప్పి, నన్ను రమ్మనమని డిమాండ్ చేశారు మా గురువుగారు. తప్పేదేముంది. (ముల్లె కట్టరా బుల్లోడా అనుకున్నాను.)

నేను ఇంటర్వ్యూవల్ల బెంగుళూరు వచ్చినట్లు, సెలెక్ట్ అయినట్లు, వచ్చే నెలలో జాయిన్ అవుతున్నట్లు, అనుకోకుండా .... టూర్ ప్రోగ్రామ్ .. విశేషాలు మరికొన్ని వ్రాసి ఆ ఉత్తరం తపాలాపెట్టెలో, నేను రైలుపెట్టెలో వచ్చాము. మైసూరులో దిగి, బృందావనంలో (నా) ఉషని తలుచుకొని బస్సులో ఊటీ చేరాము. బోట్ క్లబ్ బోట్లలో హనీమూన్‌కి వచ్చిన నవజట్లు, విహారం చూడగానే నామనస్సు ఉన్నది చూశారూ! అది బయటికి వస్తానని ఒహటే గొడవ (అణిచేశాము!) పాంబన్‌లో మకాం. ఒకపూట రామేశ్వరం వెళ్లాం. అందరూ సముద్రపు ఒడ్డున స్పెసిమన్స్ వెతుక్కుంటూ అవస్థ పడుతూంటే (మరి అవసరం) నాకు సముద్రము దాటి వెళ్ళాలనిపించింది. ఉష ఆవతలి ఒడ్డున, నేనివతలి ఒడ్డున. మధ్యలో

సీన్పుకదూ! షాక్ కొట్టింది. వ్వ! ఉషని కలుసుకోలేనా! (ఉష అంటే ఆషామాషీనా అంది ఒక మనసు. (అదీ నాదే)

దట్ యీజ్ ఎ గుడ్ ఐడియా! నా గాథ విన్న మా లెక్చరరుగారు పాంబన్‌లో పరిచయం (కావాలని) చేసుకున్న లాడ్జి ఓనరు మైరెకర్‌తో చెప్పిఅని ఇన్‌ఫ్లుయన్సు (నాట్ ఫ్లు)తో సింహళం అబ్బబ్బ! అదేనండి సిలోన్ .... వెళ్ళటానికి అవకాశం కల్పించారు (నమోవాకాలు). ఇహ దిసోకాల్డ్‌షిప్ ఉన్నది చూశారూ! దాంట్లో ప్రయాణం (అదే పయనం) చేస్తున్నప్పుడు పసుగు జనించటం, దాన్ని చంపేయటం ఆటోమేటిక్‌గా! (ఉష గుర్తుకు రాగానే) బయలుదేరే ముందు పంపిన కేబుల్ చేరేవుంటుంది. ఉష ఎదురు చూస్తూ వుంటుందేమో నా మనస్సు ముందే ఉష దగ్గరికి వెళతాననటం. (ఒద్దు. నేను కూడ వస్తున్నాను కదా! ఉండమన్నాను) వచ్చేసింది సిలోన్. నా ఉషతో కుషీగా కబురు చెప్పాలి. నా మనస్సుకి. టేప్ రికార్డర్‌కి కనెక్షన్ కుదరక పోవడం వల్ల ఎన్నో విశేషాలు లోపలే ఉండి పోవలసి వచ్చింది. (ఏం చేస్తాం! లాబ్‌సాంగ్ రాంపా జ్ఞాపకశక్తి నాకు ఉంటేనా!)

హల్లో! మైడియర్ ఫ్రెండ్ అన్న దాక పురుషాకారం (నాకు కారం అనిపించింది సుమా! ఎవరితడు?



సిలోన్ పోయి ఆస్ట్రేలియా రాలేదుకదా! ఆ చోటికి అనుకున్నాను. ఛ! ఛ! ఉషతో హమేశా హాయిగా వుందామనుకుంటే ఈ వ్యవడి వోయ్? అన్నాను. (తప్పు? తప్పు? అందామని అనుకున్నాను) ఇంటికి తీసి కెళ్ళాడు. అంతవరకు బాగానే వుంది. తనే ఉషనన్నాడు పైగా నా స్నేహం నచ్చిందట. (పోవోయ్? బడుద్దాయ్! అన్నాను లోపలే) తనపేరు మిస్సుస్హ్ (MiSSUSH) ట! ఖర్మ! మ్యాగజైన్‌లో దిసోకాల్డ్ మిస్ కొంచెం దూరం అయ్యేసరికి చూశారా మిస్ అనుకొని మిస్ అయ్యాం.) ఆ మిషలో (ఆ సోగ్గాడి) ఆతిథ్యం స్వీకరించి శీఘ్రమే జెట్‌లో వచ్చేశా! తర్వాత ఇలాంటి మిషాప్ (ప్రమాదం) చేయకూడదు అనుకున్నాను (అంటాను కూడా).

•••

నిశీధి. నల్లని కటిక చీకటి. ఆ చీకటిలో హోరుగాలి. భయంకర శబ్దాన్నిచ్చేగాలి. గాలికి ఊగినట్లాడి చెట్లు చేసే భీకరశబ్దం. ఎంతటి కటిక చీకటో, అప్పుడప్పుడు అంతటి బ్రహ్మాండమైన మెరుపు వెలుగు. ఆ మెరుపులో గాలికి ఊగే, తల విరబోసుకున్న భయంకర రాక్షసిలాంటి చెట్లు చెదిరిన తాటాకుల గుడిసెలు. తుపాను పట్టి మూడు పూటలయ్యింది.

భీతావహులైన ప్రాణికోటి రేయింబవళ్ళు ఇళ్ళలోనే గడుపుతున్నారు. అంత పెద్ద తుఫాను ఈ మధ్య పట్టలేదు.

ఎగిరిపడిన ఆకులతో నిండిన వీధులు నిర్మనుష్యంగా ఉన్నాయి. ఒరిగిన విద్యుత్ స్తంభాలు, తెగిన తీగలు చుట్టబడియుండి రణరంగం, యుద్ధానంతరం ఎలా ఉంటుందో గుర్తు చేస్తున్నాయి.

అవసరం ఉన్నా ఎవరూ బయటకు రాలేకపోతున్నారు.

అప్పుడప్పుడు ఒలంలేని చెట్లు, గోడలు నేలకొరుగుతున్నాయి రణరంగంలోని సిపాయిల్లాగ.

సూరమ్మ గుడిసెలో నులకమంచం మీద కొడుకుని పడుకోపెట్టి ప్రక్కన కూర్చుని గుమ్మంవైపు పదే పదే చూస్తోంది. పగిలిన చిమ్నీలోని దీపం గాలికి రెపరెపలాడుతోంది ఆమె మనసులాగ. ఇంటిపైకప్పు రంధ్రం ద్వారా పడిన నీటిచుక్కలు ఏకమై మట్టిగోడను గాడిచేస్తున్నాయి. ఆలోచనల పరంపర ఆమె ఎదనుచీలుస్తోంది.

బావలిసరస్వతి

ఆకాశం ఉరిమిన చప్పుడుకి రత్తాలు ఉలిక్కిపడ్డాడు. కొడుకుపంటి నిండా గుడ్డ కప్పి. మరల మనసును ఆలోచనలతో నింపింది.

• • •

"ఆ యేళ బోగిపండగ. సందేళ పనులన్నీ పూర్తి సేసుకుని, తలకోసుకున్నాను, కొప్పెట్టుకుని సుట్టూరా పువ్వు లెట్టుకున్నాను. బొట్టెట్టుకుని సందమామలాటి బొట్టెట్టుకున్నాను.

మావ కిట్టపయిన సుక్కల సీరకట్టుకుని. ముదరెరుపు రంగు జాకిట్టేసుకున్నాను.

గుమ్మానికి కడదామని బంతిపూలు దండగుచ్చి నా అందం ఇంకోసుట్టు సూసుకోవాలనిపించి దండ మంచం మీనెట్టి, అద్దం తెచ్చుకుని మంచంపై తొంగుని నా అందాన్ని పదే పదే సూసుకుంటన్నా. నే సచ్చం సినిమా యాక్ట్రెసు లాగున్నాను. "ఇప్పుడు



మావొత్తే నా అందాన్ని తెగపొగిడేత్తాడు" అనిపించింది.

మావ ఎంతమంచోడు! ... అదేటో నాకు తెల్దు....నన్నుసూత్తంటే అన్నం అక్కర్లేదంటాడు. కడుపు నిండిపోద్దట! అందుకే నన్ను కూలి పని

కూడా సెయ్యనియ్యడు ... కర్సుకి రోజూ అద్దురూపాయిత్తాడు. నేను మాత్రం రోజూ అద్దురూపాయ ఏటి సేసుకుంటాను? పోగేసిమావకిసెప్తే. సుక్కలసీర ముదరెరుపు జాకిట్టు కొన్నాడు.

అంతికే ఆ సీరని అద్దురూపాయి సీర అంటూ యాలాకోలం సేత్తాడు కూడా.

అంతలోనే ఒళ్ళు జల్లుమంది.... ఎక్కడనుండి ఊడిపడ్డాడో ఇసురుగా ..తూలుకుంటూ మావొచ్చేడు. అద్దంలో మావను సూసి బెదరి

పోయాను....నామనసునిపుక్కుమంది. మావ దగ్గరకెళ్లేను. కంపు....సీ.... సుక్కేసుకున్నాడు కళ్ళు నిప్పుల్లాగు న్నాయి. దగ్గరకెళ్ళేటప్పటికి ఒక్క తోపుతోసేడు. ఎల్లి మంచంమీదపడ్డా. మంచం ఒడీ ఇరిగిపోయింది. బంతి సంచ తెగిపోయింది. నాకు దుక్కం ముంచుకొచ్చింది. ఎంతసేపో ఏడి సేను. ఆ యేళ ఇద్దరంకూడు తిన్లేదు. సెప్పొద్దు మావమీద నాకు సెద్ద కోపం వచ్చింది.

తెల్లారింది. కూడొండి సూత్తన్నా, రేతిరి మావ సేసిన పనితలుచుకుంటే ఏడుపొచ్చింది. ఎన్నిసార్లో సెప్పేను, ఆ ఎదవ సారా బాగోదని. నేతిమీ సెయ్యేసిఇకతాగనంటాడు అయ్యోటక. మళ్లా మామూలే....మావ సారాతాగ కట్టంమీదవారవయింది.మళ్లా ఆరాతిరి తాగేడు. కానిఎప్పుడూ అంత మత్తు సుగా లేదు. ఏటొచ్చిందో పిచ్చోడై పోయాడు. సికాకపడేడు. సూరీడు నెత్తిమీదకొచ్చినా మావ రాలేదు. గుమ్మంకాడకెళ్ళి సూసేను. అల్లంత దూరంలో ఒగురుస్తుంటూ వత్తన్నాడు. మావసేతిలో ఏదో ఉంది. గబగబా లోనకొచ్చి కూకున్నా. లోనకొచ్చేడు. ఎనకనుండి నా రెండుచేతులూ పట్టు కుని లెగ్గొట్టేడు.సీదరించుకుని ఇదిలించు కుందారనుకున్నా. కాని యంటనే నన్ను తనేపుకు తిప్పుకుని నా కళ్ళ లోకి సూసేడు. "ఏడకు సూరీ.... నే నెదవను," అన్నాడొక్కమాటలో" నన్ను శమించవే అన్నాడు సినిమా వోళ్లాగ. పొట్లం ఇప్పి సూపించాడు. ఒక్కసారి మావ మొకం సూసేను. మావ కళ్ళలో నీళ్ళుదేయి. "మావ ఎంత మంచోడు!" అనుకున్నాను. మావ కళ్ళు తుడుస్తూ నే నేడిసేను — కాదు నవ్వేను... కాదు రెండూ సీర నిండా సచ్చిత్రాలు తెలుపు రంగు "సూరీ! — నువ్వీ సీరకట్టుకుంటే సుక్కల్లో సందమామలాగుంటదే నీ మొకం అన్నాడు మంచంమీద కూకో పెడుతూ. నే నవుగుదారనుకుంటుంటే మావే సెప్పేడు. "సూరీ! ఎప్పుడూ తాగనని ఒట్టేసినానుగందే ఏటి చెయ్యను? రంగడూ, ఈరయ్యా నన్ను బట్టీ కాడకు తీసికెళ్ళేరు. నే తాగను, ఒట్టేసినానని సెప్పినా ఇనక ...ఒట్టు గట్టుమీనెట్టు - తరువాత తీసుకుందుగాని. పండగరోజు కూడా ఒట్టేటి ..అని బలవంతాన పట్టే సేరూ. ఎలాగా దాగినానుగందాని మూడుగానులేసేను, తాగి శానాకాల మయిందని" అన్నాడు నవుగుతూ.

ఆ మాపటేలకే సినిమాకు తీసికెల్లి నాకు నే కుర్సీల్లో కూకో పెట్టేడు.... సినిమా సూత్తన్నంతసేపూ ఏటో సిగ్గు....మావ మడిసెంత మంచోడో తాగితే అంత సెడ్డోడయిపోతాడు.... సీ ...ఎదవ సారా.

• • •

ఆమె ఆలోచనల ప్రవాహానికి




బయట "పబేలు" మన్న చప్పుడు గట్టువేసింది. తలుపు తెరిచింది. గీటిలో తప తప కొడుతున్నట్లు చప్పుడయుంది. చీకటిలో ఏమీ కనిపించలేదు. మెరుపు మెరిసింది. రెండు గజాల దూరంలో పడిఉన్న మనిషి ఆకారం కనిపించగానే గతుక్కుమంది.

బయటకు వెళ్ళి అతని చెయ్యిపట్టుకుని లోపలికి తీసికొని వచ్చింది. నేల మీద పడుకోబెట్టి తలుపు వేసింది. గాలికి దీపం ఆరిపోవడంవల్ల గుడిసె నిండా చీకటి అలుముకుంది. చీకటిలో అగ్గిపెట్టె దొరకలేదు.

"తన మామ తనకు దక్కాడు. అంతే చాలు: లోకాలు ముంచుకు పోయినా ఫరవాలేదు" అని తృప్తి పడింది.

తాగొచ్చినా, మామంటే జాలేసింది సూరమ్మకి. వంట గదిలోకి వెళ్ళిన సూరమ్మకు "సూరమ్మ" అన్న పిలుపు మైకంలో పిలిచినట్లు వినిపించింది అచేతనంగా నిలబడిపోయింది.

ఇలా రా! సూరమ్మా ...నిన్ను అనుబగించనోడు మనిసేకాదు.... "నీకోసం వచ్చేను....నువ్వే లోనకు తీసుకొచ్చావు ...రా! ఆ గంగడొస్తే....

ఏడుస్తాడు". ఆమె కళ్ళు గిర్రున తిరిగాయి. ధైర్యం తెచ్చుకుని, ఆ వ్యక్తి చెయ్యిపట్టుకుని గుమ్మం వరకు నడిపించుకు తీసికెళ్ళింది. బయటికి ఒక్క తోపుతోసి గడియపెట్టి మంచంమీద పడి భోరున ఏడ్చింది మావొచ్చాడన్న ఆశ ఆవిరయిపోయింది. మళ్ళా ఎదురు తెన్నులు తప్పలేదు.

• •

తెల్లవారింది. తుఫాను కూడా తగ్గుముఖం పట్టింది. కొద్దిపాటి గాలి తప్ప ఉధృతంలేదు. ప్రజలలో సంతోషం వెల్లివిరిసింది. సూరమ్మ గుడిసెపక్క కొబ్బరిచెట్టు ఇంటిమీదకు వాలి ఉంది. అది ఇంటిమీద పడితే గుడిసె కూలిపోయుండేది. మరికొంతసేపు గాలి వీస్తే అంతపనీ జరిగేదే.

"ఏటే సూరా! అలాగున్నావు?"

"ఏంలేదు మావా, కొబ్బరిచెట్టు ఇంటిమీద పడలేదు. అదృష్టమంచలం వొద్దిలో పోయింది.

"నువ్వున్న ఇంటిమీద పడ్డా? ఎంత ధైర్యం ఉండాలి?"

.... ....

"ఇదేటే? ఇసిత్రంగా ఉందే? ఏడుపేటి?" దగ్గరగా వచ్చి సూరమ్మ కళ్ళు తుడిచేడు గంగ.

"ఓస్ అదా? తప్పయిపోయిందే" అంటూ నసిగేడు.

"రాత్రి నన్నొక్కతిని వదిలి నువ్వెక్కడి కెళ్ళేవు? ఆ కొబ్బరి సెట్టే మీదపడితే ఈ పాటికి సూరి సచ్చిపోయుండేది."

"సీ.... ఏటామాటలు.... మంచోళ్ళకెప్పుడూ దేవుడన్నాయం సేయడు." అని కళ్ళలో మెరసిన ప్రేమకు సూరి మరింత దగ్గరగా చేరింది.

• • •

"సూరీ! ..." సుసంగా తలు స్త తోసూ" బిగ్గరగా అరచేడు గంగ.

కేక విని లోపల కొచ్చిన రత్తాలు తండ్రి వాలకం చూసి బెదిరిపోయాడు. బిక్కు బిక్కుమంటూ నిలబడ్డాడు.

"లమ్మ ఎక్కడికో ఎల్లింది. నువ్వొత్తే సేరత్తెమ్మంది."

"సీ ... ఎదవా సేరత్తెంమ్మం టంట సేపలు.... ఉరేయ్ ఎదవా నన్ను అయ్యా అని పిలవకు, నువ్వు నా కొడుకువి కాదు. పో ..." ఒళ్ళు తెలియని మత్తులో కోపంగా రత్తాలు డొక్కలో ఒక్క తన్ను తన్నాడు.

రెండేళ్ళ రత్తాలు బలమైన తాపుకు తట్టుకోలేక లమ్మా అని అరిచి నేల కొరిగేడు.

సూరమ్మ వచ్చేటప్పటికి గంగ ఒక మూల పడుకున్నాడు.

"ఒరే రత్తా! ఇలా రారా! మీలమ్మ రాదిలేత్తన్నా రా..హి..హి...హి నువ్వెక్కడుంటావురా! లమ్మదగ్గరుంటావా? పో! ఎదవా నీ కర్మ. ఒరే రత్తా! మీలమ్మలాటి దాన్ని మనువాడకురా..

పాప వొత్తది. సుక్కమాతరం మరిసి పోతు. అదేరా బతుకులో సువ్వనుబ గించే సుకం. సుక్కంటే సొరంగరా సొరగం.

అతని మాటలు ఆమె గుండెల్లో ములుకుల్లా గుచ్చుకున్నాయి.

మరో ప్రక్క పడుకున్న రత్తాలుని చూసింది.

అనుమానంగా గంగ దగ్గర కెళ్ళింది.

"మావా!"

ఏ....మే.. ?"

"నేను సూరిని. మళ్ళా తాగేవా మావా?" రత్తాలు కేటయింది మావా?"

ఆ మాటలు వినగానే విసురుగా సూరమ్మకేసి తిరిగేడు. అతని కళ్ళు చింత నిప్పుల్లా గున్నాయి. తిన్నగా వంటగదిలో కెళ్ళేడు.

తనవైపు వస్తున్న మావనుచూసి బెదిరిపోయింది. నాలుగడుగులు వెనక్కి వేసింది. అతని చేతిలోని కత్తిపీట కసాయివాని చేతిలో కత్తి లాగుంది.

"మావా! ఏటిది?"

అతను రత్తాలువైపు చూసేడు.

ఆమె గాభరా పడింది. కొడుకు దగ్గర కెళ్ళి నిలబడింది.

సూరి కళ్ళలోకి సూటిగా చూస్తూ మరింత దగ్గరగా వచ్చేడు. మావపై ఉండే ప్రేమను ఆత్మరక్షణ జయించింది. మూలనున్న కర్ర తీసి కత్తిపీటను కొట్టబోయింది. కాని ఆ దెబ్బ అతని తలకు తగిలింది. ఆ దెబ్బకు స్పృహ తప్పి నేలకు కరుచుకు పోయాడు.

గంగకి స్పృహ వచ్చేటప్పటికి సూరమ్మ రత్తాలుని ఒళ్ళో పడుకో బెట్టుకుని కూర్చుంది.

"ఏటయింది సూరీ?"

"రత్తాలు సచ్చిపోయాడు" అకస్మాత్ సంఘటనకు ఆమె గొంతు మూగపోయింది. ఏడుపు రాలేదు.

"ఆ.. .సచ్చిపోయాడా?" కొడుకు మీదపడి ఏడ్చేడు. ఆమెకుకూడా దుఃఖం పెల్లుబికింది.

"ఇరుగు పొరుగువాళ్ళ అనునయ వాక్యాలతో "భూమ్మీద నూకల్లేవని" సరిపెట్టుకుని అంత్యక్రియలకు సిద్ధమయారు.

అంత్యక్రియలు పూర్తయి ఇంటి కొచ్చేరు.

---

★ ఇదిగో మా అమ్మాయి సూర్యాస్తమయాన్ని చిత్రించింది. మా అమ్మాయి పదేశాల్లో చిత్రకళ అభ్యసించింది.
అట్లా చెప్పండి! మన దేశంలో ఇలాంటి సూర్యాస్తమయం నేనెప్పుడూ చూడలేదు!

"సూరీ....నీ నచ్చిత్తరాల సీరేదీ?"

"పెట్టెలోని చీరను తీసికొచ్చి ఇచ్చింది."

"ఏటిమావా...అలాసూత్తన్నావు?"

"నన్ను శమిత్తావా సూరీ?"

"ఇంకా ఏటి మావాఁ నీ యాలాకోలం?"

"రత్తాలుని సంపింది నేనే నే నే"

ఆమె ఆశ్చర్య పోయింది.

"ఇలాంటి నచ్చత్తరాల సీర కట్టుకున్న దాన్ని సూపించి "నీ పెళ్ళాం ఎవడితోటో పోతుందని" సెప్పేషు, అయివస పోలీసు జమాను ఎంకయ్య గాడు". ఆడి మాటలు నమ్మి నాకు నేనే సిచ్చేసుకున్నాను. ఆడం....

"మావాఁ ...తప్పు నాదే....

ఎంకయ్యంటే ఈమద్దెన సెయ్యికి కట్టుకట్టినాడే?"

"ఆఁ ...ఔను"

"ఆడేవన్నాడంటే...."నీ మావఁ ఒకరోజు తాగేసి రోడ్డుమీద తొంగున్నాడు. డేసనుకి తీసికెళ్ళకుండా సేసేను. "తాగుడు మాన్పించే పూచీ నాది" అన్నాడు. ఆ బెంగలా పడిపోయావు." ఒకసారి నీ నచ్చత్రాల చీర పట్టుకురా" అన్నాడు. అలాగే పట్టుకెళ్ళేను. ఆ సీరెక్కడికో పట్టుకెళ్ళేడు. నే నక్కడే కూకున్నాను. ఆ తరువాత కొంతసేపట్లో సీర తెచ్చిచ్చేడు. నేను సీర ఇంటికి పట్టుకొచ్చేటప్పటికి నీవు తొంగుని ఏదో మాట్లాడుకుంటున్నావు. నువ్వు సూత్తే ఏటడుగుతావని నువ్వు సూడకుండా పెట్టెలో ఎట్టేసాను మావాఁ. నన్ను చమించుమావాఁ.

"సూరీ .... ఎంతపని జరిగిందే" అంటూ బావురుమన్నాడు.

అంతలోనే "ఆడంతు సూ__" నంటూ లేచేడు.

"ఒద్దు మావాఁ .... ఒద్దు....పోలీసోళ్ళు మంచోళ్ళు కాదు. మంచోళ్ళకు సెడ్డసేత్తరు. సెడ్డోళ్ళకు మంచి సేత్తారు. ఖూనీ సేసేవాళ్ళ దగ్గర, దొంగతనాలు సేసేవాళ్ళ దగ్గర కక్కుర్తి పడే మనిసి ఆ పోలీసు ఎంకయ్య.

అతని ఆవేశానికి ఆమె ఖంగారు పడిపోయింది.

అతను అడుగు ముందుకు వేయలేకపోయాడు.

సూరి కళ్ళల్లోకి చూస్తూ "సూరీ... ఇక సారా సచ్చినా తాగనే" అన్నాడు కన్నీటి బిందువులు రాలుస్తూ.

.........

"నమ్మావా?"

"నమ్ముతాను" అంది కన్నీటిని తుడుస్తూ.

ఆ క్షణంలోనే నక్షత్రాల చీర అగ్నికి ఆహుతయింది. సూరమ్మ గంగకు మరింత దగ్గరయింది.

...



సీరియల్

# రేపటి మనుష్యులు

శ్రీసుధా

(గతసంచిక తరువాయి)

తులసి ఆఫీసునుంచి తిరిగి వచ్చే టప్పటికి వాకిట్లో బావ రామారావు కన్పించాడు. అతన్ని చూడగానే ఆ హ్యం పుట్టింది. ఆ అసహ్యానికి కారణం యిదీ అని ఆమెకు తెలియదు.

రక్తం పంచుకుని పుట్టిన అక్కగారు తనని వ్యంగంగా తిడితే - అరుంధతి మనస్తత్వాన్ని మార్చి, మెదడు పాడు చేసి నిర్వీర్యురాల్ని చేసింది అత్తింటి వారేనని చాలా రోజుల క్రితమే వో నిర్ధారణకు వచ్చింది, ఆ నిర్ధారణ వెనుక వెంకాయమ్మగారూ, దుర్గా వచ్చి తమ యింట్లో ప్రవర్తించిన విధానం, తనని అత్తింటివారు సరిగ్గా చూడడం లేదని అక్కకార్చిన కన్నీరూ, ఆఖరిగా వాళ్ళు అరుంధతికి ఇచ్చే గౌరవం అన్నీ వొక్కటొక్కటే గుర్తుకు రాసాగాయి

"తులసీ మీ బావొచ్చారుచూశావా?"

తులసి ప్రభాతిని "అక్షరాలు దిద్దావా" అని గదమాయిస్తోంది. తన మాట ఆ పసివాళ్ళు వినకపోవడం కూడా వొక్కొక్కసారి ఆమెకు కోపం కల్గిస్తూనే వుంది.

"వాళ్ళ గొడవకేంగాని ఆయనకు కాఫీ కలిపి యియ్యి" అంది.

తులసి ముభావంగానే లోపలికి వెళ్ళింది.

"మామయ్య వాళ్ళో లేరేమిటి" భార్యని అడిగాడు రామారావు.

"తిమ్మాపురం వెళ్ళారు....రాత్రికి రావొచ్చు" అంది.

"శేషు రాలేదా"

"వరంగల్లో దిగాట్ట. రెండు రోజుల్లో వస్తాడు".

తులసి కాఫీ కలిపి తీసుకు వచ్చింది.

"దీన్ని తీసుకు వెడదామను కుంటున్నాను."

తులసికి బావగారు ఈ విషయం తనతో చెప్పడం యెందుకో అనుకుంది... అయినా అంది...

"యెక్కడికి"

"యింకెక్కడికి....యింటికే...."

"అప్పుడేం యేం తొందర"....

రామారావు నవ్వుతూ అన్నాడు.... "నీ పెళ్ళి మీ తమ్ముడి పెళ్ళి పూర్తి అయ్యేవరకూ వుంటే అక్కడ మేం యెలా"

"నేను అందుకోసం చెప్పలేను" కోపాన్ని ఆపుకుంది.

"మరెందుకు చెప్పావు"

"నీకు తెలుసు, దానికి తెలుసు"

"దానికి తెలుసేమోగాని, నాకు తెలియదు. సరిగ్గా చెప్పకూడదా?"

"చెబితే నువ్వు బాధపడతావు"

రామారావు చిన్నగా నవ్వి "బాధ" అని "యిప్పటికే చాలా బాధలు అనుభవించాను, యిన్నాళ్ళకు మరదలివి నువ్వు కన్పించావు-వో బాధని నా మీద రుద్దకుండా సంశయించిన దానివి"

"వీలయినంత వరకూ తప్పించుకు తిరగాలనా"

"సరే నీ ఇష్టం వచ్చినట్టు అనుకో"

అరుంధతి లోపలినుంచి "తులసీ" అంటూ వచ్చింది.

"నువ్వు ప్రయాణంకా. "తెల్లవార్తగట్ల బండికి వెడదాం" లలితమ్మగారు అదే అనుసరించుకుని "చూడు రామా రావూ" అంది. ఆవిడ యెప్పుడూ అల్లుణ్ణి పేరు పెట్టే పిలుస్తుంది.

"జరిగిందేదో జరిగింది. అరుంధతి గురించే నా బాధ అంతా"

తులసి వెంటనే అంది ."మన కోపాల మధ్య దాన్ని యిరికించడం మంచిది కాదు. అమాయకులుగా పుట్టిన వాళ్ళను వెర్రివాళ్ళుగా చేసి ఆడిస్తే, దేవుడనేవాడు వుంటే హర్షించడు."

"యేమిటే నీ మాటలు" అంది కోపంగా లలితమ్మగారు.

తులసి అయినా ఆగలేదు, "అవునే శేషు పెళ్ళి పేరు చెప్పి దాన్ని సాధించడం యేమిటి, మతిలేకపోతే"

"నువ్వు లోపలికి వెళ్ళు" అరిచింది తల్లి. అరుంధతి అంతకుముందే లోపల గదిలోకి వెళ్ళింది. గుండెలు దడదడలాడుతున్నాయి - తులసి భర్తను అనే మాటలు వింటూంటే యేం చెయ్యాలో తోచలేదు. అలాగని తులసిని తప్పు పట్టగలదా తను, తన జీవితం గురించి యెంతమంది బాధపడాల్సివస్తుందో...తన బ్రతుక్కి సుఖం వుంటుందా అసలు.. వాడికి యిష్టంలేదు. పైగా మాకు ఆన వాయితీలేదు."

రామారావు అప్పటికే తులసి మాటలతో నిర్వీరుడయ్యాడు. అవమానంతో

వళ్ళంతా కాగిపోయింది. ఒకళ్ళు చేసినదానికి మరొకరిని బలిపెట్టడం మూర్ఖత్వం అని తనకూ తెలుసు. కానీ తగిలిన దెబ్బని తట్టుకోవడానికి గాయం మానడానికి కొంత కాలం అవసరం అవుతుంది, ఈ మధ్య కాలంలోని యెగుడు దిగుళ్ళతో మనిషిని కొలిచి, అదే పురవంలో యెల్లకాలం చిత్రించుకునే వాళ్ళు చాలామంది వుంటారు. అదే బాధకరం.



తిమ్మాపురంనుంచి వచ్చిన భుజంగ రావుగారు అల్లుణ్ణి యే విధంగా మంద లించాలో వూహించుకున్నా మాటలు కుదిరిరాకమౌనంగానేవుండిపోయాడు. యేదైనా అంటే చెల్లెలి పెళ్ళిమాట కదుల్తుందనీ దాంతో రభస రేగు తుందనీ వూరుకున్నాడు.

రామారావు అరుంధతిని తనతో తీసుకు వెళ్ళిపోతానని చెబితే

"యిప్పుడే తీసుకువెళ్ళాలా" అన్నాడు.

లలితమ్మగారు మామూలుగా పసుపూ కుంకుమా సున్నిపిండీ మూట గట్టింది. మనమరాళ్ళ కోసం జంతికలు చేసింది.

యెవరూ లేకుండా చూసి అరుంధతితో అంది "నీ ఆరోగ్యం జాగ్రత్త. యేదో విధంగా అతగాడ్ని వొప్పించు"

భుజంగరావుగారు అన్నాడు "అరుంధతిని డాక్టరుకి చూపించావు. దాని వంట్లో బాగాలేదని చెప్పారు."

అవతలి గదిలోంచి యిన్నీ వింటున్న తులసి తల్లీ దండ్రీ మొహమాట పడి బావతో చెప్పలేక పోతున్నారనిఆవేశంతో బయటకు వచ్చి అంది.

"అదేమిటి నాన్నా యే విషయం బావనే అడిగితే పోతుందిగా" తన మనసులో మాటని ధైర్యంగా తులసి కదపడంతో ఆయనా నిమ్మదిగా అన్నాడు.

"అక్కనేం మాట్లాడకపోతే మన మేం చేస్తాం"

"అక్కడకు వెళ్ళి యెవరి గొడవల్లో వాళ్ళుంటారు. రేపు దాని ప్రాణం మీదకు వస్తే" అంది.

"అవునండీ" అంది నిమ్మదిగా లలితమ్మగారు.

"నువ్వూరుకో అమ్మా" అంది లోపలినుంచి అరుంధతి భయం, బాధా యెక్కువలా తన్నుకు వస్తూంటే.

"యిందులో మొహమాటం దేనికి" అంది తులసి. తిరిగి వొకళ్ళకి భయ పడ్డం యెందుకూ" అంది బావగారి వైపు చూసి

భయపడాల్సిందేమీ లేదు తులసీ. మీ వాళ్ళకన్నా, నాకన్నా అరుంధతి అంటే నీకే అభిమానమని నాకు తెలుసు" అన్నాడు నిమ్మదిగా.

"యెవరికో వొకరికి వుండాలిగా"

"అందరికీ వుంటుందని యెందుకనుకోవు" అన్నాడు రామారావు సవాల్‌గా.

"అనుకోవచ్చు...అనుకున్నా ఆత్మ వంచన అవుతుందిగా"

"నీ ఆలోచనలకు మేం బాధ్యులమా"

దాని బ్రతుక్కి బాధ్యు లెవరు?

"వూరుకో తులసీ" అన్నాడు ఘర్షణ పెరుగుతూండడంచూసి భుజంగ రావుగారు,

"నీకూ, నాకూ కూడా తెలుసు - యెవరు బాధ్యులో. నువ్వొకతెవేకాదు, మనుష్యుల్ని ప్రేమించేది-చాలామంది వుంటారు కానీ మనుష్యుల్ని ద్వేషించే






టప్పుడు మాత్రం మనసు నిద్రపోతూ వుంటుంది సాధారణంగా. దానికే సిగ్గు పడాల్సి వుంటుంది మనమంతా వెనక్కి తిరిగి చూసుకున్న రోజు "...మా రాపు తేచి అక్కడినుంచి వెళ్ళిపోయాడు. అంగనా అలాగే మాన్పడిపోయాడు.

* * *

## 24

"తులసీ, అరుంధతి ఉత్తరం వ్రాసింది బోలు వచ్చి చదువు" అంది పోస్టుమేన్ యిచ్చిన వుత్తరాన్ని అటూ యిటూ తిప్పి చూస్తూ.

అప్పటికే అరుంధతి వెళ్ళి నాలుగు రోజులయ్యింది. తులసి తల్లి చేతిలో వుత్తరం తీసుకుని ఆత్రుతగా తనలో చదువుకుంది. చదువుతోన్నంత సేపూ. ఎవరో గొంతుక నలుపుతున్నట్టు మనిషిని కదుపుతోన్నట్టు పాలిపోయింది. వూహించనిది జరిగిందేమో నని లలితమ్మగారు కంగారు పడుతూ

"చదవ్వే, ఏం వ్రాసిందే యేమిటి?" అంది.

తులసి చిన్నగా చదవడం మొదలు పెట్టింది....

"నాన్నగారికి-

అరుంధతి నమస్కారములు చేసి వ్రాయునది-నేనూ, మీఅల్లుడూ క్షేమంగా

చేశాము. అత్తగారూ, దుర్గా కులాసా. అప్పుడప్పుడు అత్తగారు తప్ప దుర్గగానీ ఆయనగానీ మీ గురించి యేమీ అనటం లేదు. నేనే అనవసరంగా భయపడ్డా ననిపిస్తోంది. నా ఆరోగ్యం గురించీ ఆపరేషన్ గురించీ ఆయనతో చెప్పాను. ఆయన నవ్వుతూ అన్నారు. "అరుంధతీ దుర్గ గురించీ మరొకరి గురించీ నిన్ను పొట్టన పెట్టుకునేటంత హీనులెవరూ మనింట్లో లేరు. అది నీకు తెలియకపోవడం నాకు చిన్నతనంగా వుంది. మీ తులసి అన్నట్టు - మీ వాళ్ళు దగ్గరి కాదన్నారని కొంచెం కోపం వచ్చింది. మనింటి పరిస్థితులు చూస్తే అగాధ కల్లోలంలో తప్పేం లేదేమో. దాన్ని మనల్ని దురదృష్టం వెంటాడుతోంది. మనకన్నా, ఈ విషాదం దాన్నే యెక్కువగా కదిలించి వుండాలి. నేనూ అమ్మలాగే మొదట నీమీద కోపగించాను. కానీ దుర్గ నీ గురించి యెంత బాధపడిందో నీకు తెలియదు. నేను హాస్పిటల్లో జాయిన్ అయి ఆపరేషన్ చేయించుకునేవరకూ వదిలిపెట్టలేదు. "మనం కష్టకట్టి వదిన్ని అపాయంలో వుంచుతామని వాళ్ళనుకుంటారు. యెప్పుడో చెయ్యదల్చుకున్న పనిచేసే అంటూ ఆనందిస్తారు" అంది. నేనేం సమాధానం చెప్పలేకపోయాను. వొక్కొక్కసారి దుర్గ నాకన్నా చిన్నదయినా పెద్దదిగా కనిపిస్తుంది అన్నారు."

ఆయన యివన్నీ చెబుతూంటే నాకు మాట్లాడ్డానికి సిగ్గేసింది. దుర్గ మొహంకూడా చూడలేకపోతున్నాను. మరో సంగతి. దుర్గకి పెళ్ళి కుదిరింది. మా స్తోమతకి తగ్గ సంబంధం రెండో పెళ్ళివాడు. అందుకు కావల్సిన డబ్బు సరువాటు కాగానే ముహూర్తం పెడతారు. వీలువెంబడి వుత్తరం వ్రాస్తాను. శేషు వరంగల్ నుంచి వచ్చాడా? జవాబు వ్రాయవల్సింది..

అరుంధతి.

అరుంధతి బ్రతుకు వో కొలిక్కి వచ్చినందుకు లలితమ్మగారు అమితంగా ఆనందపడింది. దాంతో ఆవిడ యేం మాట్లాడాలో మర్చిపోయింది.

తులసి మాత్రం ఆ వుత్తరాన్ని అలాగే చూస్తూ వుండిపోయింది. మనిషి అంచనా వొక్కొక్కసారి యోచనకు అందకుండా అతీతంగా వుంటుంది మంచీ చెడూ కలమా ఫలు చెందుతాయి. కానీ ఆలోచించిన మనిషి, తన ఆలోచనకు యోగ్యతగల ఫలితంతో అందులోని ఆనందం అనుభవం చేసుకోలేక పోతాడు. తన వూహాలు బావగారి విషయంలోనూ, అటు దుర్గని అంచనా కట్టేప్పరకడిలో తలొగ్గిపోవడంతో తులసి తనలోతనే సిగ్గుపడింది. పైగా రామారావు, దుర్గా తన అంచనా మించి ప్రవర్తించడంతో క్షణం ఆత్మాభిమానం తలెత్తింది.

"తను పూర్వమే 'వేసక్టమీ' చేయించుకున్నా"ని చెబితే యింత

గొడవెందుకు జరిగింది" అనుకుంది మోక్షం. అటు దుర్గ గురించి అరుంధతి వ్రాసిన మాటలు బాణాలై సూటిగా తగలడం మొదలు పెట్టాయి.

ఆ తరువాత ఆత్మపరీక్ష చేసుకోవడం మొదలుపెట్టి "ఛా. ఛా నేను బాలా కటువుగా ప్రవర్తించాను. దుర్గ పట్ల" అనుకున్నా తులసికి మనశ్శాంతి లభించలేదు. దుర్గకు రెండో పెళ్ళి వాడితోవి గాసాహూ తనకన్నా చిన్నది... రెట్టింపు వయసు వాడితో సంసారం. దుర్గ భవిష్యత్ మబ్బుల్లో పడ్డానికి కారణం యెవరు? దేవుడా. లేక పరిస్థితులా? లేదా వాళ్ళ ఆర్థిక స్థితా.?

మనస్సుకు కొంత విశ్రాంతి కలగడంకోసం లేచి చన్నీళ్ళతో మొహం కడుక్కుని బట్టలు మార్చుకుని జానకి వాటాలోకి వెళ్ళింది.

జానకి బాబుకి సాంబ్రాణి పొగ వేస్తోంది తులసిని చూసి "గారేసు పిన్ని వచ్చిందిరోయ్" అంది.

తులసి బాబును యెత్తుకుని, యేరా, పూర్ అంటూ ముద్దు పెట్టుకుని అగులు గొట్టిపెట్టి గళ్ళో కూర్చోపెట్టుకుని "యేమిటి విశేషాలు జానకీ" అంది.

"యేముంది. యింటి చాకిరీ, పైగా వీడొకడు."

తులసి వీధి గదిలో కైలాసరావు సత్యం సాధ్ మాట్లాడుకోవడం విని "బావగారు నాడా నాలాగే ఆఫీసుకు యెగనామం పెట్టారా?" అంది.

జానకి నవ్వుతూ "యెగనామం పెట్టినట్లు నాకు తెలియదుగానీ, కేజువల్ లీవు మాత్రం తీసుకుంటున్నారు" అంది.

"ఆ" అంటూ వెక్కిరింపుగా తులసి, యిక్కడికి ఆడవాళ్ళు కూడా రావొచ్చు మేం ప్రపంచం గురించే మాట్లాడుకుంటున్నాం. స్త్రీ జాతి గురించి కాదు" కైలాసరావు కేకేశాడు.

"యిక్కడ మాహనుల్ని గురించి చర్చించుకుంటున్నాం" అంది జానకి జవాబుగా.

"అంటుకే కాబోలు అంకగా గొప్పు వస్తోంది" అన్నాడు.

"పద తులసీ వీళ్ళ సంగతి యేమిటో తేల్చుద్దాం" అంది జానకి.

* * *

ఆ మరునాడు పొద్దున్నే లేచేటప్పటికి వాకిట్లోంచి శేషు మాటలు వినిపించాయి తులసికి. రాత్రంతా ప్రశాంతంగా నిద్రపోయాను అనుకుంది. లేచి మొహం కడుక్కుని కాఫీకోసం వంటింట్లోకి వెళ్ళింది.

"ఇటవ్వాళ రాగా జరిగిందిరా" అంది శేషును చూస్తూ.

"ఆ" అన్నాడు.

"మానమ్మా, అత్తయ్యా వోసారి రమ్మనమని చెప్పలేదు పోయావురా?" అంది అనిమ్మగా.

"రమ్మనమన్నారు" అన్నాడు శేషు.

మీ
అందచందాలను
అభివృద్ధి పరచడానికి









రెమీ ®

టాల్కం పౌడర్

"అయితే శేషూ, వుద్యోగం ఖాయంగా దొరుకుతుందంటావా" లలితమ్మగారు ప్రశ్నించింది.

"రాకుండా పోతుందేమిటి" అంది తులసి.

శేషు జవాబు చెప్పకుండానే లేచి వాకిట్లోకి వెళ్ళిపోయాడు.

అడగాలనుకుని వూహించుకుంటూండగానే శేషు వెళ్ళిపోవటంతో తులసి వోసారి అటూ యిటూ చూసి తల్లికి వంట సాయం చెయ్యడంకోసం కత్తిపీట వాల్చుకుని కూరల బుట్టలోంచి బింగాళా దుంపలు తీసి తరగడం మొదలుపెట్టింది.

శేషుని అడగాలనుకున్న ప్రశ్న గుర్తొచ్చింది. వాడు రాజలక్ష్మిని కలుస్తున్నాడా....లేదా? అదే ఆమెను వేధిస్తూన్న ప్రశ్న. కానీ తనెలా అడగాలో తనకే తెలియదు. అయినా ఆ వూహను మాత్రం తప్పించుకోలేక పోతోంది. భోజనాలు అయినతర్వాత కూడా తులసికి శేషు కన్పించలేదు. విసుగేసి "వీడెప్పుడూ యింతే" అనుకుంది. ఆఫీసుకు బయలుదేరుతూంటే అరుగు మీద నుంచుని దూరంగా చూస్తున్న సత్యప్రసాద్ కన్పించాడు మెట్లు దిగుతూంటే.

"చూడండి" అన్నాడు.

ఆగి వెనక్కి చూసింది.

"వాడు పని వుందని పొద్దున్నే ఆఫీసుకు వెళ్ళాడు. యేం తోచకపోతే అక్కడికి రమ్మనమన్నాడు."

"అయితే యేమంటారూ? అనాలనుకుంది. "మీరు నాతో వస్తారా" అని అడగాలనుకుంది. రెంటికీ ధైర్యం చాలలేదు. లోపలినుంచి పమిటికొంగుకు చేతులు తుడుచుకుంటూ జానకి వచ్చింది."

"తులసీ, ఆఫీసుకేనా?"

"అవును... "

బావగారు కూడా ఆఫీసుకు వస్తారనుకుంటా" అంది.

"నాకేం అభ్యంతరంలేదు" అంది నిస్సంకోచంగా.

"యెక్కడో చెబితే_ నేను" అతను ఆగిపోయాడు.

"దారి తెలియదని కాదు. అనవసరంగా యిబ్బంది పడతారని" అంది జానకి.

"అయితే పదండి" అన్నాడు సత్యప్రసాద్ మరేమనకుండా. యిద్దరూ నడవడం మొదలుపెట్టారు మౌనంగా. ఆమెకు కొత్తగా వుంది' పరాయి మగవాడి పక్కన నడుస్తూంటే యిదే బెరుకు, తను మొదటి రోజు కాలేజీకి వెడుతున్నప్పుడు, మొట్టమొదటిసారి ఆఫీసులో కూర్చున్న సమయంలో కలిగింది. స్త్రీత్వం అంటే యిదే కాబోలు అనుకుంది. చిన్నగా నవ్వొచ్చింది.

"మీరెంత కాలంనుంచి వుద్యోగం చేస్తున్నారు."

చెప్పింది నెలలతో కలిపి.

"యింతా చేస్తారా?"

"చెయ్యాలనే వుంది - కొంత కాలం" అని "మీరెక్కడ పనిచేసేది."

"చాలాచోట్ల పనిచేశాను. ప్రస్తుతం దుర్గపూర్‌లో".

'చాలా దూరం' అనుకుంది మనసులో. అదే అంది బయటకు.

"అవును చాలా నాటికి దూరం అయ్యాను" అన్నాడు చటుక్కున. తనలో మాట్లాడుతోన్నట్టుగా కాకుండా స్వగతం లాంటి ఆ మాటను తులసి అతని వైపు ఆశ్చర్యంగా చూసింది. అతను యేదో భావాన్నుంచి తప్పుకుంటోన్నట్టు కన్పించాడు.

"మరి వాళ్ళెవరైనా వున్నారా."

"చాలామంది వున్నారు"

కొద్దిగా కాలక్షేపం అవుతుందేమో"

"యేం లేదండీ వాళ్ళెక్కువ కలవరు. కలిసినా తాత్కాలికమే. అయినా నాలోపమేమిటో నేను చాలా మందికి నచ్చను."

అతని మాటల్లో యేదో దాగనిబాధ యెంతగా ఆపుకున్నా వూట బావిలో నీరులా చిమ్ముకున్నట్టు పసిగట్టింది తులసి.

"యిదే మా ఫ్యాక్టరీ" అంటూ లోపలకు తీసుకువెళ్ళింది.

మెట్లెక్కి వస్తున్న అన్నగార్నికల సిసీ చూసి కైలాసరావు యెదురు వచ్చి రిసీవ్ చేసుకున్నాడు. "వస్తానండీ" అని చెప్పి తులసి తన సీటు వైపు వెళ్ళిపోయింది. కైలాసరావు అన్నగార్ని మిత్రులకు పరిచయం చేశాడు.

• • •

ఆఫీసు గడియారం ఐదుగంటలు కొట్టింది. కైలాసరావు తులసి సీటు దగ్గరకు వెళ్ళి

"పదండి వెళ్ళిపోదాం టైమయ్యింది" అన్నాడు.

"మరి" అంది సందేహంగా.

"అన్నగారు ఫ్యాక్టరీలో మిషనరీ చూస్తున్నాడు. అటునుంచి వస్తాడు" అన్నాడు. యింతలో సత్యప్రసాద్ వచ్చాడు. ముగ్గురూ బయటకు రాగానే "యీ రోజు విశేషమేమిటో మీకు తెలుసా' అంది తులసి....

"యేమిటట"

"నన్ను వచ్చేనెల్లో ట్రెయినింగ్‌కు విజయనగరం ఫ్యాక్టరీకి ట్రాన్స్‌ఫర్ చేస్తూ అందుకు యిష్టపడితే వుద్యోగం పెర్మనెంట్ చేస్తామన్నారు"....

"ఏం బాగాలేదా విశేషం" అన్నాడు కైలాసరావు.

"నేను ఉద్యోగం చెయ్యడం మా ఆయనకు యిష్టం లేదండీ" అంది సత్యప్రసాద్‌తో కంప్లయింట్ చేస్తూ.

కైలాసరావు నవ్వుతూనే "నిజమే" అన్నాడు

"మరేం చెయ్యమంటారేమిటి" అంది తిరిగి తులసి

"నాకీ వుండేకంటే ఉద్యోగం చెయ్యడంలోనే సుఖం కన్పిస్తోంది. ఎన్నో




అనుకుంటాం. యేదీ జరగదు. కానీ వొక్కొక్కసారి అనుకోనివే జరుగుతాయి. దానికి తలొగ్గడమే మంచిదనుకుంటే బ్రతుకు బాగుపడుతుందేమో?"

"అంటే ఇందులో "స్ట్రగుల్ ఫర్ యెగ్జిస్టెన్స్" అనే సెన్స్ లేదన్నమాట"

సత్యప్రసాద్ నిమ్మదిగా "అదేం కాదు. ఇక్కడ కూడా 'చోటు'కోసం ప్రయత్నం అనేది వుంది దాని వెనుక అసలు పోరాటం గుంభనగా దాగి వుంటుంది .."

తులసి నిశితంగా చూసింది.

"కాఫీతాగాలనివుంటే యిదే ఉడిపీ హోటల్ మొహమాటపడితే అడుగు ముందుకు పోతాం. ఆలోచించుకోండి"

"మేం వెనక్కి రాం" అడుగు ముందుకు వేసింది తులసి

"పదండి అన్నయ్యా"

"ఆ వడతోపాటే" అన్నాడు. ఆ తరువాత యేమనుకున్నాడో సంతోష తరంగాల్ని ఆపుకుని ఆలోచించు

కుంటు ్డు. తననే చూస్తున్నతులసీ, తనలో తనునన్వకుంటున్న తమ్ముడూ కా మనుష్యుల్లా కన్పించారు

"నేను వెళ్ళిపోదామనుకుంటున్నా నురా"

"యెక్కడికి?"

"దుర్గపూర్."

"అప్పుడే యేంతొందర వచ్చిందని."

"నీకు తెలియదు. యీ ప్రయాణానికి ముందు "నేను" యివాళరోజు 'నా' మధ్య పెద్ద తేడా కన్పించడం లేదు. యిక్కడ మీరందరూ అలవాటు పడితే అక్కడికి వెళ్ళి బ్రతకడం కష్టం ..." అన్నాను.

తులసి అన్నదమ్ముల సంభాషణ వింటూ అచేతనంగా నడుస్తోంది.

"వెళ్ళడం జరగాల్సిందే కానీ ఆ మిషనరీ జీవితం యెంతకాలం?"

"నాజీవితం అంతే దాగు అనేది వుండదు"

"నీ జీ తం గురించి మాకు లుసు. మన గురించి మన చుట్టూతా జనం కూడా ఆలోచిస్తూ వుంటారని గుర్తుంచుకోవాలి"

ఆ మాట సత్యప్రసాద్‌కు ఘాటుగా తగిలింది తన గురించి తమ్ముడు యెందుకంత తీవ్రంగా మాట్లాడాడో వూహించుకుంటే సిగ్గనిపించింది. తనలో దాగిన హస్యాలు లేక. తన జీవితంలోకి తొంగిచూసే అవకాశం మరొకరికి యివ్వాలంటే గుండె యెందుకో వేగంగా కొట్టుకుంటుంది. నిమ్మదిగా అన్నాడు "నాలో చీకటి నీకు తెలియదురా" అని. తులసీ, కైలాసరావు వొకరి వొకరు చూసుకున్నారు. యింతలో యిల్లు దగ్గరవడంతో ముగ్గురూ మౌనంగా వుండిపోయారు. తులసి లోపలికి వెళ్ళేసరికి తల్లి యెవరితోనో అంటున్నమాటలు విన్పించాయి "మా అమ్మాయికి పెళ్ళివారొచ్చారుగా మొన్న — అదీ" అంటూ తులసి వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్ళు తాగుతున్న తులసిని చూసి "గోపాలరావుగారు తిరిగి వుత్తరం వ్రాశారే. వారి అమ్మాయిని చూసుకందుకు రమ్మనమని "

"వుహూ" అంది నిమ్మదిగా తులసి.

"నాన్నగారు వచ్చే దశమినాడు వెడదామంటున్నారు"

"వాడు "

"వాడేమంటాడు. వద్దంటాడా యేమిటి?" అంది ఆశ్చర్యంగా

"యిష్టంలేకపోతే అనొచ్చు" అంది కరుగ్గా. అవతలి గదిలో వున్న శేషుకు వినబడాలన్నట్టు.

"వాడి కెందుకు యిష్టంలేకపోవాలి. శుభకార్యాలు తోసుకు వస్తూంటే నీ మాటలేమిటో నా కర్థంకాదు. అతి తెలివా అని" అంది మందలింపుగా ఆవిడ

తులసికి ఆవేశం ఆగిందికాదు.

"యీ ప్రయత్నాలన్నీ మీరు నా

గురించి చేస్తున్నారు. వద్దు" అనాలనుకుంది. అరవాలనుకుంది. కానీ యేం చెయ్యలేక తన గదిలోకి వెళ్ళిపోయింది.

రాత్రి లలితమ్మగారు, భుజంగరావుగారికి అన్నం వడ్డిస్తోంది, ఆయన తింటూ "నువ్వేమంటావు" అన్నాడు.

ఆవిడ విసుగ్గా అంది .... "పొరాలన్నీ పట్టించుకోలేను. నేను లక్షణంగా చూసి స్థిరపరుచుకుంటే అన్నీ వాడారికి వస్తాయి ."

"వాడేమంటాడు"

యేమీ అనడు యిలా చేద్దామని మనకే వో నిర్ణయంఅంటూ లేనప్పుడు వాడికేం తెలుసు " అంది తమదే తుది నిర్ణయం అన్నట్టుగా.

"అయితే సరే" భుజంగరావు కంచంలో చెయ్యి కడుక్కుని లేచి వెళ్ళాడు .

లలితమ్మగారు క్షణం భర్తవైపు చూసి - తిరిగి" వోసే తులసీ భోజనానికి రండి" అని కేకేసింది....

తులసివచ్చి మౌనంగా పీటలు వాలుస్తూంటే "వాడ్నిపిలు" అంది.

తులసి పిలుపు అందుకోకుండానే శేష వచ్చాడు వంటింట్లోకి.

నిశ్శబ్దంగానే వడ్డన అయింది నిముషం ఆలోచించి లలితమ్మగారు అంది ."శేషూ దశమినాడు బాగుందిట .నాన్నగారు చెప్పమన్నారు నీతో"

తులసి తమ్ముడేం జవాబు చెబుతాడా అని యెదురు చూస్తోంది.

"మాట్లాడవేంరా ?"

"మీ యిష్టం" అన్నాడు శేష కంచంలోకి చూస్తూ.

లలితమ్మగారు నవ్వుతూ "పితృదేవతలు తరింపారు" అంది.

తులసి వెంటనే "నీ యిష్టమో మరి అంది శేషుని చూస్తూ."

"అంటే" అన్నాడు అర్థంకానట్టు.

"అదేమిటే" అంది కసురుతూ తల్లి "

"నా గురించి యెవరూ యిష్టంలేని పన్లు చెయ్యనక్కర్లేదు " కటువుగానే అంది.

"నీ కేమన్నా పిచ్చెక్కిందేమిటే" ఆవిడ అంటోంది.

"అవునమ్మా. యెవరిదారివాళ్ళు సరిచూసుకుంటే చాలు. వాడి కట్నం డబ్బుతో నా పెళ్ళి జరగనక్కర్లేదు. అందుకోసం వాడు యిష్టంలేని...."

"వాసేవ్ తులసీ తులసీ"

"యిలా చేసి మీ కర్తవ్యం నిర్వహించుకున్నా దాని మూలంగా నాబాధ పరిష్కారం అవదు పైగా నేను "

శేష అచేతనంగా వింటున్నాడు. తల తిరుగుతోన్నట్టుగా వుంది.

"నేను విజయనగరం వెళతానమ్మా. ఉద్యోగం పెర్మనెంట్ కూడా అవుతుంది" అంది అర్థిస్తూ.

"ఆ" అంది లలితమ్మగారు. అన్నీ కలలో జరుగుతోన్నట్టుగా వున్నాయి ఆవిడకు.

"అవును ... నాన్నగారితో కూడా చెబుతాను"

లలితమ్మగారు వాస్తవంలోకి వచ్చి "యిదేం పిచ్చే నీకు. మీరంతా కలిసి వన్నా" యేవో మననం చేస్తుం డోంది. ఆవిడకే తెలియకుండా కళ్ళంట కన్నీరు రగిలింది పొంగింది

• • •



# 25

ఎన్ని విధాల ఆలోచించినా తులసికి తను ఉద్యోగం పేర విజయనగరం వెళ్ళడం వొకటే మంచి పనిగా కనిపించింది. ఆ ఆలోచన తాత్కాలిక శాంతి నిచ్చింది "యేమైనా వెడతాను" అనుకుంది.

అందుకే తన వుద్దేశాన్ని జానకితో కైలాసరావుతో చెప్పింది

"అసలు యీవుద్యోగం చెయ్యక పోతే మీకేం నష్టం?" అని ప్రశ్నించాడు కైలాసరావు. జానకి భర్త మాటను సమర్థిస్తోన్నట్టుగా చూసింది.

"నాకు ప్రత్యేకించి నష్టంలేదు .. కానీ "

"చెప్పు, తులసీ"

తులసి అన్ని రోజులుగా తనలో కరడు కట్టిన కన్నీటి కథను విప్పి చెప్పక తప్పలేదు చెప్పి ఆఖర్న అంది శేఖు ఆ అమ్మాయిని మోసగిస్తాడనికాదు నబాధ ఆ అమ్మాయి వీడిమీద ఆశలు పెట్టుకుందే మోనని నా వుద్దేశ్యం ఒకవేళ నా వూహలన్నీ తప్పైనా కావచ్చు యిదీ నా పరిస్థితి ... యింతకుమించి మరేం చెయ్యను "

'యేమీ అనుకోకపోతే ఒకమాట"

"చెప్పండి. అనుకునేదేముంది"

"చెప్పాలంటే మీకుమనస్ఫూర్తిగా

యీ వుద్యోగం అంటే యిష్టంలేదు. శేషు సాధించడంకోసం - యిదే ...యం - నిర్ణయం అనుకుంటు న్నాను. పైగా మీరు యింటికి యేనా డయినా ఓ...మస్తే అదిమాత్రంమన్పిపో కండి శేషు పెళ్ళితో మీ వివాహం కూడా పూర్తి చెయ్యవచ్చునే వూహ వాళ్ళకు ఆనందాన్నిస్తుంది. వారికి మీ స్వంత సమస్యలతో సంబంధం లేదు చెప్పండి, వాళ్ళ వుద్దేశ్యం తప్పు అనగలరా ?"

"వాడి [illegible]త్యాగం మాట"

"అంతకుమించి మరోదారిలేక పోనీ మీ బ్రతుక్కి మీరేం చేసుకో గలరు. మనిషి యెన్నో మానసిక అశాంతాలు యెదుర్కొన్న తర్వాతే త్యాగం చెయ్యడానికి ముందుకు వస్తాడు కానీ మీరు యేం ఆలోచించ కుండా 'స్వార్థత్యాగం' అని యీజీగా తేల్చేశారు."

"అది గొప్పా యేమిటి ?" అన్నాడు పేపర్లోంచి తలెత్తి సత్యప్రసాద్

"గొప్ప అనడంలేదు మన ఎత్తు పల్లాలు మనకు తెలిసినప్పుడు బాధ పడ్డం తెలివి తక్కువ అంటాను నేను. మనసీ, చాలామందిసీ, సమ స్యలు మరో జన్మలోతప్ప తీరవు ... దానికి విధిని తిట్టుకోడం తప్పు. అస మర్థతని దాచి పెట్టుకుని బ్రతకాల్సిన వాడు అలాంటి వాళ్ళు సుఖపడలేరు. అన్నయ్యా" అన్నాడు

సత్యప్రసాద్. తులసీ కూడా మాట్లాడలేదు .... తులసి యింట్లోకి, సత్యప్రసాద్ వీధిలోకి వెళ్ళిపోయారు.

జానకి నిమ్మదిగా "ఆయన బాధ పడ్డారేమో" అంది.

కైలాసరావు ఆలోచిస్తున్నాడు. . అన్నగారు వచ్చేముందు. తను వుత్తరం వ్రాసినరోజు కళ్ళముందు తళుక్కున మెరిసి మాయమయ్యింది. జానకివేపు చూసి "జానకీ" అన్నాడు.

"యేం" అంది.

"ఓ చిన్న మాట" అని చెప్ప సాగాడు. జానకి వినసాగింది.

ఆశ్చర్యపడింది . ఆ తరువాత భర్త తెలివిని మెచ్చుకుంది.

యిద్దరూ కలిసి నవ్వుకున్నారు కొన్ని క్షణాలు గుండెల నిండుగా.

• • •

శేషు కైలాసరావు అడిగిన చాలా ప్రశ్నలకు సమాధానం యివ్వలేక పోయాడు చెప్పిన అన్నిగతం గాయం చేస్తూనే వుంది.

"అక్కయ్య గురించి త్యాగం చెయ్యాలనుకున్నాను, నిజమే ఆ భావం నాకు నిరాశవల్ల కలిగిందో నా విద్యార్థిత్వం మూలంగా శరీరంలోని జ్వాలో నాకు తెలియదు యీరోజున నాకు యెలాగూ కలలులేవు వున్నా - వాటి రంగులు చాలావరకు తేలి పోయాయి.

" కైలాసరావు నవ్వుతూ అన్నాడు. "సెల్ఫ్ సేక్రిఫైస్" అనేది ఇష్ట

మైన తియుందారం లాంటిది — ప్రతీ మనిషీ దాన్ని రుచి చూడాలనే కోరు కుంటాడు — అది అనుభవించడంలో ఓ గ్లామర్ వుంటుందనే అపోహే దానికి కారణం.. "

"మరేం చెయ్యను యేదో రిలీఫ్ కావాలిగా మనిషికి"

"అది తుది వరకూ బలవత్తరంగా నిలుస్తుందా" అని.

"నాలో ఆ శక్తి వుందో లేదో నాకు తెలియదు ... యిక అక్కయ్య గురించి "

"తులసి గురించి నువ్వేం బాధ పడనవసరంలేదు" అని తన మనసులో వున్న వుద్దేశాన్ని శేషుతో చెప్పాడు. శేషు కైలాసరావు వైపు మంత్రించినట్టు చూకసాగాడు. పరిచయంలేని వ్యక్తి పలకరించి మేలు చేస్తోన్నప్పుడు కలిగే విస్మయం కళ్ళలో తేలింది .. భుజంగరావుగారు లోపలినుంచి వచ్చి .

"యేమిటోయ్, విశేషాలు " అన్నారు.

అంతవరకూ శేషునుంచి విప్పి చెప్పగల్గిన కైలాసరావు భుజంగరావు గారినిచూసి మనసులో వుద్దేశాన్ని యెలా మాట్లాడాలో తెలియక, వయసు అడ్డుతెరలు దించుతూంటే అలాగే వుండిపోయాడు-క్షణం. ఆ తరువాత అన్నాడు.

"మీరు క్షమిసానంటే ఒకమాట అడగాలని వుందండీ"

"అడగవోయ్"అన్నారు నవ్వుతూ.

"మేనాదినుంచి మీ యింట్లోవున్న మూలంగా నేనూ మీ కుటుం ఒకడినయ్యానని నా వుద్దేశం. ఆ వుద్దేశంతోనే అడుగు తున్నాను. యీ అనుబంధంతో చూసు కుంటే మీ సమస్యలు కొన్ని నా సమస్యలు అయ్యాయి . మీకూ నాకూ వయసులో తేడా వుంది ...కానీ బాధలు అనుభవించడానికి వయసు అడ్డురాదను కుంటాను " క్షణం ఆగాడు - తిరిగి పాఠం అప్పచెప్తున్న విద్యార్థి అయ్యాడు.

"మా అన్నయ్య గురించి మీకు చెప్పాలని వుంది" అని మొదలుపెట్టి చెప్పాడు ఆఖర్ని అన్నాడు.

"మీ తులసి పెళ్ళి గురించి - మీ ఆలోచన్ల బరువు నాకు తెలుసు-ఎంతో కాలం తరువాత అన్నయ్య నాయింటికి వచ్చాడు - అతన్ని తిరిగి నా వాడిగా చేసుకోవాలంటే. తులసి తప్ప మరెవ్వరూ కన్పించడంలేదు — "

భుజంగరావు నిశ్చేష్టుడై వింటు న్నాడు.

"అటు ఆకపిల్ల తండ్రిగా మీరెంత బాధపడుతున్నారో - యిల్లూ వాకిలీ లేనివాడిని. బ్రతుకు నేర్చుకుంచి, విగతజీవిగా వేస్తే యేం చెయ్యలేని తమ్ముడిగా నేనూ అంతకు మించి పడుతున్నాను - నా కెవరూ లేరు. అనని కష్టంతో నేనీరోజు సుఖాన్ని,



శం తో షా స్నీ సృష్టించుకున్నాను - అలాంటిది —"

జానకి అంది - మా కెవరూ లేరు — మేం చిన్నవాళ్ళమయి కూడా పెద్ద వారిలా మీతో మాట్లాడ వల్సి వచ్చినందుకు "

"అదేం లేదమ్మా "

అంతవరకూ వాకిట్లో జరుగుతున్న మాటలు లోపలినుంచి లలితమ్మగారూ, పడగ్గదిలోంచి తులసీ వింటూనే వున్నారు.

తులసికి యిదంతా చాలా కొత్తగా వుంది. మనసు యెక్కడికో పారి పోయినట్టు - గుండె శబ్దం మరీ కొత్తగానూ విన్పించసాగింది. ఆలోచనలు ఆగిపోయాయి. నిశ్చల నది అయ్యింది తులసి.

"దాని కిష్టమయితేనా దేంలేదు "

జానకి లలితమ్మగారి దగ్గరకు వెళ్ళి "యేమండీ పిన్నిగారూ" అంది. లలితమ్మ గారికి అందులో కానిదేం కష్టం చలేదు యిన్నాళ్ళూ జూలుగా కూతురి పెళ్ళి గురించి ఆలోచించి అదెలా జరుగుతుందనే ప్రశ్నకు జవాబు కన్పించక భయపడింది తప్ప. నిర్ధారణ వాకిడి యెటువంటిదో ఆ క్షణాన్నే తెలుసుకుంది. మనిషి దూది పింజ అయ్యింది "అదేమిటి జానకి

యిందులో నాదేంవుంది" అంది తన్మయత్వంతో.

"తులసి నామాట కాదనదు. మనసులో మాట దాచిపెట్టదు, నేనే అడుగుతాను" అంది.

అవతలి గదిలోంచి అదంతా విన్న తులసి మరోదారి కన్పించక దొడ్డిలోకి వెళ్ళి నూతి చప్టాలో కూర్చుని పరగ కాస్తున్న వెన్నెల్ని, తేటగా మెరుస్తున్న నక్షత్రాల్ని చూస్తూ వుండిపోయింది.... శరీరం పూర్వంలా బరువుగా కాక తేలికగా, మెదడు చిత్తుగా కాక మెత్తగా పూబంతిలా విచ్చిన పుష్పం అవుతూంటే అతి నిశ్చలంగా వుండిపోయింది.

తులసి కోసం యిల్లంతా వెదికి దొడ్లో నూతి చప్టాలో కన్పిస్తే జానకి మౌనంగా నవ్వుకుని నిమ్మదిగా వెళ్ళి తులసి భుజంమీద చెయ్యివేసి "తులసీ" అంది.

తులసి సిగ్గుపడింది.... లజ్జాజనితం అయిన హృది మాటల్ని బంధిస్తే జానకి చేతకోసం వెదుకుతూ వుండిపోయింది.

• • •

...."యీ వుత్తరం నీకు కొంత మానసిక విశ్రాంతి యివ్వొచ్చు. ప్రపంచంలో, సంఘంలో మనజాతుల్లో యెవరి బతుకుల్లో కూడా మల్లె పొదలు వుండవనీ కొన్ని ముళ్ళ పువ్వులు, అవీ వాసనలేనివి పెంచుకోవల్సివస్తుందంటే నేను నమ్మేవాణ్ణి కాను ...నువ్వు వెళ్ళిన తరువాత కేశవమూర్తిని కల్సుకున్నాను. అతను తన ద్వారా నీకు యెదురయిన విషానుభవాలకు కన్నీరు పెట్టుకున్నాడు. నువ్వు కల్సుకోని కారణం చెబితే మాన్పడిపోయాడు.... రెండు రోజుల తరువాత సుందర్రావు విశాఖపట్టణం నుంచి వచ్చాడు, నేనూ కేశవమూర్తీ అతన్ని కల్సుకున్నాం. నాకు ఆవేశం కల్గింది. ఆ ఆవేశంలోనే నానా తిట్లూ తిట్టాను. జరిగిందానికి అతను సిగ్గుపడ్డాడు. ఆవేశంలో తను జరిపిన ఘాతకం తల్చుకుందుకే సిగ్గుపడ్డట్టు కన్పించాడు. నిన్ను వచ్చేటప్పుడు పిఠాపురంలో కల్సుకోవాలని అనుకున్నా అవమానం చేత ఆగిపోయాట్ట.

చదువుకునే రోజుల్లో మనం ఎదుర్కొన్న సమస్యలు తల్చుకుంటే అవి జీవితాల మీద ప్రసరింప జేసిన వెలుగు నీడల కొలతలు చూస్తూంటే విస్మయంతోపాటు భయంకూడా కల్గుతోంది

మేం ముగ్గురం రాజశేఖరంగారిని కల్సుకుందుకు వెళ్ళాం. కానీ ఆయన రాజ్యలక్ష్మినీ. కుమారినీ తీసుకుని వారి అన్నగారి వూరు నాగార్జునసాగర్ వెళ్ళారట. తిరిగి కల్సుకుంటాం. యెందుకని ఆలోచించకు. జరిగిందానికి చింతించి భవిష్యత్ పాడుచేసుకోవడం తప్పిదం అవుతుంది... రాజశేఖరంగారిని మేం ఆకర్షించగలం. కాదు, ఆయన లోనీ స్థానాన్ని తిరిగి పునః ప్రవేశం చేయించగలం అన్పిస్తోంది.

ఆలోచించకుండా ఆవేశపూరిత నిర్ణయాలు తీసుకోకు....గోవిందరావు..."

ఉత్తరం చదవడం ముగిసినా శేషు హృదయం ఆనందం చిందించుకోలేక పోయింది....గోవిందరావు వ్రాసినట్టు రాజశేఖరంగారిలో తనపట్ల సుహృద్భావం యేర్పడుతుందనుకోవాలంటే. అది నట్టి వూహానే తోస్తోంది.

కాలం వూపే వుయ్యాలలోంచి తను కళ్ళు తిరిగి క్రిందపడ్డాడు. కాలం వడుగులో వెనకపడిన అభాగ్యుడు తను. ముందుకు పోయిన మనుష్యులు వెనక్కి తిరిగి తనవైపు వోదార్పుగా చూసినా కోరుకునే వోదార్పు దూరం కాలేదా?? యెటూ రాజ్యలక్ష్మికి తను దగ్గరకాలేడు తన యింటి పరిస్థితులు మారి తులసి బ్రతుకు సుఖాంతమైనా తనూ, తన దారీ అన్నీ చిందరవందర అయ్యాయి. దారి తప్పిన ప్రయాణీకుడు తను. శ్రుతి తప్పిన రాగం తన బ్రతుకు.

'శేషూ' అని పిల్చాడు, భుజంగరావు వాకిట్లోంచి.

శేషు ఆలోచనసుంచి తప్పుకుని లేచివెళ్ళాడు.

"రామారావు వుత్తరం, శుభలేఖా పంపించాడు.... మర్నపెళ్ళిట యెల్లుండి" అన్నాడు.

లలితమ్మగారు వచ్చింది....ఆ వెనుక తులసి వచ్చింది. తులసి తండ్రి చేతిలో శుభలేఖ అందుకుని చదివింది... చదువు తూన్నంతసేపూ కళ్ళముందు, దుర్గ పెళ్ళి కూతురిలా అలంకరించుకుని కన్పించసాగింది. కానీ ఆ కళ్ళల్లో కాంతిలేదు. వి హెంపట్ల సుముఖతా, ఆనందం లేవు.

'పాపం రెండో పెళ్ళి సంబంధం కాబోలు" అంది లలితమ్మగారు.

తులసి అప్రయత్నంగా శేషు మొహంలోకి చూసింది.

శేషు తను వూహించంది, అదీ భయంకరమైనది చూస్తోన్నట్టుగా నిం బడి పోయాడు....దర యీ విధంగా రెండో పెళ్ళి వాడికి భార్యకా డానికి కారణం నేనా?? తను తిరస్కరించ నట్టయితే దుర్గ జీతం. భవిష్యత్ బాగుండేదేమో ...దుర్గని బాధపెట్టి నందుకే తనూ యిలా వ్యధ చెందు తున్నాడా!?

దుర్గా తనూ రాకేముడిలో వున్నటూ, ఆ ముడి నుంచి తను సుఖపడ్డంకోసం విడిపోయి. దుర్గని ఆ బ్రహ్మ ముడిలోకి తనే గెంటినట్టు అనుకో సాగాడు."

"మనం పెళ్ళికి వెళ్ళాలి—లేకపోతే బాగుండదు—" అంది లలితమ్మ

"వెడితే రేపే బయలుదేరాలి."

"తులసీ నువ్వు ఆఫీసుకు శెలవు పెట్టాలేమో, చూసుకో" అంది.

"నేనెందుకమ్మా" అంది తులసి, దుర్గని యెలా చూడాలో తెలియక.

"అదేమిటే, బాగుంటుందేమిటి" అంది లలితమ్మగారు.

"మరి శేషో" అన్నాడు భుజంగ రావు.

"వాడు దేనికిలెండి" అంది లలి తమ్మగారు.

శేషు తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆలోచనలో సతమతమవుతూ.

తులసి వెళ్ళి జానకితో చెప్పింది.

"మా పర్మిషన్ యిప్పటి నుంచీ తీసుకోనక్కరలేదులే" అంది జానకి.

"నాకు కోపం వస్తుంది అలా అంటే" బుంగమూతి పెట్టింది.

"అవునా బాబూ" అంది, వుయ్యాల్లో దొండకాయ కొరుకుతున్న బాబుని చూసి.

"వాడితో కాదు, అక్కడ వున్నారు.. ఆయనతో చెప్పివెళ్ళు" అంది తులసి కైలాసరావుతో చెప్పాలని డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళింది.

అక్కడ సత్యప్రసాద్ కనిపిం చాడు....ఆమెకు క్షణం తను కొత్తగా అతను మరీ వింతగా కన్పించాడు.

"బావగారులేరా" అంది....

"వూహూ" అన్నాడు గడియారం బాగు చేస్తూ సత్యప్రసాద్.

"ఆగిపోయిన కాలాన్ని తిరిగి ముందుకు తీసుకు వెళ్ళాలనా"

"వెడుతుందంటారా...."

"యెందుకు వెళ్ళదు?"

"యెలా. యీ గడియారం బాగు పడవచ్చు. కానీ వెనుకబడిన కాలాన్ని పోగొట్టుకున్నట్టే కదా?

"కొంత పోగొట్టుకున్నా ఆ తరు వాత పొందినవాటితో యీ నష్టాన్ని మర్చిపోవచ్చుగా"

"నాకు నమ్మకంలేదు"

"నాకు నమ్మకం వుంది"

"అయితే మీరు భవిష్యత్‌లో సుఖపడతారు"

"మీరు....?"

"లాభ నష్టాల బేరీజులో నలిగి పోతాను"

"అలా వీలుకాదు...."

"మీరే నా భవిష్యత్‌కు నిర్ణేత లేమిటి?"

"కాకూడదా" అంది. అన్న తరు వాత ఆశ్చర్యం కల్గింది. తనలో యే శక్తి ఆ మాట అన్పించిందో తల్చుకుని సిగ్గుపడింది.

అందుకే యేదో చెప్పాలని "మీరు" అంది.

"నేను...."

ఆమె చెప్పాలనుకున్నది చెప్పలేక "విజయవాడ వెడుతున్నాను. రెండు రోజుల్లో వచ్చేస్తాను...." అంది.

"మీ లీవ్ లెటర్ నాకిస్తున్నారా" అన్నాడు నవ్వుతూ.

"కైలాసరావుగారితో చెప్పండి"

---

[illegible]



"అలాగే....కానీ" ఆ మాటతో ఆమె కాళ్ళకు బంధం పడింది.

"ట్రయినింగ్‌కు వెడతామన్నారుగా...."

"మానేశాను...."

"యేం ?"

"కాలం"

"అబ్బ మీరు చాలా అదృష్టవంతులండీ....యిట్టే నిర్ణయాలు మార్చుకుని మరో నిర్ణయంలో పసివాళ్ళలా యిమిడిపోగల్గుతారు...."

"నన్ను మెచ్చుకున్న మొదటి వ్యక్తి మీరే" అంది ఛటుక్కున.

"ఆహా .... మెచ్చుకోవడం కాదు...."

అప్పుడే కైలాసరావు వస్తూ "యేమిటో రహస్యాలు మాట్లాడుకుంటున్నారే" అన్నాడు.

సత్యప్రసాద్ తటపటాయించి "యేం లేదు, మామూలు విషయాలే" అన్నాడు... తులసి అంతా చెప్పింది.

"మరి త్వరగా వచ్చెయ్యండి .... మీరు లేకపోతే మాకు తోచదు. ముఖ్యంగా అన్నయ్యకు మీరు చక్కని కాలక్షేపం...."

తులసి సిగ్గుపడి తలవొంచుకుంది. సత్యప్రసాద్ తికమకగా చూశాడు.

"వెడతాను" అంది యెవరితోనూ కాకుండా

"తప్పు, వెళ్ళొస్తాను అనాలట. అవునా అన్నయ్యా" అడిగాడు కైలాసరావు.

"వెళ్ళండి" అన్నాడు. యాథాలాపంగా సత్యప్రసాద్.

"అదీ తప్పే ...వెళ్ళిరండి అనాలి అన్నయ్యా. అలా దీవించు" అన్నాడు నవ్వేస్తూ కైలాసరావు.

తులసి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది....సత్యప్రసాద్ దూరంగా చూస్తున్నాడు.

(సశేషం)

# నిర్వచనోత్తర రఘురామాయణం

సాహిత్యం : కేవలం యాభై ఆరు అక్షరాలతో చేసే మేజిక్.

ప్రేమ : ఏ స్టెతస్కోపుకీ అందని, ఏ సూది మందుకీ తగ్గని వింత జబ్బు.

డబ్బు : ఆహ్వానించబడిన కష్టాలు.

అత్తగారు : భార్యా భర్తల మధ్య తగాదాలలో ఒక రంపే అభిమానంకల రిఫరీ మరియు ప్రేక్షకి.

సమ్మె : బస్సులమీద రాళ్లువేసి ఆ పైన వాటిని తగులబెట్టే ఆసక్తికరమయిన ఆట లేక,
తను కూర్చున్న చెట్టుకొమ్మని తనే నరుక్కోవటం.

డాక్టర్ : కళ్లు పేషెంటు జేబుమీద, మనసు అందులోని పర్సుమీద. ఆలోచనలు దానిలోని డబ్బుమీద. చెయ్యి మాత్రం నాడిమీద వుంచగలిగే ఒకరకం అష్టావధాని.

— కె. రఘురామం.

# సుబ్రమణ్యం

## కె. రాధాకృష్ణమూర్తి

త్తన పెళ్ళాం మొదటి కాన్పుకు పుట్టింటికి వెళ్ళిన రోజుల్లో పట్టణంలో కాపురముండే భర్త ఒంటరితనంలో పడే అగచాట్లు అనుభవించిన వాళ్ళకు, పైన పరమాత్మకు తప్ప మరెవ్వరికీ అర్థం కానటువంటాయి — రాత్రులు అలవాటు ప్రకారం చాచిన చేతికి పరిచిన దేహం అందనప్పటి దిగులు. ఉదయాన ఆలస్యంగా లేచి ఆఫీసుకు టయిమయిందన్న ఆదుర్దాలో స్టవ్ వెలిగించి చేతులు కాల్చుకున్నప్పటి కోపంలో విసురు. కాలక్షేపానికి సినిమాహాలులో కూర్చున్నప్పటి సమయాన కూడా ప్రసవం విజయమై భార్యాబిడ్డల ఆరోగ్యం మీద బెంగతో కూడుకున్న ఆలోచనలు. శలవు దినాల్లో - ఇంట్లో - యుగలాంటి క్షణాల్లో ఈసులాడటంలోని తోచకపోవటం — వీటిని "అగోనీ" ల క్రింద లెక్క వేయొచ్చు.

అలాంటి రోజులో ఓ ఆదివారం మధ్యాహ్నం నేను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న సమయాన సుబ్రమణ్యం చెమటలు కక్కుకుంటూ నా గదికి వచ్చాడు. ఉస్సూరుమంటూ కుర్చీలో కూలబడి, "మంచినీళ్ళు" అన్నాడు. అతని భారీ శరీరాన్ని చూసి ఎండల ప్రభావాన్ని తెల్సుకుంటూ లేచి నీళ్ళిచ్చాను. అంత పెద్ద గ్లాసుడూ గడగడ త్రాగేసి ఇంకా నీళ్ళివ్వమన్నాడు.

నేననుకున్నట్లు ఎండల ప్రభావం కాదు, ఏదో ఉంది. వాడి మొహమంతా పీక్కుపోయి, ఏ నాలుగు రోజులనాడు షేవ్ చేసుకున్నాడో గడ్డం సన్నటి సూదిముక్కల్లా పెరిగి అసహ్యంగా కనిపిస్తోంది. కళ్ళల్లో విషాదంలాంటిదేదో ద్యోతకమవుతోంది. వారంనాడు నేను చూసిన వాడి రూపానికి, ఇప్పటి రూపానికీ చాలా తేడా ఉంది.

నిజానికి సుబ్రమణ్యానికి ఏ దిగులూ ఉండాల్సిన పనిలేదు. పరంధామయ్యగారికి అతను రెండో కొడుకు. ఆయనకున్న అంతటి ఆస్తికీ ఇద్దరు కొడుకులే వారసులు. కాబట్టి ఆర్థికమైన ఇబ్బంది అనుకోటానికి వీలులేదు. పోగా ఈ రోజుల్లో వాడిలాంటి యువకుల్ని అద్భుతంగా ఆకర్షిస్తున్న 'ప్రేమ' విషయంలో కూడా సుబ్రమణ్యం అదృష్టవంతుడే. శకుంతల, వాడు మంచి

స్నేహితులు. పార్కులో ప్రారంభమైన వాళ్ళ పరిచయం స్నేహంగా మారి శకుంతల దాదాపు ప్రతి దినమూ వాడి ఇంటికి వెళ్ళకుండా ఉండలేనంత ఆత్మీయంగా తయారైంది. ఏ అర్థరాత్రి సమయానో వాడు మా గదులకు వచ్చి మా నిద్రలు చెడగొట్టి శకుంతలతో తన పెళ్ళి శుభలేఖను చూపించినా ఆశ్చర్య పడనంతటి నమ్మకంలో ఉన్నాము మిత్ర బృందమంతా.

"అఫ్‌కోర్స్. ఆమెను నింకా అడగలేదనుకోండి; అయినా మీరు మట్టుకు ప్రజెంటేషన్లు అవీ రెడీ చేసుకుని ఉంచండి. ఈ మధ్యలో ఎప్పుడో మా అన్నయ్య పెళ్ళికూడ కుదురుతుంది. రెండు ముహూర్తాలు ఒకేసారి పెట్టించేట్టు చూస్తాను" అన్నాడు మొన్నోసారి మా అందరికీ అడ్వాన్సుగా చిన్న పార్టీ ఇస్తూ.

అయితే ఇంతలో ఏమొచ్చిందో నాకర్థం కాలేదు. మోచేతుల్ని టేబుల్ మీద ఆధారంగ మొహాన్ని అరచేతుల్లో దాచుకుని ఏదో కొంపలు మునిగి పోయినట్లు కూర్చున్న వాడి వేపు చూసి అన్నాను.

"ఏం జరిగింది ?"

సుబ్రహ్మణ్యం తల పైకెత్తాడు. వాడి మొహం పాలిపోయింది. కళ్ళల్లో నీళ్ళు నిలచి ఉండటం నాకాశ్చర్యాన్ని కలిగించింది. ఇప్పుడో ఇంకాసేపట్లోనో ఏడ్చేస్తాడేమో ననిపించింది.

"మీ నాన్న ఒప్పుకోలేదా ?"

"నా ఖర్మ !!" వాడు నుదురు బాదుకున్నాడు. "శకుంతల ఒప్పుకోలేదు."

అదిరిపడ్డాను. ఒక్క గెంతున కుర్చీ వెనక్కి జరిపి వాడి పక్కన నిలబడి భుజాలు పట్టుకుని కుదుపుతూ అడిగాను నమ్మలేక.

"నిజం ? ఎవరు చెప్పారు ?"

"తనే చెప్పింది. నేనంటే ఒట్టి స్నేహమేగాని పెళ్ళి విషయంగా ఎప్పుడూ ఆలోచించలేదట ..." వాడి కళ్ళనుండి ఒకో చుక్క గడ్డపు సూదుల్లా చెంపల మీదుగ జారిపోసాగాయి. వాడి చెంపలని చెంపలనటం కంటె బుగ్గలంటే బాగుంటుంది. పెదవులకు రెండు వేపులా మాంసపు ఇడ్లీలు అంటించినట్లు మొహమంతా గుండ్రం కనిపించని గుండ్రదనంలో.... అసలు మనిషే పొట్టి. బొద్దుగ చూడ్డానికి చిత్రంగ ఉంటాడు అలా అని మనిషి అందవికారి అని చెప్పటానికీ వీల్లేదు. మొహంలో కళ్ళు కూరుకుపోయినట్లు చిన్నవే అయినా అమాయికంగ చూస్తూ, పసివాడిలా మొహానికి ఏదో ఆకర్షణ కొట్టవచ్చేట్లు కనిపిస్తుంది. మంచివాళ్ళకు "పరవాలే. స్నేహం చెయ్యొచ్చు అనీ" మోసగాళ్ళకు "బలే. సులువుగా వలలో వేసుకోవచ్చు" అని అనిపింప జేస్తుంది వాడి మొహం.

ఇప్పటికే మిత్రులందరికీ శంకుత లని తన కాబోయే భార్యగా చెప్పు కున్నవాడు, ఆమెచేత నిరాకరించ బడ్డాడని తెలిసినప్పుడు వాళ్ళచేత ఎంత హాస్యాస్పదంగా చూడబడతాడో ఊహించుకుంటుంటే నాకు వాడిమీద జాలికలగ సాగింది. అదంతా ప్రజాభి ప్రాయం. అతను దాన్ని పట్టించు కోనంత కాలం ఏ ఇబ్బందీలేదు. కాని భగ్న హృదయుడుగ వాడి లోపలి బాధ సంగతి ఎవరు ఊహించ గలరు!?

"అసలు ఘోరం అదీకాదు", వాడి పిడికిలిలో నా చేతి నాలుగు వేళ్ళ ఎముకలూ విరిగిపోతాయనిపించింది. "అన్నయ్యను చేసుకుంటుందట."

షాక్ తిన్నాను. ఇది కలలోనైనా ఊహించని విషయం. బొమ్మలు గీసే బ్రహ్మం నా కళ్ళముందు కది లాడు. అను తమ్ముడిలా కాక సన్నగ, పొడుగ్గ ఉంటాడు.

మళ్ళీ లాక్కొని వాడి కేసే చూస్తున్నాను.

"ఈ విషయమై ఆమెను నిన్న కది లించాను." సుబ్రమణ్యం తనను తాను కూడదీసు కున్నాడు. దీనంగా ఉన్న వాడి మొహం చూడలేక బజం వేపు దృష్టి ఉంచి "ఊ" కొట్ట సాగాను.

"వింటూనే పెద్ద విడ్డూరంగా చూసి "నువ్వనేదేమిటి?" అన్నది. అర్థం కానట్లు. "అన్నయ్య పెళ్ళి కుదరగానే మన సంగతి నాన్నతో చెప్పనా అన్నాను మళ్ళీ. అప్పుడు నా వేపు ఎట్లా చూసిందో నీకేమని చెప్ప మరా!....వాకిట్లో కొచ్చిన బిచ్చగాడు బిక్షంకాక ఏ పెన్సిలో షర్టో అడిగితే మనం చూస్తామూ, అట్లా—

"నీకేమన్నా మతిపోయిందా. మీ అన్నయ్య నేను ఎప్పుడో నిశ్చయించు కున్నాము. నువ్వు నాకు మరిదివవు తావు అంది. ఆ మాటలు వింటూనే నా కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్టు అనిపించింది. మొదట నమ్మలేక పోయాను. కాని నమ్మక తప్పలేదు. కోపంతో "మరిన్నాళ్ళూ నన్నెందుకిలా ఆట లాడించావు?" అన్నాను. ఆమె నవ్వింది. నిజంగా నవ్విందిరా—"

నేను నమ్మటం లేదన్నట్లు చిత్ర మైన రీతిలో తల ఎగరేసి అన్నాడు. వాడి మాటలకి, ఫూల్‌లా తల కదిపిన ఆ తీరుకు ఇంకో సమయంలో అయి నట్లయితే నవ్వివుండేవాణ్ణి.

"అప్పుడు చెప్పుకొచ్చింది, మొదట్నుంచీ తను నాతో స్నేహాన్ని కలిపిందీ, ఇంటికి రావడం ప్రారం భించిందీ నామీద ఇంటరెస్టుతో కాక అన్నయ్యకోసమేనట. ఆ మాట లెంత బాధకలిగిస్తాయో ఆలోచించు. "మరి మొదటే అన్నయ్యతో స్నేహం కలపక మధ్యలో నన్నెం దుకిట్లా చేశావు" అన్నాను కోపం పట్ట లేక. అన్నయ్య గాంభీర్యం స్వభా వాల వల్ల తనకా సాహసం. అవ కాశములేక నన్ను ఆయుధంగా



పడుతున్నదట. రెండేళ్ళ క్రితం టవున్ హాలులో అన్నయ్య బొమ్మల ప్రదర్శనం చూపినప్పుడే ఎలాగైనా ఆయనతో స్నేహం చేయాలనిపించిందట. ఇంకేం నేనో వెర్రి వెధవను దొరికిఉంటాను_" కసిగా అన్నాడు.

"అది కాదురా. ఆమెమీద నాకా భావమున్నట్లు ఇంట్లో వాళ్ళకి తెలుసే. ఒకసారి అన్నయ్యకు కూడ వెళ్ళడించానీ సంగతి. ఒట్టిగా నవ్వి ఊరుకున్నాడు _ "సుబ్రమణ్యం కాసేపు ఆలోచిస్తున్నట్లు ఊరుకుని అన్నాడు.

"ఓరి దేవుడా _ అంటే నన్నో ఫూల్ కింద జమకట్టి నవ్వాడన్నమాట" రెండూ చేతుల్తో జుట్టు పీక్కున్నాడు.

"....వాళ్ళ పెళ్ళయితే ఇంక ఆ యింట్లో ఎట్లా ఉండగలనో అర్థం కావటంలేదు _ అందరం ఒకే ఇంట్లో_ అవతల గదినుండి వాళ్ళ సరసాలు. నవ్వులు వినిపిస్తుంటే _"

హఠాత్తుగా వాడు మాటలాపేసి ఊరికే అలా చూస్తూ కూర్చుండి పోయాడు. వాడు ఊహించుకుంటున్నాడనుకుంటా ఆ ఇంట్లో - తను ప్రేమించిన యువతి. తనను ఫూల్ చేసిన యువతి తన అన్నకు భార్యగా, ప్రతిరోజూ కళ్ళముందు కనిపిస్తూ - పక్కగది నుండి నవ్వులు, (బహుశా తన సంగతి చెప్పుకని అయి ఉండొచ్చునన్న భావనలో) వంటరిగ, దిగులుగా కూర్చుని విషాదంలో తను___

వాడసలే ప్రతి చిన్నదానికీ బాధ పడేరకం. వాణ్ణిలా ఓదార్చాలో నాకర్థం కాలేదు. వాతావరణమన్నా మారితే కాస్త తెప్పరిల్లుతాడేమోననిపించింది.

"సినిమాకు వెళ్దామా."

వాడు నావేపో క్షణం విస్మయంగా చూసి వెంటనే లేచి నిలబడ్డాడు.

"రాస్కెల్, నేనింత బాధలో ఉంటే నీకు సినిమా కావాల్సొచ్చిందా?"

రౌద్రంగా అరిచి చరచరా గది బయటకు నడిచాడు.

ఊహించని ఈ పరిణామానికి గుడ్లు వెళ్ళబెట్టి గోడకేసి చూడడం తప్ప నేను మరేం చేయలేక పోయాను.

## 2

తన అన్న పెళ్ళి జరుగుతున్న రాత్రి సుబ్రమణ్యం నా గదిలో ముసుగు న్నిపెట్టి పడుకున్నాడు. వాడు నిద్రపోయాడనుకుని కొంతసేపటికి కళ్ళుమూసిన నేను ఓ రాత్రి వేళ మెలకువ వచ్చి చూసేసరికి లైటు వెలుగులో కుర్చీలో దిగాలు పడి కూర్చుని ఉన్న వాడు కనిపించాడు.... ఆ ఒక్కసారే కాదు. ఆ తర్వాత చాలాసార్లు నా గదిలో రాత్రులు వాణ్ణా స్థితిలో గమనించాను. అలాంటి రోజుల్లోనే ఒకసారి వాడి తల్లివచ్చి ఇంటికి రమ్మని వాణ్ణి బ్రతిమాలింది. వాడినుండి విసుక్కోవడాలు, కసుక్కోవడాలు మాత్రం సమాధానాలుగ ఆమెకు లభ్యమయ్యాయి. అసలు కారణం ఆమెకు తెలియదనుకుంటా. "నువ్వైనా నా చెప్పు బాబూ" అంది నావేపు తిరిగి. వాడి మనస్తత్వం తెలిసిన నేను సందిగ్ధంలో పడి అప్పటికామెను పంపేసి, తర్వాత వాడికెంతో నచ్చచెప్పాను. కష్టం తనని పెంచి పెద్దచేసి తనమీద ఆశలు పెట్టుకున్న ఆమెకోసమన్నా వెళ్ళమని తల్లికోసం త్యాగమనే అస్త్రాన్ని వాడి తలకెక్కించి ఆఖరికి వాడు ఇంటికి వెళ్ళేట్లు చేసేసరికి నా తల ప్రాణం తోకకొచ్చింది.

కాని రెండురోజుల తర్వాత ఉదయానే వాడు నా గదికివచ్చి "లాభం లేదురా నేనా ఇంట్లో ఉండలేను" అన్నాడు. వాడిబాధ నాకర్థమై మరేమీ మాట్లాడలేక పోయాను. మళ్ళా పూర్వంలా వాడు నా గదిలోనే ఉంటూ వచ్చాడు.

నాకు ఆశ్చర్యం కలిగించిన విషయమేమంటే వాడి నాన్నగాని, అన్నగాని

వాణ్ణి పలకరించటానికి ఏ రోజూ నా గదికి రాలేదు. ఒకవేళ వాళ్ళు ఏ వీధిలోనో ఎప్పుడయినా కలుసుకోవడం తటస్థించి మాట్లాడుకున్నారేమోగాని నేను చూస్తుండగా మాత్రం అలాటిదేం జరగలేదు. వాడి తల్లిమట్టుకు వాడు ఉన్నవేళల్లోను, లేని వేళల్లోను వచ్చి నాదగ్గర వాడి విషయమై దిగాలుగా చెప్పుకుని కాసేపు ఏడ్చిపోయేది.

కాని విధి వికృతమైనది. "నడిరోడ్డులో మెల్లిగా" ఏదో అలా కాలం సాగిపోతున్న సమయంలో ఓ దుర్దినాన సుబ్రమణ్యం చెప్పాపెట్టకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. కనీసం వాడు నాతో చిన్న ఉత్తరం ముక్కయినా వదలకుండా వెళ్ళినందుకు మొదట్లో బాధపడకుండా ఉండలేకపోయాను. పోస్టుద్వారా జాబొచ్చేమోనని కొన్నాళ్ళపాటు నిరీక్షించాను. కాని ఆశ... ఆశా వదులుకున్నాను.

తర్వాత తెలిసింది - సుబ్రమణ్యం ఊరు వదిలి పెట్టటానికి ముందురోజు తన తండ్రితో కారణం చెప్పకుండా వెయ్యి రూపాయలు కావాలని దెబ్బలాడాడని, చివరికి ఆయన ఇచ్చిన రెండు వందలూ మాట్లాడకుండా పుచ్చుకున్నాడనీ.

వాడలా వెళ్ళిపోయిన ఆరునెలలకు గావును. ఒకసారి పరంధామయ్యగారు నా కోసం కబురు పెట్టాడు. తక్షణమే వెళ్ళాను. కాని ఇంట్లో ఆయన లేకపోవడం నా కాశ్చర్యాన్ని కలిగించింది. శకుంతల నన్ను చూచి పలకరింపుగా నవ్వింది.

"క్షమించండి. అత్తయ్య బలవంతాన అలా కబురు పెట్టాను."

శకుంతలతో నా కంతగా పరిచయం లేకపోవడం మొక్కటే కాక నా భార్యతో వప్ప పరాయి స్త్రీలతో అంతగా మాట్లాడి ఎరుగని వాణ్ణికావడం వల్ల కొంచెం బిడియంగా అన్నాను :

"ఎక్కడుందామె ?"

తిన్నగా రెండు వాకిళ్ళు దాటాక కుడివేపు గదిలో ఉందామె పడుకున్న మంచం.

"ఇప్పుడేదీ సంగతు లేమయినా తెలిసాయా నాయనా ?" అన్నదామె నన్నుచూస్తూనే.

శకుంతల పని మనిషిచేత ఒక కుర్చీ తెప్పించి అత్తగారి మంచం పక్కనే వేయించి తను లోపలికి వెళ్ళిపోయింది. గదిలో కుడివేపు మూల చిన్న బొమ్మరిల్లు లాంటి దేవుడి గూటిలో విగ్రహాలముందు అగరు వత్తులు వెలిగించబడి ఉన్నాయి. వాటి నుండి వెలువడుతున్న తెల్లటి సన్నటి పొగ మెలికలు తిరుగుతూ సాగి గాలిలో అదృశ్యమవుతోంది.

నా జవాబు విని ఆమె పెద్దగా నిట్టూర్చింది. తనికి మాట్లాడాల్సిదేమీ లేనట్లు మౌనంగా పడుకున్న ఆమెతో ఏమి మాట్లాడాలో తోచక ఆమె మొహంవేపు చూస్తూ కూర్చున్నాను.

ఆమెలో అసాధారణమైన మార్పు కలిగింది. అసలే పల్చగా ఉండే ఆమె మరీ చిక్కిపోయింది. మొహమంతా పీక్కుపోయి. దవడలు వెళ్ళుకొచ్చి, కళ్ళు ఎక్కడో లోపలికి లాక్కుపోయి అస్థిపంజరంలా ఉందామె.

"పిచ్చిగున్నా!" హఠాత్తుగా పిలిచిన ఆమె స్వరంలోని అసాధారణ ధ్వనికి ఉలికి పడ్డాను. "మొదటినుండి వాళ్ళ నాన్న వాడ్ని తిరస్కారంగా చూశాడు. పెళ్ళయాక పెద్దవాడికి వీడికీ మధ్య ఏవో కలతలొచ్చినట్టున్నాయి. కోడలు పిల్లతో ఇక సరేసరి. ఇక్కడున్న కొద్దిరోజులూ వాడాపిల్లను తప్పించుకు తిరగటానికే ప్రయత్నించాడు. ఒక పెద్ద రహస్యమేదో వాళ్ళ మధ్య గోడకట్టుకున్నట్లు అనిపిస్తోంది—"

తన కోడలికి, కొడుకు బిడ్డకీ మధ్యగల సంబంధాల్ని గురించి ఆమె కెంత వరకు తెలుసో నాకర్థంకాలేదు.

"అసలు దీనికి కారణం కొంత వాళ్ళ నాన్నేనని చెప్పాలి - ఆయనకు ఆ అనుమానం ఉంది." ఆమె కొద్దిగా తల పైకెత్తి గుమ్మంవేపు చూసింది. ఎవరూ లేరని నిశ్చయించుకున్నాక తగ్గు స్వరంలో రహస్యంగా ఇలా అంది - "సుబ్బిగాడు తన కొడుకు కాదేమోనని -"

"నిజం?" నాకు తెలియకుండానే కాస్త పెద్దగా అరిచాను.

ఆమెకళ్ళలో ఆందోళన స్ఫుటంగా తెలుస్తోంది. వణుకుతున్న పెదవులతో ఏమో చెప్పబోయి గుమ్మంవద్ద చప్పుడయేసరికి మాట మార్చేసింది.

"ఏమౌతాదో ఏమో బాబూ, నేను కాస్త ఈలోపే గుటుక్కుమనేట్టున్నాను."

కాఫీ గ్లాసులతో శకుంతల లోపలికొచ్చింది. కాఫీ త్రాగుతూ ఆమె కూడా నాతోపాటు గదిలో ఉండిపోవడంవల్ల ముసలామె తను చెప్పదల్చుకున్న రహస్యాన్ని నాకు చెప్పలేకపోయింది.

కాసేపున్నాక నేను లేచి వస్తుంటే అన్నదామె:

"ఒకటి రెండు రోజుల్లో మళ్ళీ కలువు నాయనా."

నా వెనకే శకుంతల వీధివరకూ వచ్చింది.

"కొడుకు కనిపించని బెంగలో మా అత్తగారికి స్మృతి కాస్త వదలవుతున్నట్లున్నదండీ."

"అంటే —శకుంతల విన్నదా ??" నా కర్థం కాలేదు.

తరువాత పదిహేను రోజుల్లోనూ ముసలామె దగ్గరకు రెండుసార్లు వెళ్ళాను. కాని ఆమెతో ఒంటరిగా మాట్లాడే వీలు కుదరక పోవడంవల్ల సుబ్రమణ్యం పుట్టుక రహస్యాన్ని గురించి ఆమెనుండి ఏమీ తెలుసుకోలేకపోయాను.

మరోసారి నేనామెను కలుసుకోకుండానే నాలుగురోజుల్లో ఓ తెల్లవారుఝామున ఆమె చనిపోయింది.

# 3

ప్రేమకు ఒక నిర్వచనమంటూ లేదు. హద్దులు అంతకంటే లేవనే చెప్పాలి. మతోన్మాదులు మొరాలిస్టులు, శరత్ భక్తులు మొదలైనవాళ్ళు ఒక వ్యక్తి జీవితంలో ఒక స్త్రీని మాత్రమే ప్రేమించడాన్ని అనర్హంగా పరిగణిస్తారు. కాని, సుందర స్త్రీలముందు మాటి మాటికీ మతులు కోల్పోయి మనసులు చెడగొట్టుకున్న గోథే, బైరన్, షెల్లీల ప్రేమల్లోని తీవ్రతల్ని ఎవరు శంకించ గలరు గనక!? ప్రేమకోసం ప్రాణా లర్పించిన ప్రపంచ ప్రసిద్ధ హీరో "రోమియో" అంతటివాడు, "జూలియట్"ని దర్శించక ముందు "రోజలిన్"ని ప్రేమించి ఆమె చేత తిరస్కరించబడ్డాడు — ఇలాంటి భావాలు (బహుశా కొందరి దృష్టిలో చవకవి కావొచ్చు) నాలో ఉంటబట్టేనేమో, సుబ్రమణ్యం ఊళ్ళో దిగటమేగాని అతనివెంట ఒక యువతి ఉండటం నా కంతగా ఆశ్చర్యాన్ని కలిగించలేక పోయింది. అప్పటికి వాడి తల్లి చని పోయి సంవత్సరం పైగా దాటింది.

సుబ్రమణ్యం పెళ్ళి చేసుకుని తీసుకు వచ్చిన యువతిపేరు మాలతి. శకుంతల ఈడే ఉండవచ్చు. లేక ఒకటి రెండేళ్ళు చిన్నదేమో కూడా. కాని సౌందర్యంలోమట్టుకు శకుంతలను తన్నేస్తుంది.

సుబ్రమణ్యం వేరే ఇల్లు తీసుకుని ఎక్కడయినా కాపురం పెడతాడేమో ననుకున్నాను. కాని వాడదేమీ చేయ లేదు. ఉమ్మడి కుటుంబంగా తన అన్నతోనే ఉండిపోయాడు. వాడి అసలు ఉద్దేశం, తన భార్యను చూసి శకుంతల, బ్రహ్మంలు ఈర్ష్య పడా లని —

రోజులు చిన్నగా గడుస్తున్నాయి. నా కొడుక్కి మూడేళ్ళు నిండాయి. లలిత మళ్ళీ కడుపుతోంది. ఈసారితో పిల్లలకు పుల్‌స్టాప్ పెట్టాలని ఇద్దరం నిశ్చయించుకున్నాము. అయితే ఆపరేషను ఎవరు చేయించుకోవాలన్న విషయంలో మాత్రం మూడురోజు ల్నుండి గుద్దులాడు కుంటున్నాము— అలాంటి ఒక ఉదయాన నేను లోపల గదిలో భోజనానికి కూర్చునివున్న సమ యాన అవతలి గదిలో ఆటలాడు కుంటున్న మావాడొచ్చి జిలిబిలి పలుకు లతో ఇలా అన్నాడు.

"ఆయినా సుబ్బమన్నంగా లొత్తాలు."

"అయినా ఏమిటిరా పాడువెధవ. నాన్నారూ అనలేవూ?" - వాడి తల్లి నవ్వుకుంటూ అవతలి గదిలోకి వెళ్ళింది. నాకు వాళ్ళ సంభాషణ విని పిస్తోంది.

"కూర్చోండి"

వచ్చినది ఎవరైనదీ వాడు గమ నించలేదనుకుంటాను.

"ఈ మనుషులకు బుద్ధిలేదురా"

"ఆయన లోపలభోంచేస్తున్నారు."

"ఓ—నువ్వా. క్షమించాదినా"

"పరవాలేదు కాని, హాట్ హాట్‌గా ఉన్నారేమిటి?"

"ఆ నరకంలో నేనింకొక్క క్షణమైనా ఉండలేను."

"ఇప్పు డేముంది?"

"ఏమన్నావు? — ఎంతటి నీచుకైనా వావి వరసలుంటాయి. తమ్ముడి పెళ్ళామన్న బుద్ధయినా లేకుండా —"

నిశ్చేష్టుణ్ణయ్యాను. మళ్ళీ ఏదో మొదలయ్యిందని. త్వరత్వరగా భోజనం ముగించి టవలుతో చేతులు తుడుచుకుంటూ అవతలి గదిలోకి వెళ్ళాను. వాడి మొహం వాడిపోయి ఉంది. కళ్ళల్లో క్రోధం వెల్లివిరుస్తోంది. నన్ను చూడగానే అన్నాడు.

వీళ్ళనేమి చేయాలంటావురా?"

"ముందు నువ్వు ప్రశాంత పడు."

"బ్రతుక్కి అదొక్కటే తక్కువగా ఉంది —"

వాడు చెప్పుకొచ్చిన దాని సారాంశం ఇదీ! చిత్రం గీసేనెపంతో మాలతిని వాడి అన్న మోడల్‌గా కూర్చోబెడుతున్నాడు. వాళ్ళిద్దరూ ఎక్కువ కాలాన్ని మేడమీద అద్దె రూములో గడుపుతున్నారు. కాఫీ, టిఫిన్ వగయిరాలు శకుంతల తనే స్వయంగా ఆ గదిలోకి తీసుకువెళ్తోంది. వారం నుంచి గీస్తున్న బొమ్మ ఇంకా కాకుండా ఉందా అన్న ఉద్దేశంతో నిన్న సాయంత్రం సుబ్రమణ్యం నిశ్శబ్దంగా వాళ్ళున్న గదిలోకి అడుగ పెట్టాడు. ఎదురుగా బ్రహ్మం మాలతి చెంప నవరిస్తున్న దృశ్యం (వాడి మాటల్లో) - కనిపించింది. వాణ్ణి చూడగానే ఇద్దరూ ఉలికిపడ్డట్టు సర్దుకున్నారు.

"నా పర్మిషన్ లేకుండా లోపలి కెందుకొచ్చావ్?" అన్నాడు బ్రహ్మం విసురుగా.

"నువు చేస్తున్న దేమిటి?" కుతకుత ఉడికిపోతూ సుబ్రమణ్యం అడిగాడు.

"మాలతి పోజు సరిచేస్తున్నాను"

సుబ్రమణ్యం 'ఈజెల్' వేపు చూశాడు. చిత్రం ఇంకా అవుట్‌లైన్ పూర్తికాలేదు. పెళ్లి కాక పూర్వం శకుంతలతో తమ [illegible] గుర్తు కొచ్చింది.

"వారంనుంచి పోజులు సరిచేయటం కుదరనే లేదా?" అన్నాడు.

"షటప్!"

"ఇక నువ్వు మాలతి బొమ్మ గీయటానికి వీల్లేదు. ఆమె రేపట్నించీ రాదు"

"నువ్వు కాదు ఆ మాటలనాల్సింది. మాలతి అనమను."

అంతలో ఆమె కలగజేసుకుంది.

"ఏమిటండీ మీకు మరీ మతి పోతున్నట్లుంది...."

తిక్కరేగి సుబ్రమణ్యం తన పెళ్ళాన్ని కిందికి ఈడ్చుకు వెళ్ళాడు.




ఆ ఆఖరి సంభాషణ వాడిలోని అనుమానాన్ని దృఢ పరిచింది.

రాత్రి పరంధామయ్యగారు రాగానే సుబ్రమణ్యం ఆయన దగ్గరకు వెళ్ళి తనభాగం తనకు పంచేయమని అడిగాడు. ఆయన నోర్మూయ్యమన్నాడు. చిన్నప్పటించీ ఆయనదగ్గర వాడికింతగా చనువు లేకపోవడమేగాక ఆయనంటే భయ మెక్కువ కూడా. ఆ కోపంలో వాడు గదిలోకిపోయి, తన పెళ్ళయాక మొదటిసారిగా పెళ్ళాన్ని నాలుగు ఉతికి అన్నం తినకుండా పడుకున్నాడు. కాని నిద్రపట్టలేదు పక్కమంచంమీద వెక్కుతూ పడుకుని ఉన్న మాలతిని ఓగంట తర్వాత శకుంతల వచ్చి బ్రతిమాలి భోజనానికి తీసుకు వెళ్ళడాన్ని గమనించాడు. తనకు చెల్లిలేనిలోటు అప్పుడు గుర్తుకొచ్చింది. లోపలలోపల కుములుతూ ఎప్పుడో అలాగే తనకు తెలియకుండానే నిద్రపోయాడు. రాత్రంతా రకరకాల పాడుకలలతో తెల్లారి ఎనిమిదిన్నరకు నిద్రలేచాడు. పక్క మంచం మీద మాలతిలేదు. కడుపులో ఆకలి 'గయ్' మంది. విసుగ్గా తండ్రిదగ్గరకు మళ్ళీ వెళ్ళి కనీసం తను వేరే ఇంట్లో కాపురం పెట్టటానికి నెలనెలా ఇంతని డబ్బులన్నా ఇవ్వమని అడిగాడు. ఆఫీసుకు వెళ్ళబోతున్న ఆయన ఆగికారణమడిగాడు. వీడు చెప్పాడు.

"ఏమన్నాడాయనే?" కుతూహలం పట్టలేక అడిగాను.

"నా మొహంలోకి అదోలా చూసాడు." సుబ్రమణ్యం ఒక్క క్షణం తటపటాయించాడు. "'స్టుపిడ్' అనేసి బయటికి పోయాడు."

ఆ దృశ్యం నా కళ్ళముందు మెదిలి పెదాలు బిగబట్టాను. చెంగు నోటి కడ్డం పెట్టుకుని లలిత లోపలికివెళ్ళింది. వెంటనే లోపలినుండి మా పాప స్వరం వినిపించింది.

"ఆయనా, అమ్మలవ్వతోంది...."

గాభరాగ సుబ్రమణ్యం మొహం లో చూసాను. వాడి కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. చప్పున మొహం తిప్పేసుకుని వాడు నాకేకలన్నా విని పించుకోకుండా బయటికిపారిపోయాడు.

"స్టుపిడ్!"

కోపంగఅన్నానునాభార్యవేపుతిరిగి. అంతవరకు బిగబట్టి ఉంచిన నవ్వును ఆమె పగాలువదిలేసింది. ఎందుకోతెలి యక పోయినాకిందనుండిమాపాడుకూడ పకపకిలించాడు. ఒక్క క్షణం నవ్వే తున్న వాళ్ళ మొహాల్లోకి చూసి నేను కూడ నవ్వకుండ ఉండలేకపోయాను.

# 4

లోకంలో చాలామంది పురుషులు తమ భార్యలు వేరొకళ్ళతో వ్యభిచ రిస్తూ తమను వంచిస్తున్నారని తెలిసి కూడ శుభ్రంగా, సుఖంగ, శాంతంగా సంసారాలు వెళ్ళదీసుకొస్తున్నారు. జీవితంమీద ప్రేమ, వ్యక్తిగత విలు వల మీద నిర్లక్ష్యం ఒక్కాలి సెన్స్ ఆఫ్ హ్యూమర్ మొదలైన లక్షణాలు కలిగి ఉన్నవాళ్ళుబుద్ధిమంతుల కోవలో కొస్తారు. ఇంకోరకం వాళ్ళుంటారు - వీళ్ళ భార్యలు వాస్తవానికి ఎలాంటి వాళ్ళయినా వాళ్ళ పాతివ్రత్యం మీద మాత్రం అమిత విశ్వాసం ఉంటుంది. ఊహాశక్తిలేమి, 'పురాణం' వారు చెప్పిన మన ఆంధ్రత్వపు సెన్స్ ఆఫ్ రూమర్లు అధికంగా ఉండటం వాళ్ళనా అంధత్వంలో ఉంచుతాయి. వీళ్ళు ఉత్త 'ఇడియట్స్.'

మా సుబ్రమణ్యం వీళ్ళలో ఏ జాతికీ సంబంధించక పోవడం స్నేహ రీత్యా నాకు గర్వకారణమే-అని వాడి ప్రస్తుత మానసికస్థితి మాత్రం దయ నీయమైనది. పై సంఘటన జరిగాక వాడు నాతో మాట్లాడటం మానేశాడు. ఎప్పుడయినా ఎక్కడయినా పొరపా టున తటస్థపడటం సంభవించినప్పుడు చిరునవ్వుకుని నన్ను గమనించనట్టే దాటిపోవడం ప్రారంభించాడు, తప్పు నాదయినా నాభార్యదయినా ఒకటే కాబట్టి వాడికి సంజాయిషీ చెప్పుకోవా లని నిశ్చయించుకున్నాను. కాని సమయం, సందర్భం కలిసిరాక కొన్నాళ్ళలాగే గడిచిపోయాయి. ఇంతలో మాస్నేహానికి శాశ్వతంగా అడ్డుగోడలేపిన విపరీత సంఘటన ఒకటి జరిగింది.

ప్రమోషన్ అందించిన సందర్భంగా బిక్షపతి మాకు పార్టీ ఇస్తానన్నాడు. అతను కాక గిరిధరమూర్తి. మరో ముగ్గురు మిత్రులు. నేను. కలిసి 'కోమలావిలాస్' చేరుకున్నాము.

"సుబ్రమణ్యం ఇంకా రాలేదే," అన్నాడు బిక్షపతి స్వీట్లకు ఆర్డరు ఇస్తూ.

"వాణ్ణి కూడ పిలిచారా?" ఈ అవకాశాన్ని వినియోగించుకునయినా వాడికి క్షమాపణలు చెప్పుకోవాలనుకున్నాను.

అవి ఇవి తింటూ, కబుర్లు చెప్పుకుంటూ, కేరింతలతో ఒక అరగంట కాలం గడిపాము. కాని సుబ్రమణ్యం రాలేదు. వాడు రాలేదన్న స్పృహే లేదు మాకు.

ఇంతలో మా సంభాషణ దేశంలోని ఋషులు బాబాలవేపు మళ్ళింది.

"మీ బాబాగారి ముక్కు ఒరిజనల్ది కాదటగా," అన్నాడు గిరిధరమూర్తి అవధానిని ఉడికిస్తూ.

అవధాని 'మెహర్ బాబా' భక్తుడు. ఉత్త భక్తుడు అనే కంటె మూఢ భక్తుడు అంటే బాగుంటుందేమో.

నేను ఉండబట్టలేక అన్నాను:

అవును, యస్వీ రంగారావుముక్కు మీద మోజుపడి పాపం, అలాంటి ప్లాస్టిక్ ముక్కుకోసం ఆయన తన అసలు ముక్కును ఊడగొట్టుకుని ఉంటాడు."

పరమ నాస్తికుడయిన గిరిధరమూర్తి మంచి మూడ్లో ఉన్నాడేమో పెద్దగా నవ్వేసాడు. అందులో పెద్దగా జోక్ లేకపోయినా: మానవుడు 'గ్రెగారియస్ ఎనిమల్' కాబట్టి మిగతా మిత్రబృందమంతా కూడ ఫకాలు మన్నారు.

మరుక్షణమే నా గూబ 'గుయ్' మంది. బిత్తరపోయి చెంప సవరించుకుంటూ పక్కకు చూశాను.

క్రోధం నిండిన కళ్ళతో వణికి పోతూ నిలబడి ఉన్నాడు, సుబ్రమణ్యం!

"ఒక్క ఇంట్లో వాళ్ళేకాదు: మీరు కూడ అంతేరా....నీచులు, రక్తంపీల్చే జలగలు — ఒక బంధుత్వం లేదు, మిత్రత్వంలేదు — ఛీఛీ, పాడుజనం!"

ఈ మాటలనేసి గిరుక్కున వెనక్కు తిరిగి బయటికి వెళ్ళిపోయాడువాడు. నవ్వులాపేసి అందరూ అవాక్కులయి చూస్తూ కూర్చుండిపోయాం.

రావటమే ఏ మూడ్లో వచ్చాడో ఏమో నా చిట్టుకు మిత్రులంతా నవ్వడాన్ని అప్పుడే ప్రవేశించిన సుబ్రమణ్యం చూచి, నా మాటలు తాను వినకపోయినా అవి తనను చూసే, తనను గురించే అన్నానని అపోహపడి ఉంటాడు.

అంతటితో మా స్నేహం అంతమైందనే అనుకున్నాను.

సుబ్రమణ్యాన్ని ఒక విధంగా మానసిక రోగి అని చెప్పొచ్చు. ఆ జబ్బుపేరు 'పారనోయా'. తల్లి

గారాబం, తండ్రి నిర్లక్ష్యం అన్న ప్రవర్తన కాక పై సంఘటన లన్నిటి ద్వారా వికసించిన పరిస్థితులు, ఇవన్నీ వాడిలో 'పారనోయా' కి కారణాలు కావచ్చు. ప్రతి 'పారనోయా' పీడితుని లోనూ 'హోమోసెక్సువల్' గుణాలు ఉంటాయని 'ఫ్రాయిడ్' అంటాడు. కాని మా సుబ్రమణ్యాన్ని గురించి నేనంత దారుణంగా ఊహించలేను.

# 5

ప్రసవానికని లలిత పుట్టింటికి వెళ్ళింది. వెళ్ళబోయేముందు మా ఫామిలీ ప్లానింగు విషయమై మేమొక ఒప్పందం కుదుర్చుకున్నాము. దాని ప్రకారం మగపిల్లవాడు పుడితే నేను ఆపరేషన్ చేయించుకుంటాను. లేక ఆడపిల్ల పుట్టినట్లయితే నాభార్య — ప్రసవ దినాలు దగ్గర పడుతున్నకొద్దీ రాత్రిళ్ళు నేను 'ఇన్సోమ్నియా' తో బాధ పడసాగాను. మామగారి వద్ద నుంచి ఇంకా టెలిగ్రాం రాలేదు. ఎందుకో నాకు ఆందోళనగా ఉంటుంది. లలిత తగినంత బలంగాను ఆరోగ్యంగానే ఉందన్న సంగతి తెలుసు కాని కోతిలాంటి మనస్సును ఊరుకోబెట్ట లేకపోతున్నాను. ఇలాంటి ఆలోచనలతో ఒక రాత్రి ఎప్పటికో బాగా ప్రొద్దుపోకయాగాని నిద్ర పోలేక పోయాను — నిద్రలో ఒక కల : క్యారు క్యారుమంటూ పక్క గదిలో పిల్లే!" అనుకుంటున్నాను. ఆనందంగా-మరదలుపిల్ల పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పింది - "బావా నీకింకో కొడుకు"-"అబద్ధం" అరిచి గదివేపు నడిచాను. త్వరగా నాకంటె ముందు గదిలోకి ప్రవేశించిన మరదలుపిల్ల నా మొహంమీద తలుపు మూసేసింది. "తెరువు. తలుపు తెరువు!" తలుపు మీద గుద్దుతూ కేకలు పెడుతున్నాను. ఉలికిపడి హఠాత్తుగా కళ్ళు తెరిచాను.

కలలోని నేను కాక నిజంగానే ఎవరో నా గది తలుపులు బాదేస్తున్నారు దబదబ. లైటువేసి వాచీకేసి చూశాను, రెండయింది. అంతలో తలుపులు ఒకటే మోత. విసుగుతోను, ఆశ్చర్యంతోను లేచి స్లిప్పర్లు వేసుకుని వెళ్ళి గడియ తీశాను. నన్ను తోసుకుంటూ ఒక మనిషి లోపల ప్రవేశించాడు. వెంటనే తలుపులు మూసేసి గడియపెట్టి నావేపు తిరిగాడు.

సుబ్రమణ్యం!

"ఏమిటిరా, ఈ వేళప్పుడు?" ఆశ్చర్యంగా అన్నాను.

"ష్" వాడు ముక్కుమీద వేలుంచి అన్నాడు.

అసహనంగా వాడు గదిలో అటు ఇటు కాసేపు పచార్లు చేసి హఠాత్తుగా ఆగి అన్నాడు.

"బ్రహ్మంగాడి కల పగలగొట్టావురా".

"సైకో" సినిమా తాలూకు దృశ్యం

హీరోయిన్‌తో పాటు రుద్దుకున్నప్పటి అనుభూతి పొందాను. అయినా బింకంగా అన్నాను-

"కలవరిస్తున్నావా ?"

"షటప్! ... చెప్పేది సాంతం విను. యాళ్ళకర్రతోనో. దేన్తోనో ఒక్క దెబ్బేసాను. చస్తాడో చావడో తెలియదు కాని... సుబ్రమణ్యం ఒక్క కుదుపుతో పక్కకు తిరిగి కిటికీవద్దకు వెళ్ళాడు. తలుపులు తెరిచి బయటి తెల్లటి వెన్నెలలోకి కాసేపు చూసి వొళ్ళు విరుచుకున్నాడు ఒకటి రెండు నక్షత్రాలు కిటికీలోనుండి తొంగి చూస్తున్నాయి.

నేనిదంతా చిత్రంగ చూస్తున్నాను. సుబ్రమణ్యం మళ్ళీ గది మధ్య కొచ్చి లైటు వెలుగులో నిలబడ్డాడు. ఇప్పుడా మొహంలో ఇందాకటి క్రౌర్యత లేదు. ఆ స్థానంలో వాడిలోని సహజ అమాయకత్వం చోటుచేసుకుంది, కొంత దీనంగా ఉన్నాడుకూడ.

"కర్మ అనేది ఉన్నదేమో..." దిగులుగ, నిదానంగ యోచిస్తున్నట్లు ఒకో మాటా వాడి నోటినుండి బరువుగ ఊడిపడుతోంది. "అమ్మ గారాబంలో ఏలోటూ లేకుండా పెరిగినవాణ్ణి అప్పుడప్పుడు ఆశ్చర్యపడుతుండేవాణ్ణి. చిన్నప్పుడు కష్టాలంటే ఎలా ఉంటాయో! అవినాకు కూడ సంభవిస్తాయా?' అని. కాని-ఇవాళయినా ఇంకా అనుమానమే-ఇవేనా కష్టాలంటే? —ఏమో—

"కుర్చీలో కూలబడి మొహాన్ని రెండు చేతుల్లో దాచుకున్నాడు. సుబ్రమణ్యం ఏడుస్తున్నాడు. చిన్నపిల్లవాడిలా బేలగా.

నాకంతా అయోమయంగా ఉంది. ఏం జరిగిందో ఊహించలేకపోయాను. కాసేపున్నాక ఏడుపు మానేసి వాడు మళ్ళీ చెప్పటం ప్రారంభించాడు. వాడి స్వరం కంపిస్తోంది. మాటల్లో ఒక క్రమంలేదు. కలవరిస్తున్నట్లు చెప్పుకుపోతున్నాడు.

"నాన్న నన్నెందుకని మొదటి నుండీ ద్వేషిస్తూ వచ్చాడో నాకిప్పటికీ అర్థంకాదు. అమ్మ చనిపోయి ఏ లోకాన ఉందో- ఇక వీడు- బ్రహ్మాగా- ఇద్దరం చిన్నప్పటినుంచీ ఎంత అన్యోన్యంగా బ్రతికామో - ఒక కంచంలో తిని మంచంలో పడుకుని-కాని ఆ బతికి ఇవాళ - నాకు కావలసిన శకుంతలను చేర్పుగా లాక్కుని - అయినా మాలని చూసి ధైర్యపడ్డాను. కాని- అన్నట్లు మాలతికి గర్భం! లోపలి బిడ్డ నా రక్తమే నని నమ్మకమేమిటి? అందరం ఒకే ఇంట్లో - అప్పటికే వాడు దాని బొమ్మ గీయటం ప్రారంభించాడు - మాలతి కూడ నేనంటే అదోలా ఉంటోంది. అది కోపమయినా పర్వాలేదు, ఉత్త నిర్లిప్తత. కొట్టినా తిట్టినా మాట్లాడదు. మౌనంగా సహిస్తుంది - ఇక శకుంతల దృష్టిలో నేనొక పురుగునే. ఇలా కాదని వేరే కాపురం పెడదామనుకున్నాను. నాన్న సహకరించక పోగా

నా ఉద్యోగ ప్రయత్నాలు ఒక్కటీ ఫలించటంలేదు.

"ఇలాంటి ఆలోచనలతో రోజూటిలా ఈ రాత్రి పడుకున్నాను. రెండు రోజుల్నుంచి నాన్న ఊళ్ళోలేడు. ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలియదు - స్నానం చేస్తున్నాను. గభాల్న గుర్తించాను. నా వొంటిమీద బట్టలు లేవు. నా భార్యకు తప్ప ఇతర్లకుండు చూపించటానికి సిగ్గుపడే అవయవాలు నగ్నంగా. అసహ్యంగా. అంతేకాదు. నేనా స్థితిలో ఉన్నది నడిబజారులో. నా ఒళ్ళు దాచుకోను దగ్గరలో బట్టలాంటివేమీ కనిపించలేదు - పరుగు తీయటం ప్రారంభించాను. ఇంటికి - బజార్లగుండా - కాని ఇల్లెంతదూరమని! పరుగెత్తుతున్న నాకు ముగ్గురు మనుషులెదురయ్యారు. వాళ్ళు నన్ను చూచి. నావేపు వేళ్ళు చూపిస్తూ, నవ్వుతున్నారు. అన్నయ్య. శకుంతల అస్పష్ట రూపంలో ఇంకో మనిషి - సిగ్గుతో చచ్చిపోతూ రోడ్డు మీద ముడుచుకుని కూలబడ్డాను. వాళ్ళు మాత్రం హేళనగా, పెద్దగా నవ్వుతున్నారు. అవయవాలు దాచుకోవాలని ఎంతగా ప్రయత్నిస్తున్నానో - చెవులు మూసుకోవాలని ఎంతగా ప్రయత్నించానో - కాని వాళ్ళనవ్వులు - నవ్వులు నవ్వులు!!

సుబ్రహ్మణ్యం ఫెడీమని బల్లమీద గుద్దాడు. లేచి విసురుగా గదిలో అటు ఇటు పచార్లు ప్రారంభించాడు.

"నాకు మెలకువ వచ్చింది. చెవుల్లో ఆ నవ్వులే ప్రతి ధ్వనిస్తున్నాయి. సిగ్గుతో వంటికేసి చూసుకున్నాను. బట్టలున్నాయి. కాని పళ్ళు బయటపెట్టి నవ్వుతున్న శకుంతల, బ్రహ్మంల మొహాలు పరిహాసిస్తూ కనిపించాయి. నాలో అవమానం. కసి - అవమానించాలని కసి తీర్చుకోవాలని - ఏం చేస్తున్నానో తెలియటంలేదు. లేచి బయటికి వచ్చి మాలతి ఉన్న గదికి గొళ్ళెంపెట్టి, మెట్లెక్కి పైకి వెళ్ళాను. వాళ్ళన్నయ్య ఉంటున్నగది పైన ఉంది. అదృష్టవశాత్తో, దురదృష్టవశాత్తో వాళ్ళగది తలుపులు దగ్గరకేసిఉన్నాయి లోపల పక్క పక్క మంచాలమీద ఇద్దరూ నిద్రిస్తున్నారు. నాకు ముందు తగిలింది శకుంతల, ప్రశాంతంగా నిద్రిస్తోంది. నా బాధకు కారకురాలయ్యా. నా జీవితానికి వికృత మలుపులు తిప్పిన వనిత - ఆమె రొమ్ముల మీద చేతులుంచి జాకెట్టును టపటప లాడించాను. చటుక్కున కళ్ళుతెరిచింది శకుంతల వెంటనే ఆమె నోరు తెరుచుకుంది. అంతే. మాటాపలుకులేనామె నోటి నుండి. ఆ కళ్ళుమూసుకోలేదు. నోరూ మూసుకోలేదు. అన్నీ అలా తెరుచుకునే ఉన్నాయి.

సుబ్రహ్మణ్యం పెద్దగా నవ్వాడు. హృదయ పూర్వకంగ మళ్ళీ నవ్వాడు

"హాహా - ఎట్లా ఉన్నానేమిటి ?"

వాడు కదిలాడు. టేబుల్ వద్దకెళ్ళి అద్దం తీసుకుని మొహం చూసుకున్నాడు.

"డెవిల్‌లా ఉన్నాను కదూ ?"

చిందర వందరై మొహం మీద పడుతున్న జుత్తు. ఎఱ్ఱబడ్డ కళ్ళు. మాసిన గడ్డం. నిలువుగీతల పైజమా, అదే గీతల షర్టుతో నిజంగానే వాడు డెవిల్‌లా ఉన్నాడనిపించింది.

"నేను చెయ్యదల్చుకున్న దేమిటో నాకే ఒక నిశ్చయం లేదు. ఆమె పొట్ట మీద చెయ్యేసి కుచ్చెళ్ళు లాగేస్తున్నాను. నా మోకాలొకటి మంచం మీద ఆనించటం వల్ల ఉండి ఉండి చప్పుడవుతోంది. హఠాత్తుగ కళ్ళు చిట్లించి పక్క మంచం మీద కదలికను గమనించాను. చేస్తున్న పని ఆపేసి వాడి మీదికురికాను. ఇద్దరం మంచం మీద నుంచి కిందపడ్డాము. అలా ఎంతసేపు క్రిందా ఒకళ్ళమీద ఒకళ్ళం దొర్లామో కాని ఆఖర్న నేను పైన, వాడు క్రింద ఉన్నప్పుడు నా చేతి కందుబాటులో ఉన్న దేన్తోనో వాడి నెత్తిమీద కొట్టాను. నానుంచి వాడి పట్టు సడలింది.

"మెల్లిగా దిగుతుంటే లీలగా తెలిసింది. ఏం చేశానో, ఏం జరిగిందో. వెంటనే భయమావేశించింది. వెనకటి దారినే దాటి బజార్నపడి పరుగెత్తాను. నాకు తెలియకుండా ఇక్కడికి వచ్చాను. అయినా నీకిదంతా చెప్పాల్సింది కాదనుకో. కాని ఎవరో ఒకరికి చెప్పుకోవాలిగా - కుక్కకో. నక్కకో -"

మింగు తిన్నాను. నాతో పాత సంఘటనలు వాడు మర్చిపోలేదనుకుంటా. జాలేసింది. మాట్లాడటానికి నోరు తెరిచాను.

సుబ్రమణ్యం వాకిలివేపు కదిలాడు

"ఎక్కడికి ?"

ఏమో- రైల్వే స్టేషనుకో. పోలీసు స్టేషనుకో."

వాకిలి వద్దకొచ్చాక సుబ్రమణ్యం ఆగాడు. వాడు గుమ్మంలో నిలబడి ఉన్నాడు. నేను తలుపు పుచ్చుకుని లోపలి వేపున ఉన్నాను.

"నా కలలో నవ్వులతో నన్ను హేళన చేస్తూ కనిపించిన వాళ్ళలో ఆ ఇద్దరూ కాక మూడో మనిషి ఎవరో చెప్పనా?" అన్నాడు నవ్వుతూ.

"ఎవరు ?"

"ఇప్పుడనిపిస్తోంది అస్పష్టంగా-" వాడి కళ్ళు మెరిసాయి ఎఱ్ఱదనంలో. బాంబు వదిలినట్లు వదిలాడు రెండక్షరాలు.

"నువ్వే !"

ఉలికి పడ్డాను. చప్పున వాణ్ణి బయటికి నెట్టి తలుపులు మూసి గడియ పెట్టాను.

మరుక్షణమే వీధివేపు కిటికీ తెరిచి ఉన్నట్లు గుర్తొచ్చింది. ఒక్క ఉదుటున అక్కడికి చేరి రెక్కలు బిగించాను.

అప్పుడు నిట్టూర్చాను తేలిగ్గా.




ఈశ్వరుని ప్రియురాలైన పార్వతికి అత్యంత విచిత్రకరంబులు, హాస్యకరంబులు సాహసాది సకల గుణాభిరామంబులగు ఈ కథలు నారద మహాముని జెప్పుచున్నాడు.

ఓ లలనామణీ! భూమండలమున విక్రమార్కుడును, [వేరొక విక్రమార్కుని కథలలో కంసాలిపాత్ర వచ్చినందున విశ్వబ్రాహ్మణునే పాత్రను అయిష్టతతో వాడుకొనవలసి వచ్చినది రచయితకు ఒక ప్రత్యేక కులముపై అగౌరవం ఎంతమాత్రం లేదని మనవి.] విశ్వబ్రాహ్మణుడును పరకాయ ప్రవేశమను విద్యను నేర్చుకొన్న సంగతి మీకు విదితమే కదా! ఆ విక్రమార్కుడాంధ్ర దేశమ్మున గొప్ప సినిమా ప్రొడ్యూసరుగా జన్మించి కిరీటము లేని రాజువలె గొప్ప గొప్ప చిత్రకథా ప్రబంధములను పిక్చరులుగా దీయుచు మూడు కథలను ముప్పయి పిక్చరులుగా చేయుచు సినీ మాయామేయ జగమ్మును ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలుచుండెను.

విశ్వబ్రాహ్మణుడును డబ్బింగు పిక్చరులను గుత్తకు కొని విక్రమార్కుడు తన పిక్చరును రిలీజు చేయునపుడెల్ల తన కత్తి సరకును మార్కెటునందు విడుదల జేసి, విక్రమార్కుని పిక్చర్సును దెబ్బతీసి జీకాకు పర్చి యానందించుచుండెను.

పూర్వము విక్రమార్కుడును విశ్వబ్రాహ్మణుడును పొట్టేళ్ళను పోట్లాడించి యానందించుచుండిరి కదా! అవ్విధంబుననే పిక్చరులద్వారా పొట్టేళ్ళను పోట్లాడించినట్లు యాటలాడించు చుండిరి.

మద్రాసునందు గుర్రపు పందెములు కలవుకదా! వారిరువురు యొక సమయమున గుర్రపు పందెముల నాడబోయిరి



విధివశంబున విక్రమార్కుని గుఱ్ఱము బలహీనమై పరుగెత్త జాలదయ్యె.

అంతట రాజు తన దేహము నొక రహస్య ప్రదేశమున దాచి గుఱ్ఱము దేహములో పరకాయ ప్రవేశ విద్యచే జొరబడి పరుగెత్తుచుండ విశ్వబ్రాహ్మణుడా రహస్యమును తెలుసుకొని రాజు కళేబరమునందు జొరబడి తన దేహమును నదికి పారవేసి తానే విక్రమార్కుడను ప్రోద్యూనసరయి విక్రమార్కుడేలు సిరి రాజ్యరమను జితము చ్చిన రీతి పాలింపుచు అతని హీరోయిన్ను రతిక్రీడకు రమ్మన, ఆమె విశ్వబ్రాహ్మణుడు పరకాయ ప్రవేశవిద్యలో విక్రమార్కుని మోసపుచ్చినాడని కొన్ని లక్షణములచే మెరింగి, మంచిదికానిమ్ము, నాకు ఆరు నెలల వరకు బిక్కురు లున్నవి. ఆపిక్కల వ్రతము పూర్తయిన వెనుక నీ యిష్ట ప్రకారము సుఖ సౌఖ్యముల ననుభవి ప వచ్చునని చెప్పి విక్రమార్కునికై వెదకింపుచుండెను.

అక్కడ గుఱ్ఱపు పందెములో నెగ్గి జాక్‌పాట్‌ను గెల్చుకొని, తాను గుఱ్ఱపు దేహమును విడిచి తన దేహమును దాచిన రహస్య ప్రదేశమునకు వచ్చి అచ్చట శరీరము లేకపోయినందున మద్రాసు నగరమందలి బ్రతికిన కాలేజీలో మ్యూజియము అధికారుల నిర్దాక్షిణ్యమునకు ఎండదెబ్బ తగిలి జచ్చి పడియున్న రంగుల రామచిలుక దేహములో జొరబడి ఆకాశ

మార్గమున బోవుచుండ మీనం బాకము విమానాశ్రయము నుండి హైదరాబాదు పోవు "ఇండియన్ ఎయిర్‌లైన్సు" విమానము దగులగా యొకించుక విశ్రమించతలచి చిలుక రూపమునున్న విక్రమార్కుడు ఆ విమానము పై కప్పు పై నెక్కి ఎయిర్ హోస్టెస్సు బంగారు చిలుక సౌందర్యము నవలోకించుచుండెను. ఎయిర్ హోస్టెస్సు విమాన సుందరి తన అతిలోక లావణ్యములచే విమాన యాత్రికుల మెప్పించుచుండగా ఆమె దృష్టి మన విక్రమార్కుడను చిలుకపై బడెను. అంతటా చిలుకల కొలికి చెక్కుటద్దంపు తలుపులనెరచి చిలుకను సంజ్ఞలద్వారా లోని కాహ్వానించెను.

"సుందరీ నాపిక్చునందు యాకు చేసెదా?" అని విక్రమార్కుడు తాను దంపుల నాయిచిలుక నను ప్రసక్తి మరచి యా విమానసుందరి ప్రౌఢా సనకుంగల సహజ కుతూహలముతో యడిగెను.

అంతటా విమాన సుందరి విస్మయ మంది చిలుక మాటలకు చిలిబిలి పలుకులకు మురిసి "సిరి చిత్తజుడల్లి తూపు మొన చేసిన చేయగలెన్ని. పైధ్వజంబెత్తిన ఎత్తనిమ్ము వచియించె చెలిన కల్గిన మాట గద్దగా' అని లోపల యును కొని "ఓచిలుకరాజా - నీ పెళ్ళి పుత్రమ్యా చిలుక రాజా' యనిపాడుచూ విక్రమార్కుండను చిలుకను విమానము [illegible] గుండెల కదుముకొనుచు. సుకుమా షుల రాపిడివలన చిలుకకు హాయి కలిగించుచూ ప్యాసెంజర్లను కబుర్లతో సంతోషపెట్టుచుండెను.

'చంపక' మన్మథబాణముల కోర్వ జాలక చెంతనున్న చిలుకను చిత్తము వచ్చినట్లు నలుపు చుండగా చిలుకరూపములోనున్న విక్రమార్కుడా విమానసుందరి విరహవేదనలకు విస్మయపడక విసువు కొనక నేర్పుతో కడు చమత్కార ముతో 'చంపకా నను చంపకే' యని వేడుకొనుచుండెను.

## చంపక యను విమాన సుందరి వృత్తాంతము

చంపక యను విమానసుందరికి హైదరాబాదున తాటాకుల రెడ్డియను మంత్రిగారి బావమరది [illegible] ప్రియుడు కలడు. మద్రాసున బంబు లకుడను మార్వాడీ వ్యాపారస్థుడు మరి యొక ప్రియుడు. సమయము చిక్కి నపుడెల్ల 'చంపక' ఇటు హైదరాబాదు నందును అటు మద్రాసునందును వీరి రువురితో వేశితీబంధముల మెరగులా డుచూ మన్మథక్రీడల దేలియాడు చుండెను.

చంపక చిలుకను దీసుకొనిపోయి ద్వారకా హోటలు నందు తాటాకుల రెడ్డితో క్రీడించుచుండెను. ఏకత్స మయమున మన్మథ పారవశ్యమున తాటాకుల రెడ్డి మాటలాడు చిలుకను



జూచి ముచ్చటపడి దీనివలన మాబావయ్య రాజకీయములలో సయోధ్య నయోధ్యలను కూర్పఁజేయునని నోరు జారెను. చంపక జాగుసేయక లక్ష రూపాయలకు చిలుక నిత్తునని తాటాకుల రెడ్డితో యొప్పందమును గుదుర్చుకొని లక్ష రూప్యములకు జెక్కును గ్రహించుకొని చిలుకను మంచి లాభమున కమ్మివేసెను. జాతి చిత్రములు క్షణికములు గావాయని విక్రమార్కుఁడు 'బంబులకు' నికమ్మిన పది లక్షల రూప్యముల నిచ్చునుగదా, యని తాటాకుల రెడ్డి బాత్రూమున కరిగిన తరి చంపక చెవికొరికెను. చంపక మూర్ఛిల్లెను. అంతట విక్రమార్కుఁడు బాత్రూము తలుపుపై నిలువబడి "తాటాకుల రెడ్డీ! తాటాకుల రెడ్డీ నన్నేల లక్షరూప్యములు వ్యయపఱచి కొనుచుంటివి. నేనొకశ్లోకము చెప్పెద నవలోకింపుము.

ఉత్తుంగ భుజనాగోవా
దేశకాల గతోపివా।
దిగ్వాస్య నాగోవా
సందోహజా భవిష్యతి॥

ఓయయ్యా! డబ్బులేని బ్యాంకుపై జెక్కునిచ్చితినని బాత్రూములో దూరి చింతిల్లకుము. ఆరునెలలకు ద్రవ్య మిచ్చుపట్లు పత్రము వ్రాసియివ్వక పోతివా? ఈలోగా చంపక విమాన ప్రమాదములో చనిపోవచ్చును. బ్యాంకు దివాలా తీయవచ్చును. మీ బావయ్య మంత్రి పదవి పోవచ్చును. తాటాకుల రెడ్డే మంత్రి కావచ్చును. నీవాలసింపకనను మద్రాసునకుగొనిపోయి బంబులకును వ్యాపారి నన్ను పది లక్షల రూప్యములకు విక్రయించుము. ఒక లక్ష చంపక కిచ్చినను నీకు తొమ్మిది లక్షలు లాభము వచ్చును. ఆ తొమ్మిది లక్షలతో బిక్కరును తీయవెదల నీకు మువ్వురు లక్షలు

లాభము వచ్చును. ఆలసింపక బాత్రూమున్వెడలిరమ్ము' అని హితోపదేశము చేసెను. ఒక రంగుల రామ చిలుక వలన ముప్పంబలక్షల లాభము వచ్చునను నుపాయమును గ్రహించి తాటాకులరెడ్డి సంతోషముతో 'చిలుకరాజా! జంబులకుని నిన్ను నే నెట్లు విక్రయింతునో ఆ విధమును కూడా విశదముగ సెలవిమ్మా' యని వేడెను. అప్పుడు చిలుకరాజు—

'ఓయి తాటాకులరెడ్డీ! నీవు మాయ



కుదర్చగా గన్పట్టుచున్నావు. ఈ చంపకను నీవు సర్వాధికారములతో జంబులకునికి దానముసేయు యెడల చంపకే జంబులకునిచేత చిలుకను గొనిపించును' అని రహస్యమును ఎరింగించెను. చిలుక చెప్పిన విధముగా చంపకను తోడ్కొని హైదరాబాదునుండి మద్రాసునకుంజని అచ్చట జంబులకునికి చంపకను దానముచేసె. ఆమె ప్రోద్బలము చేత పదిలక్షల రూప్యములకు చిలుకను కొనిపించి తాటాకుల రెడ్డిని సినిమా ప్రొడ్యూసరునిగా జేసెను. తాటాకుల రెడ్డి 'చిలుక పిక్చర్స్'నెడి పేరున అరవములో కరువుదీర పటముల నెత్తుచూ లక్షలకు లక్షలు గడించెను. కాని మనసులో చంపకపై కోరిక దీరనందున సినీమాలో హీరోయిన్జేతునను నెపంబున ఆమెను మరల దక్కించుకొని బేకితీ బంధములలో పెనగులాడవలయుననెడి కోరికతో తాటాకులరెడ్డి సహాకహాలాడుచుండెను.

చంపకను పొందిన జంబులకుడు మద్రాసునందు ఎగుమతులు దిగుమతుల వ్యాపారము జేయుచుండెను. ఇట్లుండగా జంబులకునకు చిలుక వచ్చినదాది వ్యాపారము పెచ్చుపెరిగి లక్షల నుండి కోట్లకు ప్రాకజొచ్చెను. అయ్యవసరంబున ఆఫ్రికా దేశముల కేగవలసిన పని తగిలెను. జంబులకునకు చంపకపైనకూడ గురిమెండయ్యెను. చంపక అమెరికా దేశమునకైన వత్తు

నని ఆఫ్రికా దేశములకు రాజాలనని జంబులకుని అభ్యర్థనమును తిరస్కరించెను. అతడు మిక్కిలి విచారపడి వయసులోనున్న చంపకను ఒంటరిగా విడచిపోవ కాళ్ళాడక చిలుకకు వప్పగించి తను ఆఫ్రికాదేశములకు వర్తకమునకు పోయెను. జంబులకుని ప్రియురాలైన చంపక సినిమా వ్యామోహంబున తాటాకులరెడ్డిపై మన్మథ విరహము పొందియుండగా తాటాకుల రెడ్డి తన డైరక్టరును పిలచి నీవు ఏ విధముననైనను చంపకను హీరోయిన్జేతునను నెపంబున శయన గృహంబునకు బిలచుక రమ్మని బంపిన ఆ డైరక్టరువచ్చి చంపకకు యీ సంగతినిజెప్ప మిక్కిలి సంతోషపడి రాత్రి పన్నీట జలకమాడి సమస్తాభరణములు ధరించుకొని డైరక్టరు వెంబడి మెల్లగా స్టూడియోకిగాని హోటలునకుగాని పోవలయునని ప్రయత్నపడి పోవు సమయమున యీవిధను చిలుకచూచి.

"చంపకా! నీవు పోవు కార్యము బహు ప్రమాసకరము. ఇదిగో మంచి పద్యమున్నదివెద న్వినుము.

పంక్తికంఠుని మోహపరితాపమెంచెనే?
భువనమాత జగత్ప్రఖ్యాత సీత
యల పుళిందుని బొంద నాసక్తిజెందెనే?
ప్రియ హితామితనయ భీమ తనయ
నహుషుని పరహంస దహ
దహాల్చెనే?



సాంద్ర సద్గుణచర్య ఇంద్రు భార్య
మతి సింహబలుని పెన్మాయల
జిక్కెనే
యాలకి పరిబూని యాజ్ఞసేని
ముసుపటి పతివ్రతలు మహామూర్ఖచిత్తు
లైన దుర్జను అతిఘోర మానసాయ
కాస్త్ర జర్జరితాత్ములై యాపవిత
మానముడి పుచ్చుకొనిరటే మచ్చె
కంటి!

అంతట కలకల నగవు తోవ కర కంకణ ధ్వాన లాహానము వినువడింపగా అక్కలకంఠి యిట్లనియె!

"శుకోత్తమా నే వ్రాలెడి క్షత్రప

తనుగాననియు తాటాకుల రెడ్డి మహాపూర్వ ప్రియుండనియు ఏకత్ లవ్వానును జేయ నుపాయంబు సెప్పక ఈ తి ప్రాత తాటాకు నీతులన్ త్రవ్వ పాకిచే" అని ఆ చంపక యను ప్రమద ఫక్కుమనెను.

అంతట చిలుక రూపములో నున్న విక్రమార్కుడు తన తప్పిదమును పైకగబడనీయక కించిదాలోచనా నిమగ్నుడై "చంపకా! నీకు సినిమా చమత్కారములు దెలుపు నుద్దేశముతో తొలుత జాతిప్రత్యయమును గూర్చి పలికితిని కాని నీ నా చెప్పు సినీ కథలన్నిటి ఆలని నీ చిత్తము వచ్చిన రీతి బ్రవర్తింపుము. నిను గొనిపో వచ్చిన యా డైరక్టరాగ్రణిం గూడ నా చిత్రకథలను సాకల్యముగా విని ధన్యత్వ కమ్మని దెల్పవే" అని ఆ చిలుకమర్యాదగా ప్రత్యుత్తరమిచ్చెను.

అంతట తాటాకుల రెడ్డిగారి డైరక్టరు ముకుళిత కరకమలుండై "పది లక్షల వరాల చిలకవు. నేనొట్టి ఎడ్డికేచెక్ గాను. నాకు నీ సంస్కృతం తెలుగు అట్టే బోధపడి చావదు గనుక సరైన జాను తెలుగులో చెప్పమని వేడుకొనియె. చంపక కూడా "పుస్తకాల్లో తెలుగు మాట్లాడి మా ప్రాణం తీయక చెప్పేదేదో ఇంటరస్టింగ్‌గా చెప్పు" అని వేడుకొనియె.

ఇక గత్యంతరంలేక చిలుక వాడుక భాషలో సినీ చమత్కార కథలను చంపకకు చెప్పటం ప్రారంభించింది.

(సశేషం)

# "పద్మశ్రీ"ల ఔన్నత్యం



'నట సామ్రాట్' … 'భూరి విరా … ళం ప్రకటించడమే … చిత్ర ప్రదర్శనని రద్దు చేసుకుని. అందుకు వినియోగించాల్సిన మొత్తాన్ని బాధితులకు విరాళంగా ప్రకటింపజేసి, అంతటితో తృప్తి చెందక సినిమా వాహినీవాళ్ళని జయించి, వసూలైన మొత్తాన్ని తుఫాను బాధితుల కందు సప్లగా జేసి తన సౌజన్యాన్ని నిరూపించుకున్నారు.

"నటరత్న" తాసియ దలచినది యుక్తమేగాక, "యూనిటీ" వల్ల ఎంతటి పనైనా సాధించడం సులభమన్న సూత్రం గ్రహించినవాడు కాబట్టి చిత్రసీమలోని ప్రముఖ నిర్మాతలతో సహా అందరి సహకారంతో ఒక యజ్ఞానికే సిద్ధపడి, తుపాను ప్రమాదం సంభవించని జిల్లా కేంద్రాల్ని తన యజ్ఞకూటములుగా నిర్ణయించుకొని, అందుకు పథకాన్ని సిద్ధం చేసుకోబోతున్నాడు. అశ్వమేధయాగంలో (రాయలసీమ క్షామం, పాకిస్థాన్ దండయాత్ర) ఎదురెరుగని యీ 'తారకరాము' నకు ముందున్న మహాయజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగాలని మా ఆకాంక్ష




## సత్తెకాలపు సత్తెయ్య

"ఉమ్మెత్త దెబ్బ" లాటి అని చెప్పి తెలుగు ప్రేక్షకులను ఆస్ప్రిన్ ఆస్ప్రో సారిడన్‌ల పాల్జేయుచున్న తరుణంలో గులాబినే గులాబి యని చెప్పక ఆ విషయాన్ని తెలుగు ప్రేక్షక విజ్ఞతికే వదలిన "ప్రసాదార్ట్స్" వారు మిక్కిలి అభినందనీయులు

"స్టార్‌డమ్" కే మాత్రం విలువ నీయక ద్వితీయశ్రేణినటులతో ఉత్తమ శ్రేణి చిత్రంగా మలచినదీ "సత్తెకాలపు సత్తెయ్య'

ఇంతటి విలక్షణమైన చిత్రాన్ని నిర్మించిన నిర్మాత వి కె ప్రసాద్‌ను, కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలను వహించిన కె బాలచందర్‌ను తప్పక అభినందించాలి (కేవలం మాటల్తోనే కాదు, సుమండీ!)

కథ ఆద్యంతం చలం (ఆంధ్రా జీవ్) రోజారమణిల చుట్టూ తిరుగుతూ, ఏ మాత్రం విసుగు జనించకుండా రామన్న సంఘటనలను గుర్తించాలన్న అనక్తిని రేకెత్తిస్తుంది.

ఈ చిత్రంలో నటీనటుల ఎన్నిక, వారు వారి పాత్రలకు చేకూర్చిన న్యాయం గణనీయం.

ఈ చిత్రం పూర్వావారిద్వారా జూన్



"ప్రతీకారా" నికి రెడీ అంటున్నది సంధ్యారాణి!

10వ తేదీనుండి అన్ని ముఖ్య కేంద్రాలలోను విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది.

తెరపైన పేర్కొన్నవారే కాక శోభన్‌బాబు, గుమ్మడి, రావి కొండలరావు, నాగేష్, విజయలలిత, రాజశ్రీ యస్వరలక్ష్మి, హేమలత తదితరులు.

ప్లేబాక్ కాంబినేషన్ ఈ చిత్రంలో ఉన్నంతగా మరే చిత్రంలోను ఉండదేమో! (ఘంటసాల, పి.బి. శ్రీనివాస్, బాలసుబ్రమణ్యం, పిఠాపురం, సుశీల, ఎల్లారీశ్వరి, వసంత, బెంగుళూరులత).

## ముహూర్తబలం

ఇటీవలే విడుదలైన చిత్రం "ముహూర్తబలం" కథ మంచి బలంగానే ఉంది. పాత్రధారుల ఎన్నిక కూడా అందుకు తగ్గట్టుగానే ఉంది. హరనాథ్ అతిథినటుడైనా తానున్నంతసేపు శభాష్ అనిపించుకున్నారు. పాటల్లో కాయ్....కాయ్ కావలికాయ్; బుగ్గగిల్లగానే సరిపోయిందా; నీకు ఎంత మనసుందో నాకు తెలుసునోయ్; చిరుచేదు పానీయము చింతలను మరపించులే అన్నవి చిత్రానికి సహజత్వాన్ని కల్గించాయి. నటన విషయంలో జమునదే అగ్రస్థానం . . .

జి. రామినీడు దర్శకత్వంలో లలితా ఆర్ట్సువారు నిర్మించే సాంఘిక చిత్రంలో కృష్ణ, చలం, వాణిశ్రీ విజయనిర్మల ఇంతవరకు ఎన్నికయ్యారు.

## శ్రీ గౌతమీ పిక్చర్స్
## "ఆలీబాబా నలభై దొంగలు"

ఎన్టీఆర్, జయలలితలతో నిర్మిస్తున్న యీ చిత్రంలో మిక్కిలినేని, నాగభూషణం, సత్యనారాయణ, హేమలతలు నటిస్తున్నారు.

సంభాషణలు: డి. వి. నరసరాజు మ్యూజిక్: ఘంటసాల; దర్శకత్వం విఠలాచార్య (విఠలాచార్య).

## చలనచిత్రంగా "వారధి"

ద్వివేదుల విశాలాక్షిగారి కలం నుండి వెలువడిన "వారధి" నవలాధా



నన్నెరి చూపుల్లో కాంక్ష కర్దం
"రాజ్యకాంక్ష"

రంగా పి. ఎస్. గాంధి నిర్మించే చిత్రంలో కృష్ణ, పద్మాకరరెడ్డి, సావిత్రి విజయనిర్మల నటిస్తున్నారు. దర్శకత్వం: సి. యస్. రావ్.

## శ్రీ సరస్వతీ చిత్ర వారి "పంచకల్యాణి - దొంగలరాణి" కాంతారావు, విజయలలితల కాంబినేషన్

వగలు వలపులు చూపి ప్రేక్షకుల మనసుల నాకట్టుకున్న అందాలసినీసితార విజయలలిత - తన తండ్రిని చెరసాలలోవేసి, సింహాసనాన్ని స్వంతం చేసుకొన్న సర్వసైన్యాధిపతి ధూమకేతుకు సింహస్వప్నమైంది. ఆపద సమయాల్లో పేదలపాలిటి పెన్నిధిగా, పంచకల్యాణిపై స్వారీచేస్తూ దుర్మార్గుల గుండెల్లో గూడుకట్టుకున్న "దొంగలరాణి" అంతఃపురంలో అష్టైశ్వర్యాలు అనుభవించవలసిన యువరాణి, దొంగల ముఠానుంచి విడిపోయిన చెన్నప్ప గుడిసెలో పెరిగి పెద్దదైంది. అస్త్రశస్త్ర విద్యలలో ఆరితేరింది.

ఒకచేత కత్తి మరొక చేత కొరడాతో ఎవరూ గుర్తించలేని దుస్తుల్లో ప్రజలను ఆదుకొంటున్న దొంగలరాణి మనసు అతి సాహసంతో దోచుకున్నాడు విజయుడు. ఒకానొక సమయంలో అతనితోనే పోరాడవలసి వచ్చింది దొంగలరాణి గుప్త ఘ కొరడాతో విజయుని చేతిమీద అంటించింది. ఎదురుగా పోరాడుతున్నదెవరో తెలియక బెబ్బులిలా విజృంభించాడు ప్రియురాలిమీదకు. ఎవరి ప్రాణాలకు ముప్పు వాటిల్లినా ప్రమాదమే.

సరికొత్త కథా సంవిధానంతో శరీరాలు గగుర్పొడిచే మహోజ్వల సన్నివేశాలలో భారీ ఎత్తున నిర్మిస్తున్న ఈ చిత్రంలో కొండకోనల్లో విజయలలిత కత్తి కొరడా ముష్టియుద్ధాలు ప్రత్యేకాకర్షణలతో చిత్రీకరింపబడ్డాయి.

శ్రీ గిడుతూరి సూర్యం - ఈ చిత్రానికి దర్శకుడేకాదు, కథా రచయిత కూడా!

సూర్యం కలంనుంచి వెలువడిన ఈ కథ అడుగడుగునా ఉత్తేజాన్ని కలిగిస్తూ, జానపదాలలో, ఉన్నతస్థానాన్ని ఆక్రమిస్తుందనటంలో సందేహంలేదు.

పూర్ణా పిక్చర్స్ ద్వారా జులై నెలలో విడుదలకానున్న యీ చిత్రానికి సంభాషణలు రెంటాల గోపాలకృష్ణ.

పబ్లిసిటీ: కల్పన ఎంటర్ ప్రైసెస్.

## సురేష్ మూవీస్

జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకత్వంలో డి. రామానాయుడునిర్మించే సాంఘికంలో నాగేశ్వరరావుద్విపాత్రాభినయం ఆకర్షణీయం కాగలదు.



"భలేరంగడు"లో నాగభూషణానికేదోగా ఉన్నట్లుంది, గుమ్మడి, వాణిశ్రీ అదోలా ఉన్నారు!

---

జగ్గయ్య నాగభూషణం ప్రభాకరరెడ్డి కె ఆర్ విజయ భారతి ఎల్ విజయలక్ష్మి నటిస్తున్న యీ చిత్రకథ తురైయూరె మూర్తి సంభాషణలు భమిడిపాటి రాధాకృష్ణ

"జరిగిన కథ"

నాగావళి (జేతా) ఫిలిమ్స్ బేనర్‌పై నిర్మించే యీ చిత్రంలో జగ్గయ్య కృష్ణ, కాంచన, విజయలలిత, రాజబాబు, నాగయ్య ప్రధాన తారలు కాగా హరనాథ్ వాణిశ్రీలు గెస్టుస్టార్స్

కథకుడు దర్శకుడు కె బాబూరావు నిర్మాత కె ఎ ప్రభాకర్

అక్కా - చెల్లెలు

జానకి విజయనిర్మల అక్కా - చెల్లెళ్ళుగా నటిస్తున్న యీ చిత్రంలో నాగేశ్వరరావు, కృష్ణ గుమ్మడి పద్మనాభం, విజయలలిత, రమాప్రభ ప్రధాన పాత్రలు పోషిస్తారు ఆత్రేయ

సంభాషణలతో మహాదేవన్ స్వరకల్ప నతో ఆత్రేయారుద్రల గీతాలు గోదావరి గల గలలు చేస్తాయి నిర్మాత వి కృష్ణప్రసాద్ (జగపతి రాజేంద్రప్రసాద్ సోదరుడు) దర్శకత్వం సంజీవి

## మామకు తగ్గ కోడలు

ఒకరి ప్రాణాలు మరొకరు బలిగొనేందుకు ప్రయత్నిస్తూ అడుగడుగునా దిగ్భ్రమచేసే సన్నివేశాలతో నిండిన చిత్రం బాలాజీ ఫిలింస్



ఎవరీ సతీపతులు? పూల వారధి నిర్మిస్తున్నారు!

